భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ శివ పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ శివ పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్

అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।
అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...



# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| శివపురాణంలో చెప్పబడ్డ విషయాలు | 5 | విభూతి | 68 |
| మునులు సూతుడిని ప్రశ్నించటం | 9 | గురుమహిమ | 70 |
| కలియుగం | 10 | పార్థివలింగ మాహాత్మ్యం | 76 |
| శివ పురాణ వైభవం | 12 | పార్థివ శివలింగ పూజా విధానం | 78 |
| శివలింగం - శివమూర్తి | 16 | పార్థివలింగాల పూజాఫలం | 84 |
| బ్రహ్మ - విష్ణువుల సంగ్రామం | 18 | శివ నైవేద్యం | 87 |
| బ్రహ్మ శిరస్సు ఖండించటం | 23 | బిల్వమహిమ | 88 |
| అరుణాచల వైభవం | 25 | శివనామ మహిమ | 89 |
| పంచకృత్యాలు-ప్రణవం-పంచాక్షరీ | 27 | భస్మం-దానిని ధరించే విధానం | 92 |
| శివలింగ ప్రతిష్ట - పంచాక్షరీమంత్ర జపం | 31 | రుద్రాక్షలు - వాటి మాహాత్మ్యం | 100 |
| పుణ్యనదులు - పుణ్యక్షేత్రాలు - | | శ్రీ కుబేరుడి చరిత్ర | 108 |
| పాపపుణ్యాలు | 36 | శ్రీ కాలభైరవ చరిత్ర | 115 |
| సదాచారం- శౌచం (పవిత్రత) | | పరమేశ్వరుడి పంచావతారాలు | 122 |
| - ధర్మానుష్ఠానం | 41 | పరమేశ్వరుడి అష్టమూర్తులు | 124 |
| దానం - దేశం - కాలం - పాత్రత | 49 | అర్థనారీశ్వర రూపం | 125 |
| శివపూజచేసే పద్ధతి-శివపూజా ఫలం | 53 | పరమేశ్వరుడి దశావతారాలు | 127 |
| తిథులు - దేవతల పూజా ఫలాలు | 56 | ఏకాదశ రుద్రుల అవతారాలు | 129 |
| ఓంకారం-పంచాక్షరీ మంత్ర మహిమ | 59 | ద్వాదశ జ్యోతిర్లింగాలు | 131 |
| బంధం - మోక్షం | 64 | ఉప జ్యోతిర్లింగాలు | 135 |
| శివలింగ మహిమ | 66 | శివపురాణం - ఫలశ్రుతి | 136 |




# శ్రీ శివ పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయందీరయేత్ ॥

భగవాన్‌వేదవ్యాస మహర్షి రచించిన పురాణంలో శివమహాపురాణం ఎంతో విశిష్ఠమైనది. పరమేశ్వర తత్త్వాన్ని, పరమేశ్వరుడి లీలల్ని విస్తృతంగా వర్ణించిన ఈ పురాణం, అష్టాదశపురాణాలలో వాయుపురాణ స్థానంలో వుంటుందని కొందరు అభిప్రాయపడతారు. అయితే అష్టాదశ పురాణాలను గురించి చెప్పే శ్లోకాలలో ఈ పురాణం ప్రస్తావన కనిపించదు కనుక శివ మహాపురాణాన్ని స్వతంత్ర పురాణంగానే ఎక్కువమంది పరిగణిస్తారు.

శివమహాపురాణం సుమారు 26వేల శ్లోకాలతో రచించబడ్డ బృహద్గ్రంథం. ఇందులో మొత్తం ఏడు సంహితలున్నాయి. 1.విద్యేశ్వరసంహిత 2.రుద్రసంహిత 3.శతరుద్రసంహిత 4.కోటి రుద్ర సంహిత 5.ఉమాసంహిత 6.కైలాససంహిత 7.వాయుసంహిత అనేవి. ఈ ఏడు సంహితల్లో శివసిద్ధాంతం ఎన్నో ఉపాఖ్యానాలు, స్తోత్రాలు, శివలింగాల చరిత్రలు, తదితర విశేషాలు సవివరంగా చెప్పబడ్డాయి. శైవ సంప్రదాయానికి సంబంధించిన సకల విజ్ఞాన సర్వస్వం ఈ శివపురాణం

## శివపురాణంలో చెప్పబడ్డ విషయాలు

**1. విద్యేశ్వర సంహిత :** ఇందులో మొత్తం 25 అధ్యాయాలున్నాయి. వీటిలో, మునిప్రశ్న, శివపురాణ పరిచయం, శ్రవణ, మనన, కీర్తనల ప్రాముఖ్యత, లింగం–మూర్తి విశేషాలు, బ్రహ్మ విష్ణువుల సంవాదం, శివరాత్రి అరుణాచలం, పంచకృత్యాలు, ప్రణవ పంచాక్షరి, లింగ ప్రతిష్ఠ, శివతీర్థాలు – క్షేత్రాలు,

సదాచారం, శౌచం, ధర్మానుష్ఠానం, మూడు రకాల యజ్ఞాలు,దానం దేశకాలాల పాత్ర, శివపూజా విధానం–ఫలితం, ప్రణవ పంచాక్షరీ మంత్ర జప మహిమ, శివలోక వైభవం, శివలింగ మహిమ, పార్థివలింగమాహాత్మ్యం, పార్థివపూజా మహిమ, శివనైవేద్యాలు, శివనామమహిమ, భస్మధారణ మాహాత్మ్యం, రుద్రాక్ష మహాత్మ్యం, అనే విషయాలు చెప్పబడ్డాయి.

**2. రుద్రసంహిత :** 1.సృష్టి ఖండం– ఇందులో ఇరవై అధ్యాయాలున్నాయి. వీటిలో నారదుడి తపస్సు, శ్రీహరి జననం, శబ్ద బ్రహ్మశివతత్త్వం, పరమశివతత్త్వం, శివపూజావిధి, సారఅసార వస్తువిచారం, శివపూజ, రుద్రావతారం, సృష్టివర్ణన, గుణనిధి చరిత్ర, శివుడితో కుబేరుడి మైత్రి, శివుడు కైలాసానికి వెళ్ళటం అనేవి చెప్పబడ్డాయి.

**2. రుద్రసంహిత :** 2.సతీ ఖండం–ఇందులో సంక్షేపంగా సతీదేవి చరిత్ర, మన్మధుడి ఆవిర్భావం, మన్మథుడి వాహనం, మన్మథుడి వివాహం, సంధ్య చరిత్ర, సంధ్యాదేవి తపస్సు, అరుంధతి, వసంతుడు, మన్మధగణాలు, బ్రహ్మకి జ్ఞానోదయం, దుర్గాదేవి స్తుతి, దక్షుడికి వరం, నారదుడికి శాపం, సతీదేవి జననం, బాల్యం, నందావ్రతం, కల్యాణం, సతీశివుల వివాదం, భక్తిమహిమ, శ్రీరాముడికి పరీక్ష, సతీవియోగం, దక్షుడి విరోధం, దక్షయజ్ఞప్రారంభం, సతీదేవి దేహత్యాగం, వీరభద్రుడి వీర విహారం, యజ్ఞవిధ్వంసం, దక్షయజ్ఞ పరిసమాప్తి వంటి విషయాలు వివరంగా వర్ణించబడ్డాయి.

**2. రుద్రసంహిత :** 3.పార్వతీ ఖండం–ఇందులో మొత్తం 55అధ్యాయాలున్నాయి. వీటిలో ప్రధానంగా–హిమవంతుడి వివాహం దేవీస్తుతి, పార్వతి జననం, నారద హిమాలయ సంవాదం, కుజగ్రహోత్పత్తి, తారకుడి తపస్సు, కామదహనం, దేవతలు శివుణ్ణి నిందించటం, శివసాక్షాత్కారం, సప్తర్షుల రాక, అనరణ్యుడు, శివుడి యాత్ర, శివుడి సుందర రూపం, కన్యాదానం, శివుడు మోహపడటం, శివుడి కైలాసయాత్ర, పతివ్రతా ధర్మాలు లాంటివి వివరించబడ్డాయి.

**2. రుద్రసంహిత :** 4.కుమార ఖండం–ఇందులో మొత్తం 20 అధ్యాయాలున్నాయి. వీటిలో కుమారస్వామి జననం, కుమారుడికి అభిషేకం, కుమారలీల, దేవాసుర

సంగ్రామం, తారకాసుర వధ, కార్తికేయస్తుతి, గణపతి జననం, శిరచ్ఛేదం, గణపతి వివాహం లాంటి ప్రధానమైన విశేషాలు చెప్పబడ్డాయి.

**2. రుద్రసంహిత :** 5.యుద్ధ ఖండం - ఇందులో మొత్తం 59 అధ్యాయాలున్నాయి. వీటిలో ప్రధానంగా-త్రిపురవర్ణన, శివస్తుతి, త్రిపురదహనం, దేవస్తుతి, మయస్తుతి, దేవాసురయుద్ధం, విష్ణు జలంధరయుద్ధం,శివజలంధరుల యుద్ధం, శంఖచూడుడి జననం, దేవదేవుడి స్తుతి, స్కంద శంఖచూడుల యుద్ధం, భద్రకాళీ శంఖచూడుల యుద్ధం, సాలగ్రామశిల విష్ణుస్వరూపం, అంధకాసురుడు, శివుడు శుక్రాచార్యుణ్ణి మ్రింగేయటం, శుక్రుడు మృతసంజీవనీ విద్యసంపాదించటం, శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధం, గజాసుర సంహారం, విదలోత్పలుడనే అసురుడి వధ లాంటి ప్రధాన విషయాలు వర్ణించబడ్డాయి.

**3. శతరుద్రసంహిత :** ఇందులో మొత్తం 42 అధ్యాయాలున్నాయి. వీటిలో ప్రధానంగా - శివుడి అయిదు అవతారాలు, అష్టమూర్తులు, ఋషభావతారం, నందీశ్వరావతరం, భైరవావతారం, నృసింహావతారం, శరభావతారం, శివుడి దశావతారాలు, ఏకాదశరుద్రుల అవతారం, కిరాతావతారం, ద్వాదశజ్యోతిర్లింగాలు లాంటి విషయాలు వర్ణించబడ్డాయి.

**4. కోటిరుద్రసంహిత :** ఇందులో మొత్తం 43 అధ్యాయాలున్నాయి. వీటిలో జ్యోతిర్లింగాలు, వాటి ఉపలింగాలు, శివలింగమాహాత్మ్యం, మహాబలేశ్వరలింగం, గోకర్ణక్షేత్రమాహాత్మ్యం, హాటకేశ్వరుడి ఆవిర్భావం. సోమనాథ, మల్లికార్జున, మహాకాలేశ్వర, ఓంకారేశ్వర, కేదారేశ్వర, భీమేశ్వర, విశ్వేశ్వర, జ్యోతిర్లింగాలు, త్ర్యంబకేశ్వర, వైద్యనాథేశ్వర, నాగేశ్వర, రామేశ్వర, ఘుశ్మేశ్వర, జ్యోతిర్లింగాలు, శివసహస్రనామాలు, శివరాత్రి వ్రతమాహాత్మ్యం, ముక్తినిరూపణం, జ్ఞాననిరూపణ లాంటి విశేషాలు ప్రధానంగా వివరించబడ్డాయి.

**5. ఉమాసంహిత :** ఇందులో మొత్తం 51అధ్యాయాలున్నాయి. వీటిలో ప్రధానంగా శివభక్తి మహాత్మ్యం, శివమంత్రప్రభావం, మహాపాతకాలు, నరకలోక

మార్గం, నరకయాతనలు, అన్నదాన మాహాత్మ్యం, పురాణ మహిమ, పాతాళలోక వర్ణనం, జంబూద్వీప వర్ణనం, జీవుడి పుట్టుక, కామోపభోగాలు – దోషాలు, యోగమహిమ, ఛాయాపురుష వర్ణనం, ఆదిసృష్టి, దక్షుడి సృష్టి, కశ్యపవంశవర్ణనం, మరుత్తుల చరిత్ర, సగరోపాఖ్యానం, ఏడుగురు కిరాతుల కథ, వ్యాసుడి జననం, శుంభ నిశుంభవధ, ఉమాదేవి ప్రాదుర్భావం, తదితర విశేషాలు  వివరించబడ్డాయి.

**6. కైలాససంహిత :** ఇందులో మొత్తం 23 అధ్యాయాలున్నాయి. వీటిలో – ఓంకారస్వరూపం, సన్న్యాసనియమాలు, సన్న్యాస మండలవిధి, శివధ్యానం, పూజావిధి, సూతుడి తీర్థయాత్ర, సన్న్యాసం స్వీకరించే పద్ధతి, పంచబ్రహ్మ వర్ణనం, శివుడి ఉపాసనా మూర్తులు, మహావాక్యనిరూపణం, యతి నియమాలు, తదితర విశేషాలు వివరించబడ్డాయి.

**7. వాయవీయ సంహిత :** ఇది పూర్వభాగం, ఉత్తర భాగం అని రెండుగా విభజించబడింది.  పూర్వభాగంలో–పురాణస్వరూపం, నైమిషోపాఖ్యానం, జీవస్వరూపం, శివతత్త్వజ్ఞానం, కాలమహిమ, సృష్టిస్థితి లయాలు, రుద్రుల ఆవిర్భావం, దక్షయజ్ఞ విధ్వంసం, పార్వతి గౌరిగామారటం, శివశక్తుల స్వరూపం, పరమశైవ ధర్మాలు, పాశుపతవ్రతం, ఉపమన్యుడి వృత్తాంతం లాంటి విశేషాలు వర్ణించబడ్డాయి.

ఉత్తరభాగంలో శ్రీకృష్ణుడికి శివుడు వరప్రదానం చేయటం, శివుడి అష్టమూర్తి, శివమహిమ, శివుడి యోగావతారాలు, పంచాక్షరమంత్ర మాహాత్మ్యం, జపవిధి, శివసంస్కారం, గురుమహిమ, శుశ్రూష, పంచాక్షరీ పునశ్చరణ, శివమానసపూజ, శివభక్తి మహిమ, శివమహాస్తోత్రం, శివలింగవ్రతం, అష్టాంగ యోగంలాంటి విశేషాలు వర్ణించబడ్డాయి.

ఇంత విస్తృతమైన శివమహాపురాణంలోని ప్రధాన విషయాలని స్తోత్రాలని సంక్షిప్తంగా ఈ గ్రంథంలో మీకు అందిస్తున్నాం.



# మునులు సూతుడిని ప్రశ్నించటం

శ్రీ పరమేశ్వరుడు ఆది మధ్య అంతాలలో మంగళమైన వాడు. జనన మరణాలు లేనివాడు. చరాచర జగత్తులో సృష్టి, స్థితి, లయ. తిరోధానం, అనుగ్రహం అనే అయిదు పనుల్ని ఎలాంటి కష్టం లేకుండా చేసేవాడు. పంచ ముఖాలు కలిగినవాడు, సర్వశ్రేష్టుడు జగదీశ్వరుడు అయిన అంబికానాధుడిని మనస్సులో ధ్యానిస్తున్నాను, అని వ్యాసమహాముని మహాశివపురాణాన్ని ప్రారంభించాడు.

ధర్మాచరణలో గొప్పక్షేత్రం, గంగా యమునా నదులకు సంగమస్థానం పరమ పుణ్యప్రదమైనది ప్రయాగక్షేత్రం. ఆ దివ్య క్షేత్రంలో సత్యవ్రతాన్ని ఆచరించే వాళ్ళు, తేజస్సుతో వెలుగొందేవారు. మహాత్ములైన ముని శ్రేష్టులు, సత్రయాగాన్ని నియమంగా చేస్తున్నారు.

అటువంటి పరమ పవిత్రమైన సత్రయాగం ప్రయాగక్షేత్రంలో జరుగుతోందని విన్న వ్యాసమహర్షి శిష్యుడు, పురాణ ప్రవచనం చేయడంలో పండితుడు అయిన సూత మహాముని అక్కడికి విచ్చేసాడు. గొప్ప తపస్సంపన్నుడైన సూతమునిని చూసి ఆ సత్రయాగాన్ని నిర్వహిస్తున్న మునులందరు సంతోషించారు. ఎంతో భక్తిశ్రద్ధలతో శాస్త్రోక్తంగా ఆయన్ని పూజించారు. తమ ప్రేమాభిమానాల్ని ప్రదర్శించిన తరువాత ఆ ఋషులందరూ ప్రసన్నమైన మనస్సుతో సూతమునికి నమస్కరించి ఓ రోమహర్షణా! సూతమునీంద్రా! నీవు సర్వజ్ఞుడివి, ఎంతో గోప్పవాడివి. అందుకే వ్యాసమహర్షి నుంచి సంపూర్ణంగా పురాణాల సారాంశాన్ని గ్రహించావు. అందుకే ఎంతో గొప్పవైన రత్నాలకి సముద్రం నిలయమైనట్టు, నీవు అమూల్యమైన పురాణ కథలకు, గాథలకు నిలయంగా ఉన్నావు. నీకు ఈ ముల్లోకాల్లో తెలియని వస్తువు లేదు.

మా అందరి అదృష్టం వల్ల నీవు మా యాగాన్ని చూడటానికి ఇక్కడికి వచ్చావు. మా అందరికీ ఏదో ఒక మంచి విషయాన్ని చెప్పకుండా నీవు వెళ్ళ కూడదు స్వామీ. మేమందరం ఇప్పటి వరకూ ఎన్నో తత్త్వాల్ని, కథల్ని, గాథల్ని

విన్నప్పటికీ మాకు తృప్తి కలగటం లేదు. ఎన్నివిన్నా ఎంతవిన్నా ఇంకా వినాలనిపిస్తొంది. ఓ సూతమహర్షీ! నీవు మంచి మనస్సు కలిగినవాడివి. మాగురించి, మా అందరి కోరికను మన్నించి, మాకు హితమైనది ఏదో అది చెప్పమని కోరుతున్నాం.

## కలియుగం

స్వామీ! రాబోయేది భయంకరమైన కలియుగం. ఎన్నో పాపాలకు అది నిలయం.కలియుగం రాగానే మానవులంతా పుణ్యకర్మలు వదిలి పాపకర్మలు చేయటం మీదనే ఇష్టాన్ని కలిగి ఉంటారు. సత్యాన్ని పలుకరు. దురాచారాలు ఆచరిస్తుంటారు. ఏప్పుడూ పరుల్ని నిందిస్తూ పరుల సొమ్ముకోసం ఆశపడుతూ ఉంటారు. పరస్త్రీల మీద మోజు పెంచుకుంటారు. హింసా ప్రవృత్తి అధికమైపోతుంది. మనుషులంతా నాస్తికులుగా అవుతారు. పశువుల్లాగా వివేకం నశించి తల్లిదండ్రుల్ని ద్వేషిస్తారు. స్త్రీని కేవలం భోగసాధనంగానే చూస్తారు. కామానికి బానిసలౌతారు.

బ్రహ్మణులు లోభం అనే పిశాచం పట్టటంవల్ల వేద విధ్యను అమ్ముకుని డబ్బు సంపాదిస్తారు. కేవలం డబ్బుని సంపాదించటం కొసమే విద్య నేర్యుకుని తమంత గొప్పవారు లేరని అహంకారపూరితులై ఉంటారు. మూడుకాలాల్లో సంధ్యావందనిన్ని ఆచరించరు. వాళ్ళలో దయ, క్షమ, గుణాలు నశించి బ్రహ్మజ్ఞాన శూన్యులైపోతారు.

అదే విధంగా క్షత్రియులు కూడా తమ ధర్మాన్ని విడిచి పెట్టి, దుష్టులతో స్నేహం చేసి పాప కర్మల్ని ఆచరిస్తారు. ఎప్పుడూ వ్యభిచరిస్తుంటారు. శౌర్య పరాక్రమాలు కోల్పోయి యుద్ధం చేయాలంటే భయంతో పారిపోతుంటారు. ప్రజలను పన్నుల రూపంలో బాధించి, వారి కష్టార్జితం వీరు సుఖభోగాల్ని అనుభవిస్తుంటారు. శస్త్రాస్త్ర విద్యలు అసలు తెలుసుకోరు. గోవుల్ని, బ్రాహ్మణుల్ని, ప్రజల్ని రక్షించాలనే కనీస ధర్మాన్ని విడిచి పెడతారు. శరణు అని వేడుకున్న వారిని రక్షించరు. కేవలం తమ ఆనందం కోసం వేట అనే నెపంతో జీవహింస చేస్తుంటారు.

ఇక వైశ్యులు సంస్కారం లేకుండా తమ ధర్మాన్ని విడిచి ప్రవర్తిస్తుంటారు. తప్పుడు దారిలో నడుస్తూ, తప్పుడు తూకాలు వేస్తూ వ్యాపారంలో మోసం చేసి డబ్బు సంపాదించాలనే కాంక్షతో ఉంటారు. ఎంతో దుర్బుద్ధి కలిగిన వీరికి దేవతలు బ్రహ్మణుల మీద భక్తి అనేది ఉండదు. చాలామంది పిసినారి తనంతో ఎవరికీ కనీసం భోజనం కూడా పెట్టరు. వీరు కూడా వేశ్యల చుట్టు తిరుగుతూ, వారిని పోషిస్తూ విటులుగా జీవిస్తుంటారు. అజ్ఞానంతో పిసినారి తనంతో పుణ్యకార్యాలు చేయాలనే ఆసక్తి కోల్పోతారు.

అదే విధంగా శూద్రులలో కూడా స్వధర్మాన్ని విడిచి పెట్టే వారుంటారు. అయితే వారిలో కొందరు బ్రాహ్మణుల ఆచారాలు అనుసరించటంలో శ్రద్ధ చూపిస్తారు. మరి కొందరు ధర్మ విరుద్ధమైన ఆలోచనలు చేస్తూ బ్రహ్మణుల్ని దూషిస్తారు. వాళ్ళల్లో డబ్బు కలిగిన వాళ్ళు ఎక్కువగా తప్పుడు పనులు చేస్తుంటారు. ధనమధంతో ఆడంబరంగా అలంకరించుకుని తాము చేసే చిన్న ధర్మ కార్యక్రమాలకి, చాలా ఎక్కువగా ప్రచారం చేసుకుంటారు. వాళ్ళలో కొందరు దాన ధర్మాలు చేసే వారున్నప్పటికీ అహంకారంతో ఉంటారు. బ్రాహ్మణుల్ని తమకు సేవకుల్లాగా, వాళ్ళందరకీ తామే ప్రభువులమని భావిస్తుంటారు. మూర్ఖత్వంతో క్రూరమైన మనస్సుతో, పాపభీతి లేకుండా ప్రవర్తిస్తూంటారు. ఈ రకంగా నాలుగు వర్ణాల ప్రజలూ స్వధర్మాన్ని విడిచి పెట్టే వారుగానే ఉంటారు.

ఇక స్త్రీలు గురించి చెప్పాలంటే వాళ్ళలో అధిక శాతం పతితులౌతారు. భర్తకి అవమానం చేస్తారు. మామగారికి ద్రోహం చేస్తారు. భయభక్తులు ఉండవు. శీలం గురించి ఆలోచించకుండా కామ ప్రవృత్తితో పర పురుషుల మీద కోరిక కలిగి ఉంటారు. భర్త మీద ప్రేమభిమానాలు చూపించరు. వారి శరీరాలు ఎప్పుడూ రోగాలతో ఉంటాయి. అసూయ, ద్వేషం అనే దుర్గుణాలకు నిలయంగా ఉంటారు.

"ఓ సూతమునీ! ఇలా ప్రపంచంలో నాలుగు వర్ణాల వాళ్ళు, స్త్రీలు ఆవిధంగా స్వధర్మాన్ని విడిచి పెట్టి, కలి ప్రభావంతో దుష్ట చింతనలు కలిగి

రుష్కర్మల్ని ఆచరిస్తూ ఉంటే? వారికి ఇహ లోకంలో, పరలోకంలో ఏ గతి పడుతుందో! అని తలచుకుంటేనే మాకు బాధకలుగుతోందయ్యా, పరోపకారాన్ని మించిన పుణ్యం లోకంలో ఇంకొకటి లేదు కదా! కనుక కలియుగంలో కలి ప్రభావాన్ని పోగొట్టి మానవులందరికి పాపాలు పోయే మార్గమేమైనా ఉందా? నీవు ఎన్నో ధర్మ విషయాలు తెలిసిన వాడివి, దయచేసి ఆ మార్గాన్ని మా అందరికి ఉపదేశించమని వేడుకుంటున్నాం" అని భక్తితో వినయంగా అడిగారు.

అలా పరోపకార బుద్ధితో మానవులందరికి పాపాలు పోయి పుణ్యగతులు కలగాలనే సదాశయంతో, తనని ప్రశ్నించిన మునుల మంచి మనసుకి ఎంతో సంతోషపడ్డ సూత మహర్షి, వారి ప్రశ్నకి తగిన సమాధానం చెప్పాలని నిశ్చయించుకొని, మనస్సులో శంకరుణ్ణి స్మరించి, మునులతో ఇలా చెప్పటం ప్రారంభించాడు.

## శివ పురాణ వైభవం

ఓ సాధు పుంగవులరా! మునిశ్రేష్టులారా! మీరంతా ఎంతో ఆర్తితో మానవులందరికి ఉపయోగపడే మంచి ప్రశ్న అడిగారు. సంతోషం. మా గురు దేవులైన వ్యాస మహర్షుల వారిని స్మరించి మీకు తగిన సమాధానాన్ని చెబుతున్నా ఆనందంగా వినండి.

పురాణాల్లో శివ పురాణం ఎంతో గొప్పది. ఉపనిషత్తుల సారం అంతా ఇందులో ఉంది. అన్ని పాపాలనుంచి మానవుల్ని ఉద్ధరించి, మరణించిన తరువాత మోక్షాన్ని ఇస్తుంది. ఓ మునులారా ఈ పురాణంలో కలి దోషాన్ని పోగొట్టి మానవులకు ధర్మార్ధకామ మోక్షాలనే చతుర్విధ పురుషార్ధాల్ని అందించేది. ఎంతో గోప్పదైన శివుడి కీర్తి, అయిన గుణగణాలు, ఆయన తత్వం వివరించబడి ఉంది. ఈ పురాణాన్ని ఒక్కసారి చదివితే చాలు మానవులకి ఉత్తమ గుణాలు కలుగుతాయి. అసలు శివ పురాణం లోకంలో ప్రచారం కానంత వరకే బ్రహ్మ హత్యలాంటి ఘోరాలు ఉంటాయి. లోకంలో ఎన్నో కష్టాలు కలుగుతుంటాయి. శాస్త్రాలన్ని ఒక దానితో ఒకటి పోటీ పడుతుంటాయి.

అంతెందుకు శివతత్త్వం మహాత్ములకు తపో సంపన్నులకు కూడా పూర్తిగా తెలియదు. శివ పురాణం లోకంలో తమ మహిమని చూపించకుండా ఉన్నంత వరకే, యమభటులు భయం లేకుండా తిరుగుతుంటారు. పుణ్యతీర్థాలు, క్షేత్రాలు కూడా మేం గొప్ప అంటే మేం గొప్ప అని తగువులాడుతుంటాయి. మంత్రాలన్ని ఒకదాని కంటే ఒకటి ఎక్కువని పోటీ పడుతుంటాయి. అంతే కాదు. అన్ని పీఠాలు, అందరూ దేవతలు అన్ని రకాల సిద్ధాంతాలు ఒక దానితో ఒకటి ఆధిపత్యం కోసం వాదులాడుతుంటాయి.

ఓ పుణ్య పురుషుల్లారా! ఈ మహా పురాణాన్ని చెప్పటం వల్ల దాన్ని మీరు వినటం వల్ల పొందే పుణ్యం ఎంతో గోప్పదో నేను చెప్పలేను. అయినా నా శక్తి కొలద్దీ మీకీ ఈ దివ్య పురాణ మహత్యాన్ని చెప్పే ప్రయత్నం చేస్తున్నాను. మీరంతా భక్తి శ్రద్ధలతో మనసు లగ్నం చేసి వినండి.

పూర్వం ఈ పురాణాన్ని వ్యాస మహర్షి నాకు స్వయంగా చెప్పారు. ఈ పురాణంలో ఒక శ్లోకాన్ని గాని దానిలో సగాన్ని కాని ఎవరైతే భక్తి శ్రద్ధలతో పఠిస్తారో, ఆవ్యక్తి క్షణంలో తన పాపాలనుంచి విముక్తుడౌతాడు. ఎవడైతే ప్రతి రోజు శక్తి మేరకు ఇందులోని అధ్యాయాల్ని పఠిస్తాడో వాడు జీవన్ముక్తుడు, ఎవరైతే ప్రతిరోజూ ఈ పురాణాన్ని పూజాస్తారో వారికి అశ్వమేథయాగం చేసినంత ఫలం లభిస్తుంది.

ఏతచ్ఛివ పురాణ యో నమస్కుర్యాదదూరతః ।
సర్వదేవార్చన ఫలం స ప్రోప్నోతి న సంశయః ॥

ఎవరైతే శివ పురాణాన్ని భక్తిగా నమస్కరిస్తారో వారికి అందరి దేవతల్ని పూజించినంత ఫలితం లభిస్తుంది. దీనిని ఎవరైతే స్వయంగా వ్రాసి శివ భక్తులకు అందిస్తారో వారికి వేద శాస్త్రాలు అధ్యాయనం చేసి ప్రవచనం చేసినంత అదృష్టం కలుగుతుంది. అలాగే చతుర్ధశిరోజు ఉపవాసం చేసి భక్తులందరికి శివపురాణ మాహత్యాన్ని గురించి ఎవరైతే ప్రవచనం చేస్తారో అటువంటి ప్రవచనకారుడు పలికే ప్రతి అక్షరం గాయత్రి మంత్రాన్ని అక్షర లక్షలు జపించినంత ఫలితాన్ని అతడికి అందిస్తుంది.

ఎవరైతే చతుర్ధశి రోజు రాత్రి జాగారం చేసి ఈ శివపురాణాన్ని భక్తిగా చదువుతారో – లేక వింటారో వారికి కురుక్షేత్రంలో సంపూర్ణ సూర్య గ్రహణం రోజు, తన బరువుతో సమానమైన బరువున్న ధనాన్ని, వ్యాస మహార్షి లాంటి సత్పురుషులకు ఇస్తే ఎంత పుణ్యం లభిస్తుందో, అంతటి పుణ్యం కలుగుతుంది. ఇది సత్యం. ఇందులో సందేహం లేదు.

**రుద్ర సంహిత గొప్పతనం :-**

ఈ శివ పురాణాన్ని రాత్రింబగళ్ళు గానం చేసే వారు ఇంద్రాది దేవతల్ని కూడా ఆజ్ఞాపించగలరు. ఈ పురాణాన్ని ప్రతిరోజు చదివే, లేక వినే వ్యక్తి ఏ పుణ్య కార్యాన్ని చేసినా అది ఎన్నోరెట్లు ఎక్కువ ఫలితాన్నిస్తుంది. ఈ పురాణంలోని రుద్ర సంహిత ఎంతో గొప్పది. దాని మీద మనసు లగ్నం చేసి భక్తి శ్రద్ధలతో పఠిస్తే, ఆ పఠించే వాడు బ్రహ్మహత్యా పాపాన్నుంచైనా విముక్తి పొందుతాడు ఎవరైతే రుద్ర సంహితని భైరవుడి ఆలయంలో లేక విగ్రహం దగ్గర కూర్చుని పఠిస్తాడో వాడి కోరికలన్నీ తీరుతాయి. ఎవరైతే మర్రిచెట్టు లేక మారేడు చెట్టు చుట్టూ ప్రదక్షిణ చేస్తూ రుద్ర సంహితని పఠిస్తారో వారికి బ్రహ్మహత్యా పాపం నశిస్తుంది.

ఈ శివ పురాణంలో ఉన్న మరొక సంహిత కైలాస సంహిత ఇది ఇంకా పవిత్రమైనది. సాక్షాత్తు వేదాలు ఈ సంహితగా రూపాన్ని పొందాయి. ఈ సంహితలో ఓంకారం అర్థం వివరించబడింది. ఈ కైలాస సంహిత పూర్తి మాహాత్యం సాక్షాత్తు ఆ పరమేశ్వరుడికే తెలుసు.అందులో సగం మాత్రమే వ్యాసుడికి తెలుసు. ఆయనకి తెలిసిన దానిలో సగం నాకు తెలుసు. అందులో కొంత శాతమే నేను మీకు చెప్పగలను. పూర్తిగా చెప్పటం నావల్ల కూడా కాదు. అసలు ఈ సంహిత గురించి తెలిసిన మరుక్షణంలోనే మానవులు చిత్తశుద్ధిని పొందుతారు.

ఓ మునిశ్రేష్ఠులారా! రుద్రసంహిత నాశనం చెయ్యలేని పాపం లేదు. పరమేశ్వరుడు ఉపనిషత్తులనే సముద్రాన్ని మథిస్తే రుద్ర సంహిత అనే అమృతం పుట్టింది. ఆయన ఆ అమృతాన్ని కుమారస్వామికి అందించాడు. రుద్ర సంహిత

అమృతంలాంటిది. ఆ అమృతాన్ని త్రాగిన, అనగా పఠించినవాడు అమరుడౌతాడు. ఈ సంహితని ఒక్కసారి చదివితే దుష్టులనుండి తీసుకున్నదాని వల్ల దుష్టమైన మాటలు మాట్లాడినందువల్ల వచ్చిన పాపాలు పోతాయి. ఎవరైతే పితృతిధులలో (తద్దినాలలో) రుద్ర సంహితని పఠిస్తూ బ్రహ్మణులకు భోజనాన్ని పెడతారో, వాడి పితృదేవతలందరూ శివలోకాన్ని చేరతారు. ఎవరైతే చతుర్ధశి రోజు ఉపవాసం ఉండి మారేడు చెట్టు దగ్గర కూర్చుని ఈ సంహిత పఠిస్తాడో అలాంటి వ్యక్తి సాక్షాత్తూ శివుడే అవుతాడు.

ఇంతేకాదు ఈ మహాశివపురాణంలో కోరిన పుణ్యఫలాలందిచే ఇంకొన్ని సంహితలు కూడా ఉన్నాయి. వీటిలో శివలీలలు వర్ణించే సంహితలు రెండు చాలా గొప్పవి. ఈ శివపురాణ వేదంతో సమానమైనది.

తదిదం శైవ మాఖ్యాతం పురాణం వేదసమ్మితమ్ ।
నిర్మితం తచ్ఛివేనైన ప్రధమం బ్రహ్మ సంమ్మితమ్ ॥

వేదంతో సమానమైన ఈ శివపురాణాన్ని ముందుగా శివుడే నిర్మించాడు. (చెప్పాడు) ఈ శివపురాణంలో విద్యేశ్వర, రుద్ర, వినాయక. ఉమ, మాతృ, ఏకాదశ రుద్ర, కైలాస, శతరుద్ర, కోటిరుద్ర, సహస్ర కోటి రుద్ర, వాయు, ధర్మ సంహితలనే ఖండాలున్నాయి. ఇవి మొత్తం 12 సంహితలు. ఋషులారా! ఇందులో శ్లోకాల సంఖ్య చెప్తాను వినండి.

విద్యేశ్వర సంహితలో పదివేలు. రుద్ర, వినాయక, మాతృ. ఉమా సంహితల్లో ఒక్కొదానిలో ఎనిమిది వేలు, ఏకాదశ రుద్ర సంహితలో పదమూడు వేలు. కైలాస సంహితలో ఆరువేలు, శత రుద్ర సంహితలో మూడువేలు, కోటి రుద్ర సంహితలో తొమ్మిది వేలు, సహస్రకోటి రుద్ర సంహితలో పదకొండు వేలు, వాయు సంహితలో నాలుగు వేలు, ధర్మ సంహితలో పన్నెండు వేలు, ఇలా మొత్తం కలిపి ఒక లక్ష, శ్లోకాలు ప్రాచీన శివపురాణలలో ఉన్నాయి.

వ్యాస మహర్షి ఇంత పెద్ద పురాణాన్ని సంక్షిప్తం చేసి 24 వేల శ్లోకాలతో ఏడు సంహితలుగా రచించాడు. పరమేశ్వరుడు, సృష్టి మొదట్లో వంద కోట్ల

శ్లోకాలతో అంత పెద్దదైన మహాపురాణాన్ని నిర్మించగా. ద్వాపర యుగంలో కృష్ణ ద్వైపాయనుడు లాంటి మహార్షులు దానిని నాలుగు లక్షల శ్లోకాలకి తగ్గించి పద్దెనిమిది పురాణాలుగా విభజించారు. సాక్షాత్తు వేదతుల్యమైన ఈ శివపురాణంలోని ఏడు సంహితలలో మొదటిది విద్యేశ్వర సంహిత. రెండవది రుద్ర సంహిత, మూడవది శతరుద్ర సంహిత, నాలుగోది కోటిరుద్ర సంహిత, ఐదవది ఉమాసంహిత, ఆరోది కైలాస సంహిత, ఏడవది వాయవీయ సంహిత. ఇలా ఏడు సంహితలలో కూడుకున్న ఈ మహా శివపురాణం మోక్షాన్నిస్తుంది. పూర్తిగా ఈ పురాణాన్ని పఠించిన భక్తుడు శివలోకాన్ని శివ సాయిజ్యాన్ని పొందుతాడు.

శృతి స్మృతి పురాణేతిహసాగమ శతాని చ ।
ఏతచ్ఛివపురాణస్య నార్హంత్యల్పాం కలామపి ॥

శృతులు, స్మృతులు, ఇతర పురాణాలు, ఇతిహాసాలు, ఆగమాలు ఎన్ని ఉన్నప్పటికి ఈ శివపురాణం కన్న గొప్పవి కావు. సాక్షాత్తు శివుడి చేత నిర్మించబడిన ఈ శివపురాణాన్ని శివభకుడైన వ్యాసమహర్షి గ్రహించి మానవజాతి మొత్తానికి ఉపకారం చెయ్యాలనే ఆశయంతో అందించాడు. సాటిలేని ఈ పురాణం, ఆదివైవిక, ఆదిభౌతిక. ఆధ్యాత్మిక బాధల్ని పోగొట్టి సకల శుభ మంగళాలని కలిగిస్తుంది.

ఇందులో ప్రధానంగా ఉపనిషత్తులలో చెప్పిన మోక్షధర్మం ప్రతిపాదించబడింది. అసూయ లాంటి దుర్గుణాలు లేని మనసుతో, సత్పురుషులు తెలుసుకోదగిన శివుడితత్త్వం, గొప్ప మంత్రాలు, ధర్మార్థకామ మోక్షలనే పురుషార్థాలు, ఈ పురాణంలో చెప్పబడ్డాయి. ఆర్తితో భక్తితో ఈ మహాపురాణాన్ని పఠించేవాడు శివుడికి ప్రీతిపాత్రుడైన భక్తుడై చివరికి శివలోకాన్ని చేరతాడు.

## శివలింగం - శివమూర్తి

శ్రవణం-కీర్తనం-మననం అనే మూడు పనుల్ని చేయలేని వాడు పరమేశ్వరుణ్ణి లింగంలో కాని, మూర్తి అనగా విగ్రహంలో గానీ ఆవాహనచేసి,

ప్రతిరోజు భక్తిగా పూజించినట్లైతే, అతడు సంసాన సముద్రాన్ని సునాయాసంగా దాటగలుగుతాడు. తన శక్తికి మించకుండా తగిన ధనాన్ని సంపాదించి ప్రతిరోజు శివుడి కోసం శివపూజ కోసం కొంత భాగాన్ని ఖర్చుపెట్టాలి. అలాగే శివాలయాలు, అందులో మండపాలు, గోపురాలు, చెఱువులు, మఠాలు నిర్మించి అక్కడ ఉత్సవాలు చెయ్యాలి. అక్కడ ప్రతిష్టించిన శివుడికి షడ్రసోపేతమైన నైవేద్యాలు సమర్పించాలి. అవికూడా ఎలా చెయ్యాలంటే, మహారాజుకి ఎలాగైతే ఛత్ర చామర వింజామరతో సేవ చేస్తారో అదే విధంగా శివుడికి కూడా ఉపచారాలు చేయాలి. ప్రతి రోజు భక్తితో, శ్రద్ధగా ఆలయం చుట్టూ ప్రదక్షిణాలు చేసి, పంచాక్షరీ మంత్రాన్ని జపించాలి. ఈ విధంగా ప్రతిరోజూ ఆవాహననుంచి విసర్జన దాకా అన్ని ఉపచారాల్ని ఎవరైతే శ్రద్ధగా ఆచరిస్తాడో ఆ వ్యక్తి శివుడి అనుగ్రహంతో సిద్ధిపొందుతాడు. పూర్వకాలం మహాత్ములు మహర్షులు కూడా ఇదే విధంగా శివుడి లింగాన్ని – మూర్తిని పూజించటంతోనే మోక్షాన్ని పొందారు.

శివుడే పరబ్రహ్మస్వరూపుడు ఆయన నిరాకారుడుగా ఉంటాడు. అందుకే లింగరూపంతో ఒక ఆకారంలేకుండా పూజించబడుతుంటాడు. అలాగే ఆయన సాకారుడు. కనుక మూర్తి రూపంలో కూడా అర్చించ బడుతున్నాడు. ఇలా సాకార నిరాకార రూపాలతో ఉండడం వల్లనే శివుడిని పరబ్రహ్మ అంటారు.

ఇతర దేవతలు పరబ్రహ్మలు కారు, కాబట్టి వారందరూ ఆకారంతో పూజలందుకుంటున్నారు. శంకరుడి బ్రహ్మతత్త్వం ఎలాటిదంటే? అది ఉపనిషత్తుల సారంగా, ఓంకార శబ్ద అర్థంగా రూపుదిద్దుకుంది.

ఇతర దేవతలందరూ సాకారంగానే ఆవిర్భవిస్తారు. శివుడు సాకారంగా మరియు లింగాకారంగా కూడా ఆవిర్భవిస్తాడు. ఇలా ఆయన లింగాకారాన్ని ధరించటానికి ఒక గొప్ప కారణం ఉన్నది. పూర్వం మహాత్ములైన బ్రహ్మ విష్ణువులు ఒకరితో ఒకరు పోట్లాడుకోవటం ప్రారంభించారు. ఇలా చాలా కాలం పోట్లాడుకుంటూనే ఉన్నారు. అది చూసిన పరమేశ్వరుడు వాళ్ళిద్దరి అహంకారాన్ని పోగొట్టాలని, వారి మధ్యలో నిరాకారంగా ఒక పెద్ద స్తంభం

రూపంలో ఆవిర్భవించాడు. ఆలా స్తంభంలా, లింగ రూపాన్ని ధరించాడు కాబట్టి శివుడికి ఆనాటి నుంచి శివుడికి లింగ పూజ లోకంలో జరగసాగింది. ఇతర దేవతలందరినీ ఉపాసిస్తే కేవలం భోగాలు, శుభాలు మాత్రమే లభిస్తాయి. కానీ శివుడి లింగ రుపాన్ని పూజాస్తే భోగాలు, శుభాలతో పాటు మోక్షం కూడా లభిస్తుంది.

## బ్రహ్మ - విష్ణువుల సంగ్రామం

పూర్వం ఒకనాడు వేద వేత్త అయిన బ్రహ్మ దేవుడు వైకుంఠానికి వెళ్ళాడు. అక్కడ పద్మాల వంటి నేత్రాలతో సర్వాంగసుందరంగా ప్రకాశిస్తున్న విష్ణుమూర్తి చిద్విలాసంగా శేష పాన్పుమీద పడుకుని ఆయనకి కనిపించాడు. బ్రహ్మ లోపలికి వెళ్ళి విష్ణుమూర్తితో ఆవేశంగా ఎవరయ్యా నువ్వు! చతుర్ముఖుడైన నేను రావటం చూసి కూడా గర్వంగా పడుకున్నావు. నేను నీకు ప్రభువుని వెంటనే లేచి నాకు తగిన మర్యాదలు చెయ్. పూజించదగిన గురువు వచ్చినప్పుడు ఆయన్ని చూసికూడా ఎవడైతే అహంకారంతో, గర్వంతో ప్రవర్తిస్తాడో అలాంటి మూర్ఖుడికి ప్రాయశ్చిత్తం అనే శిక్ష విధించాలి అన్నాడు.

ఈ మాటలు విన్నాడు విష్ణువు. ఆయనకి చాలా కోపం వచ్చింది. అయినా తమాయించుకున్నాడు. మనస్సులో బ్రహ్మ మాటలకి కోపం ఉన్నప్పటికీ పైకి శాంతంగా ఉంటూ, వినయంగా "ఓ వత్సా! నీకు స్వాగతం. ఇదిగో ఇక్కడున్న ఈ ఆసనం మీద కూర్చోవయ్యా! నీ ముఖం ఏమిటి విచారంగా ఉంది? ఎందుకింత కోపంగా ఉన్నావు? నీ చూపులు కూడా శాతంగా లేవు. కారణమేమిటి చెప్పవయ్యా" అని అడిగాడు

ఓ విష్ణువు నేను చాలా అభిమానం కలిగిన వాణ్ణి, కాలంతో సమానమైన వేగంతో నీముందుకొచ్చాను. నేను నీకు పితామహుణ్ణి. నిన్నేకాదు ఈ జగత్తునంతా నేనే రక్షించేవాణ్ణి. ఆవిషయం నీకు చెప్పటానికే వచ్చానన్నాడు.

వత్సా! బ్రహ్మా! అసలు ఈ జగత్తంతా నాలోనే ఉంది. నీకు తెలియక అజ్ఞానంతో ఈ మాటలు మాట్లాడు తున్నావు. అసలు నీవెవరో తెలుసా!

పూర్వం నా నాభిలోంచి పుట్టిన పద్మంలో నువ్వు జన్మించావు. నాకు నీవు పుత్రుడుతో సమానం. ఈవిషయం తెలుసు కోకుండా అనవసరమైన మాటలు మాట్లాడుతున్నావు. జాగ్రత్త. అన్నాడు విష్ణువు.

ఇలా బ్రహ్మ విష్ణువుల మధ్య సంభాషణ తీవ్రంగా కొనసాగింది. నేను గొప్పని బ్రహ్మ, కాదు నేనే గొప్పని విష్ణువు, నేను నీకు ప్రభువునని ఒకరు కాదు నీకు నేనే ప్రభువునని ఇంకొకరు. ఇలా పరస్పరం వాదులాడుకున్నారు. వారిద్దరి మధ్య ఆవేశం శ్రృతిమించింది. మాటలు పోయి చేతల్లోకి దిగారు. మెల్లగా యుద్ధాన్ని ప్రారంబించారు. ఒకర్నొకరు వివిధ ఆయుధాలతో కొట్టుకుంటున్నారు. ఇది చూసి వారి వాహనాలైన హంస – గరుత్మంతుడు కూడా పరస్పరం యుద్ధానికి తలపడ్డారు.ఇలా విచిత్రంగా సృష్టి – స్థితి కారకులైన బ్రహ్మ, విష్ణువులు యుద్ధం చేసుకోవటం ఆందరు దేవతలకీ తెలిసిపోయింది. అందరూ తమ తమ విమానాల్ని ఎక్కి ఈ వింత దృశ్యాన్ని చూడటానికి ఆకాశంపైకి వచ్చి నిలబడ్డారు. వారికి ఆశ్చర్యం, విస్మయం కలిగాయి. ఎందుకు వీళ్ళిద్దరూ ఇలా కలహించుకుంటున్నారో వారికి అర్థం కాలేదు. తమ శక్తితో దివ్య పుష్పాల్ని వారిద్దరి మీదా వర్షంలా కురిపించారు. అయినా వాళ్ళిద్దరూ శాంతించలేదు.

ఎంతసేపటికీ బ్రహ్మ విష్ణువులు యుద్ధం ఆపటం లేదు. దేవతల్లో ఆందోళన ప్రారంభమైంది. వారికి కూడా ఏం చేయాలో! ఎలా వీరిని ఆపాలో పాలు పోవటం లేదు ఇంతలో బ్రహ్మ చేత దెబ్బలు తిన్న విష్ణువు కోపంతో మహేశ్వరాస్త్రాన్ని బైటికి తీసి బ్రహ్మ మీద ప్రయోగించాడు. ఇది చూసిన బ్రహ్మ ఇంకా తీవ్రమైన కోపంతో తన దగ్గరున్న పాశుపతాస్త్రాన్ని విష్ణువు మీద ప్రయోగించాడు. ఇలా వారిద్దరి చేత ప్రయోగింప బడ్డ అస్త్రాలు రెండూ అత్యంత భీకరంగా లోకాల్ని అల్లకల్లోలం చేస్తూ పరస్పరం తలపడ్డాయి.

దేవతలలో భయం మొదలైంది. ఎలగైనా ఈ ఘోర ప్రళయాన్ని అపాలనుకున్నారు. దీనికి సమర్ధుడు ఎవరా అని అలోచించారు. సృష్టి, స్థితి

సంహారం, తిరోభావం, అనుగ్రహం అనేవి ఏ పరబ్రహ్మ నుంచి పుడుతున్నాయో, ఏ పరబ్రహ్మ ఈ ఆయిదింటినీ నిర్వహిస్తున్నాడో, అలాంటి మహోన్నతుడైన శివుడే దీనికి సమర్ధుడని భావించి, వెంటనే అక్కడ నుంచి పరుగు పరుగున కైలాసానికి బయల్దేరారు.కైలాసంలో మణులు పొదిగిన సభామండపంలో ఉమాదేవితో సహా కొలువుదీరిన పరమేశ్వరుణ్ణి చూసారు. ఆయన చుట్టూ ప్రమథ గణాలన్నీ ఉన్నాయి. పనిచారికలు వింజామరలు వీస్తున్నారు. వేదాలన్నీ ఆకారాన్ని ధరించి ఆ దివ్య మూర్తిని స్తుతిస్తున్నాయి. ఇలా సకల గణ పరివేష్టితుడైన శివుణ్ణి చూసి దేవతలంతా ఆనందంతో ఆయన పాదాల మీద పడి సాష్టాంగ దండ ప్రణామం చేసారు.

లేవండి లేవండి ఎందుకు మీరంతా అవేదనగా, అందోళనగా ఉన్నారు. వీకేం భయం లేదు. ముందు ప్రశాంతంగా ఉండండి. అని శివుడు మంగళకరంగా దేవతల్ని ఆనునయిస్తూ వారితో ఇలా అన్నాడు.

నా ప్రియమైన దేవతలారా! మీరందరూ క్షేమంగానే ఉన్నారా! మీ దేవ వంశాల వాళ్ళంతా మీమీ పనుల్ని శ్రద్ధగా ఎటువంటి ఆటంకాలు లేకుండా చేసుకుంటున్నారా! మీభయానికి కారణం బ్రహ్మ – విష్ణువు చేస్తున్న యుద్ధం గురించే కదా! అది నాకు ముందే తెలుసు కాల ప్రభావం వల్ల వాళ్ళిద్దరూ మోహానికి గురై అలా పరస్పరం కలహించుకుంటున్నారు. నేనే వెళ్ళి వాళ్ళ యుద్ధాన్ని మాన్పించి, యదార్ధ సత్యన్ని తెలియచేస్తాను మీరు నిశ్చింతగా ఉండండని వారితో చెప్పి...

ప్రమథ గణాల్లారా! వెంటనే బ్రహ్మ విష్ణువులు కలహించుకుంటున్న యుద్ధరంగానికి మనందరం వెళ్ళాలి. అన్నీ సిద్దంచెయ్యండని ఆజ్ఞాపించాడు.

శివుడి ఆజ్ఞ విన్న ప్రమథ గణాలు సకల సన్నాహాలు వెంటనే చేసేసారు. పరమేశ్వరుడు ప్రయాణించటానికి ఓంకారంతో, అయిదు మండలాల్లో ఆలంకరించబడిన ఒక దివ్య రధాన్ని సిద్దంచేసారు. ఆదివ్య రధాన్నెక్కాడు పరమేశ్వరుడు. వెంటనే దేవతాగణాలు. ప్రమథగణాలు కోలాహలంగా

ప్రయాణమయ్యారు. అందరూ కలసి ఆకాశమార్గంలో బ్రహ్మ విష్ణువులు యుద్ధంచేస్తున్న ప్రాంతానికి వచ్చారు.

**అగ్ని స్తంభం :**

శివుడు ఆకాశంలో తన రథం మీద నుంచి వారిద్దరి యుద్ధాన్ని చూస్తున్నాడు మహేశ్వర - పాశుపతాస్త్రాలు, భయంకరమైన అగ్ని జ్వాలలు వెదజల్లుతూ లోకాల్ని తగల బెట్టటం ప్రారంభించాయి. ఆదృశ్యాన్ని చూసాడు శివుడు. వెంటనే అత్యంత భీకరంగా దర్శనమిచ్చే ఒక పెద్ద అగ్ని స్థంభం రూపాన్ని ధరించి వాళ్ళిద్దరి మధ్య నిలిబడ్డాడు. ఎప్పుడైతే మహా పర్వతం లాంటి అగ్నిస్తంభం ఆవిర్భవించిందో వెంటనే ఆ దివ్యాస్త్రాలు రెండూ ఆ స్తంభంలో పడి కలిసిపోయాయి. అప్పటిదాకా మహాప్రళయాన్ని సృష్టించిన దివ్యాస్త్రాలు ఆగ్నిస్తంభంలో కలిసిపోవటాన్ని చూసి, దేవతలంతా ఆశ్యర్యపోయారు. ఏమిటీ ఆద్భుతం అని నివ్వెరపోయారు.

**మొగలి పువ్వు సాక్ష్యం :**

బ్రహ్మ-విష్ణువులు యుద్ధాన్ని ఆపేసారు. తమ మధ్య మహోగ్రంగా దివ్య జ్వాలతో కనిపిస్తున్న అగ్ని స్తంభాన్ని చూసి వారు కూడా ఆశ్యర్యపోయారు. తాము అస్త్రాలు ప్రయోగించుకున్నాం. పరస్పరం కలహించుకున్నాం అనే విషయాన్ని కూడా మర్చిపోయి, ఇద్దరూ ఆ దివ్య స్తంభం ఆది అంతాల్ని కనుక్కోవాలని వెంటనే బయల్దేరారు.

విష్ణువు 'వరాహ' రూపాన్ని ధరించి అగ్నిస్తంభం ఆదిని చూద్దామని పాతాళం వైపు వెళ్ళగా 'హంస' రూపాన్ని ధరించిన బ్రహ్మ దాని అంతం ఎక్కడుందో చూద్దామని ఆకాశం వైపు దూసుకు పోయాడు. చాలాకాలం గడిచింది. విష్ణువు ఎంతలోతుకుపోయినా అంతుచిక్కటం లేదు. ఇక తన వల్ల కాదని భావించి పాతాళం నుంచి పైకి వచ్చేసాడు.

బ్రహ్మ దేవుడు మాత్రం పట్టుదలతో ఆకాశంలోకి పైకి పైకి వెళ్తూనే ఉన్నాడు. అయనకి ఎంతకీ ఆది దొరకలేదు. ఇలా వీళ్ళిద్దరూ పడుతున్న

అవస్థను చూసి స్తంభరూపాన్ని ధరించిన శివుడికి నవ్వొచ్చింది. ఆయన నవ్వుకి తల కదిలింది. తలమీదున్న మొగలిపువ్వ క్రిందికి జారింది. అలా జారి క్రిందకు పడుతున్న మొగలి పువ్వుని చూసాడు బ్రహ్మ. ఆపువ్వతో....

ఓ మొగలి పుష్పమా ఎవరు నువ్వు ? ఎక్కడి నుంచి నువ్విలా కిందకి పడుతున్నావు? ఎవరు నిన్ను ధరించారని ప్రశ్నించాడు. ఓ స్వామీ! నేను ఈ స్తంభం అంతాన్ని చూడలేదు ఏదో మధ్య భాగం నుంచి చాలాకాలం క్రితమే జారాను. ఇప్పటికి నీకు కనిపించాను. నిన్ను చూస్తే ఈ అగ్ని స్తంభం అగ్రాన్ని చూడటానికి వెళ్తున్నట్లున్నావు. ఆ ప్రయత్నం మానుకో అది నీ వల్ల కాదు అంది మెగలిపువ్వు.

మొగలి పువ్వు మాటలు విన్న బ్రహ్మకి. అ పువ్వు చెప్పే మాటలు నిజమేనని అనిపించాయి. ఆ పువ్వుతో ఓ మిత్రమా! నువ్వు నాకో మాటివ్వాలి. నేను విష్ణువు పరస్పరం కలహించుకున్నాం, మా మధ్యలో ఈ స్తంభం హఠాత్తుగా ప్రత్యక్షమైంది. దీని ఆది చూద్దామని విష్ణువు పాతాళం వైపు వెళ్ళాడు. నేను అగ్రాన్ని చూద్దామని ఇలా ఆకాశం వైపు బయల్దేరాను. నువ్వు నాతో వచ్చి విష్ణువుతో నేను ఈ స్తంభం అగ్రాన్ని చూసానని సాక్ష్యం చెప్పు. దయచేసి నామాట నిలబెట్టు అని ప్రార్థించాడు.

మొగటి పువ్వు సరేనంది. ఇద్దరూ కలసి క్రిందకొచ్చారు. విష్ణుమూర్తితో ఈయన ఈ మహాగ్నిస్తంభం అగ్రాన్ని చూసాడని సాక్ష్యం చెప్పింది మొగలి పువ్వు. అది విని వెంటనే వైరాన్ని వదిలేసిన విష్ణువు బ్రహ్మదేవుడితో, "స్వామీ నీవే నాకన్నా గొప్పవాడివని హృదయపూర్వకంగా అంగీకరిస్తున్నాను". అని వినయంగా మాట్లాడి, ఆయన్ని షోడశోపచారాలతో భక్తిగా పూజించాడు. బ్రహ్మదేవుడికి అహం చల్లారింది. తన ఆధిపత్యం నెగ్గినందుకు మనసులో ఎంతో సంతోషాన్ని పొందాడు.

ఇదంతా పైనుంచి అగ్ని స్తంభ రూపంలో చూస్తున్న శివుడికి ఆగ్రహం కలిగింది. బ్రహ్మ చేసిన మోసం ఆయనకి కోపం తెప్పించింది. వెంటనే ఆ అగ్ని లింగం నుంచి సాకారంతో వాళ్ళిద్దరి ముందు ప్రత్యక్షమయ్యాడు.

శివుణ్ణి చూసిన విష్ణువు వెంటనే ఆయన పాదాలకి నమస్కరించి ఆగ్రహంగా ఉన్న శివుణ్ణి శాంతపరిచేలా "ఓ ప్రభూ! పరమేశ్వరా! ఆద్యంతాలు లేని పరబ్రహ్మ స్వరూపుడవు నీవు. నీ ఆది అంతాలు తెలుసుకోవాలని గర్వంతో మోహంతో మేము ప్రయత్నించాం మా అపరాధాన్ని దయచేసి మన్నించు. ఇదంతా నీ లీలే కదా స్వామీ ఇందులో మా దోషమేదైనా ఉందా. ఉంటే మమల్ని క్షమించు" అని పరిపరి విధాలుగా ప్రార్థించాడు.

శివుడికి ఆగ్రహం చాల్లారింది. శాంతమూర్తి అయిపోయాడు. విష్ణువుతో "నాయనా విష్ణు! నీవు సత్యమైన మాటలే చెప్పావు. నీమాటలకి, నీ వినయానికి , నీభక్తికి నేను ఎంతో సంతోషిస్తున్నాను. నేటినుంచి భూలోకంలో నీకు కూడా నాతో సమానంగా పూజలు జరుగుతాయి. నాలాగానే నీకు కుడా ప్రత్యేకమైన క్షేత్రాలు ఏర్పడతాయి. ప్రతిష్టలు, ఉత్సవాలు జరుగుతాయి. ఇదే నేను నీకిచ్చే వరం అని తనతో సమానమైనస్థాయి నిచ్చాడు.

## బ్రహ్మ శిరస్సు ఖండించటం

సర్వసాక్షి అయిన సర్వేశ్వరుడు అబద్ధం చెప్పిన బ్రహ్మ వైపు చూసాడు. అయన కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి. బ్రహ్మ పలికిన అసత్యం, చేసిన మోసం గుర్తొచ్చాయి. ఒక్కసారి భృకుటి ముడిచాడు. అంతే వెంటనే శివుడి లలాటం నుంచి మహాద్భుతమైన శక్తితో భైరవుడు ఆవిర్భవించాడు. ఆ భైరవుడు శివుడితో "ప్రభూ! నేనేం చేయాలో వెంటనే ఆజ్ఞాపించండన్నాడు."

"కుమారా భైరవా! ఈ బ్రహ్మదేవుడుతానే ఆది దేవుణ్ణిని అహంకారంతో మోసపూరితంగా ప్రవర్తించాడు. ఈయన గర్వాన్ని పోగొట్టాలి. ఆసత్యం చెప్పిన ఇతనికి తగిన గుణపాఠం చెప్పు" అని ఆజ్ఞాపించాడు.

వెంటనే భైరవుడు బ్రహ్మని జుట్టు పట్టుకుని, మదగర్వంతో అసత్యం పలికిన ఆయన ఐదోతలని కత్తితో ఒక్క వేటుకి ఖడించేసాడు. అయినా భైరవుడి ఆవేశం చల్లారలేదు. మిటిలిన నాలుగు తలల్ని కుడా ఖండించడానికి కత్తిని పైకెత్తాడు. ఆ దెబ్బతో బ్రహ్మ బెంబేలెత్తిపోయి అలంకారాలు, ఆభరణాలు, వేసుకున్న వస్త్రాలు అన్నీ జారిపోతుండగా, తుఫానులో ఆరటి చెట్టు వణికి

పోయినట్టు వణికిపోయాడు. ఆయనకేమీ తోచక వెంటనే భైరవుడి పాదాలపై పడిపోయాడు. ఆదే సమయంలో బ్రహ్మ దేవుడి దీనస్థితి చూసి చలించిపోయిన విష్ణువు ఆయన్ని రక్షించాలని పరమేశ్వరుడి కాళ్ళని కనీళ్ళతో అభిషేకించి దీనంగా ఆయనతో.

"స్వామీ పరమేశ్వరా! ఆపద్బాంధవా! అనాధా రక్షకా! నీవే పూర్వం బ్రహ్మ దేవుడికి నీ అనుగ్రహ చిహ్నంగా ఈశ్వరత్వాన్ని ప్రసాదించి ఐదు తలలు ప్రసాదించావు. కాబట్టి నీవే ఆయన్ని శిక్షించటం తగదు. మొదటి తప్పుగా భావించి, సృష్టికారకుడైన ఈ బ్రహ్మను క్షమించు. నీ దయని బ్రహ్మపై చూపించు అని పరిపరివిధాలుగా ప్రార్థించాడు.

అలా విష్ణువు చేసిన ప్రార్ధన విని కరిగిపోయిన శివుడు భైరవుణ్ణి వెనక్కి పిలిచాడు. హమ్మయ్య! బ్రతికి పోయానని భయం నుంచి తేరుకున్నాడు, బ్రహ్మ. శివుడు బ్రహ్మతో "ఓ బ్రహ్మ నీవు మోహంతో, అజ్ఞానంతో, మదంతో అసత్యం పలికి, ఈశ్వరత్వాన్ని పొందాలని ప్రవర్తించావు. కాబట్టి నీకు భూలోకంలో పూజలు, ఉత్సవాలు, ఉండవని" శపించాడు.

శాపం విని బ్రహ్మ దేవుడు వణికి పోయి. శివుడి పాదాలపై పడి. దగ్గమైన స్వరంతో" స్వామీ నీవు మహిమాన్వితుడవు. వరాలిచ్చే వాడివి, దీనజన బంధువువి, తప్పులన్నీ క్షమించే దయాగుణం కలిగినవాడివి, మేరుపర్వతాన్నే ధనుస్సుగా చేసుకున్న వాడివి, సర్వమంగళ స్వరూపుడివి, నీపాద పద్మాలకి నమస్కారం నన్ను క్షమించు స్వామీ" అని దీనంగా వేడుకున్నాడు.

భోళాశంకరుడు మళ్ళీ కరిగిపోయాడు. "బ్రహ్మా! నీ ప్రార్ధన మన్నిస్తున్నాను. నిన్ను వధిస్తే ఈ లోకాల సృష్టికి అంతరాయం కలుగుతుంది. కనుక నిన్ను క్షమిస్తున్నాను. నేటి నుంచీ నువ్వు ఈ లోకాల్ని సృష్టించే భారాన్ని వహించు. నీకు పూజలు, ఉత్సవాలు మూర్తి ఆరాధనలు భూలోకంలో లేనప్పటికీ, నీకో వరాన్ని అనుగ్రహిస్తున్నాను. అగ్నిష్టోమం, దర్శపూర్ణం వంటి యజ్ఞాలలో నీకు గురుస్థానాన్ని ప్రసాదిస్తున్నాను. ఎంత గొప్పగా యాగాన్ని నిర్వహించినా

ఎంత వైభవంగా దక్షిణలు ఇచ్చినా, నీవు లేకుండా యజ్ఞం పరిపూర్ణంకాదు. ఇదే నీకు నేనిచ్చే వరం. ఇకపై బుద్ధిగా నడుచుకోమని" ప్రభోదించాడు. అలాగే అక్కడే ఈ తతంగాన్నంతా అమాయకంగా చూస్తున్న మొగలిపువ్వుతో.

"ఓ దుష్టపుష్పమా! నువ్వు అసత్యాన్ని పలికావు. ఇకనుంచి నాదగ్గర ఉండటానికి నీకు అర్హత లేదు వెంటనే పక్కకు పో! ఈ రోజు నుంచి నీమీద నా ప్రేమ నశించిందని" అన్నాడు. వెంటనే మొగలిపువ్వు కనీళ్ళు పెట్టుకుంది. అత్యంత దీనంగా స్వామీ నీదివ్య పాదపద్మాలకి నమస్కారం. నీశాపంతో నా జీవితం వ్యర్ధమైపోతుంది. నన్నెవరూ దగ్గరకి తీయరు. నన్ను ధరించరు. దయచేసి నా తప్పును కూడా క్షమించండి. తెలిసీ తెలియక చేసిన పాపాలు నిన్ను ఒక్కసారి స్మరిస్తేనే నశించిపోతాయని అంటారు కదా! స్వామీ నేను నిన్ను చూస్తూ ప్రత్యక్షంగా క్షమించమని వేడుకుంటున్నాను. ఇక నాకు అసత్యం పలికిన దోషం నశించిపోవాలికదా! దయతో నన్ను అనుగ్రహించు అని విలపించింది.

మరల శివుడు కరిగి పోయాడు. "ఓ కేతకీ పుష్పమా! నా శాసనం తిరుగు లేనిది. కాబట్టి నిన్ను నేను ధరించను. నాపూజలో కూడా నిన్ను ఎవరూ ఉపయోగించరు. అయినప్పటికీ నా భక్తులు నిన్ను ధరిస్తారు. దీనితో నీజన్మ సఫలం అవుతుంది. నీవు ఛత్రంలాగా ఉంటావు. ఇక నిశ్చంతగా వెళు ్ళ" అని మొగలిపువ్వుకి కూడా వరాన్ని ప్రసాదించాడు.

ఈ విధంగా పరమేశ్వరుడు భక్తజన బాంధవుడు. కాబట్టి బ్రహ్మ దేవుణ్ణి. మొగలి పువ్వుని. విష్ణుమూర్తిని అనుగ్రహించి అందరు దేవతలతో దయాస్వరూపుడిగా, జగదీశ్వరుడుగా స్తుతించబడి విరాజిల్లాడు.

## అరుణాచల వైభవం

ఇలా దివ్య వైభవంతో కొలువైన పరమేశ్వరుడికి కుడి ఎడమల వైపు బ్రహ్మ, విష్ణువులిద్దరూ నిలబడి భక్తిగా నమస్కరించారు. అయన్ని మంచి ఆసనం మీద కూర్చోపెట్టి పవిత్రమైన. వస్తువుతో భక్తిగా పూజించారు. వారు

పూజించిన హారాలు, నూపురాలు (గజ్జెలు), కిరీటం, మణికుండలాలు, యజ్ఞోపవీతం, ఉత్తరీయం, దీపం, తెల్లటి ఛత్రం. వింజామరలు, ధ్వజం లాంటి వస్తువులన్నీటినీ పురుష వస్తువులంటారు. అంటే ఇవి చాలాకాలం స్థిరంగా ఉ ండేవి. ఇలా దివ్యమైన వస్తువులని బ్రహ్మ విష్ణువులు శివుడికి సమర్పించగా. ఆయన ఎంతో సంతోషంతో వాటిని స్వీకరించి, తిరిగి వెంటనే తన చుట్టూ ఉ న్న ప్రమథ గణాలకి వాటిన్నంటినీ ఇచ్చేసాడు. తరువాత ప్రసన్నమైన హృదయంతో

ఓ పుత్రులారా! మీరిద్దరూ ఈ రోజు నాకు చేసిన పూజ చాలా గొప్పది. నాకెంతో సంతోషాన్ని కలిగించింది. మీరు మంచి హృదయంతో ఎంతో భక్తి ప్రపత్తులతో నాకు పూజచేసిన ఈరోజు శివరాత్రి అని లోకంలో ప్రసిద్ధి పొందుతుంది. ఈ తిధి నాకెంతో ప్రీతిపాత్రమైనది. ఈ పవిత్రమైన ఈరోజు నా విగ్రహాన్నిగానీ, లింగాన్నిగానీ పూజించేవాడు. ఎంతో పుణ్యాన్ని సంపాదిస్తాడు. పవిత్రమైన ఈ శివరాత్రి రోజు ఉపవాసం ఉండి, ఇంద్రియ నిగ్రహంతో, శాస్త్రోక్తంగా తమ శక్త్యానుసారం భక్తితో నన్ను ఆరాధించాలి. ఇలా శివరాత్రి రోజు నన్ను పూజించటం వల్ల ఒక సంవత్సరంపాటు నిరంతరం నన్ను పూజించిన ఫలితం లభిస్తుంది. చంద్రోదయం అయినప్పుడు సముద్రం ఎలా ఉప్పొంగుతుందో అదే విధంగా శివరాత్రి రోజు నా శివతత్త్వం, శివధర్మం వృద్ధి చెందుతాయి. ఈ రోజు పవిత్రమైన శివలింగ ప్రతిష్ట, నాగురించి ఉ త్సవాలు చేస్తే ఆ భక్తులకి సమస్త సన్మంగళాలు లభిస్తాయి. అంతే కాదు.

పూర్వం నేను మీ ఇద్దరి మధ్య ఆర్ద్రానక్షత్ర యుక్త మార్గశిర పూర్ణిమరోజు అగ్ని స్తంభంగా ఆవిర్భవించాను. కాబట్టి స్తంభ రూపలింగావిర్భావ కాలమైన ఆర్ద్రానక్షత్రం రోజు, పార్వతీ సమేతుడైన నా మూర్తిని, లేదా నా లింగాన్ని దర్శించి పూజించిన వాడు, నా కుమారుడైన సుబ్రహ్మణ్యుడి కంటే ఎక్కువగా నా చేత ప్రేమించబడతాడు. ఆ రోజు కేవలం నా దర్శనం చేతనే మానవులకి గొప్ప పుణ్యం ఫలితం దక్కుతుంది. ఇక పూజలు అభిషేకాలు చేస్తే మరింత పుణ్యం లభిస్తుంది.

నేను, మీరు యుద్ధం చేసిన ఈ స్థలంలో అగ్నిస్తంభ లింగాకారంగా ఆవిర్భవించాను కాబట్టి, నేటి నుంచి ఇది లింగస్థానం అనే పేరుతో ప్రసిద్ధి చెందుతుంది. కాలక్రమంలో ఆది, అంతం లేని ఈ నా అగ్నిస్తంభం భక్తుల పూజలకు అనుకూలంగా ఉండడం కోసం చిన్నదిగా మారుతుంది. ఈ నా దివ్య లింగం మానవులకి, భోగం, మోక్షం ఇస్తుంది. వారి భుక్తికి, భక్తికి, ముక్తికి ఇది సాధనంగా ఉంటుంది. నా లింగ రూపాని దర్శించి స్మరించిన వాళ్ళకి పునర్జన్మ అనేదే ఉండదు. అగ్నిలాగా వెలుగుతూ ఎరగ్రా ఈ లింగం ఇక్కడ ఆవిర్భవించింది. కాబట్టి నేటినుంచి ఇది అరుణ లింగంగా, ఈ లింగం ఆవిర్భవించిన ఈ పర్వతం అరుణాచల క్షేత్రంగా లోకంలో సుప్రసిద్ధమౌతుంది. ఇది రాబోయే కాలంలో దివ్య క్షేత్రంగా మారుతుంది. ఇక్కడ నివశించిన వాళ్ళు, ఇక్కడ తపస్సు చేసిన వాళ్ళు ముక్తి పొందుతారు.

ఈ అరుణాచలంలో ఎంతో వైభవంగా నాకు పూజలు జరుగుతాయి. నిత్యం ఉత్సవాలతో అక్షలాది భక్తులు ఈ క్షేత్రాన్ని దర్శిస్తారు. నా దివ్య క్షేత్రాలన్నిటిలోకీ ఇది గొప్ప క్షేత్రంగా విలసిల్లుతుంది. సర్వమంగళకరమైన సర్వశుభప్రదమైన ఈ ముక్తి క్షేత్రంలో చేసిన దానం, ధర్మం అనంతమైన పుణ్యాన్ని ప్రసాదిస్తుంది. ఇక్కడ కొలువున్న నా అరుణలింగాన్ని భక్తితో పూజిస్తే, వారికి నా సాలోక్యం (అనగా కైలాసం చేరటం) సారూప్యం (నా దగ్గరే ఉండటం) సాయుజ్యం (చివరికి నాలోకలిసిపోవటం) అనే దివ్య ఫలితాలు లభిస్తాయి. అని పరమేశ్వరుడు వాళ్ళందరికీ చెప్పాడు.

## పంచకృత్యాలు-ప్రణవం-పంచాక్షరీ

ఒకనాడు శివుడు బ్రహ్మ విష్ణువులతో జగత్కార్య లక్షణాల గురించి చెప్పటం ప్రారంభించాడు. ఓ ప్రియభక్తులారా! నేను చేసే జగత్కార్యం చాలా రహస్యమైంది. చెబుతున్నా శ్రద్ధగా వినండి.

**పంచకృత్యాలు :** సృష్టి – స్థితి – తిరోభావం – అనుగ్రహం అనేవి అయిదు జగత్కార్యాలు. ఇవి నేను నిత్యం చేస్తుంటాను.

ఈ సంసారం ప్రారంభించటం సృష్టి, ఇలా ప్రారంభించబడిన సంసారం స్థిరంగా ఉండటం స్థితి. జగత్తు నాశనం చెందడం సంహారం, సకల జీవుల ప్రాణాలని తీయటం తిరోభావం, జీవులకి మోక్షాన్ని ప్రసాదించటం అనుగ్రహం. ఈ అయిదు కార్యాలనే జగత్కార్యాలంటారు. వీటిలో సర్గ అనగా సృష్టి-స్థితి, సంహారం, తిరోభావం అనే నాలుగు కార్యాలు సంసారాన్ని విస్తరింప చేస్తే, అయిదవ కార్యం అనుగ్రహం నాలో స్థిరంగా ఉంటుంది.

నా భక్తులైన వాళ్ళు నేను చేసే ఈ అయిదు కార్యాలని పంచభూతాలలో దర్శిస్తారు. పంచభూతాలైన భూమిలో సృష్టిని. నీటిద్వారా స్థితిని. అగ్నిలో సంహారాన్ని, వాయువులో తిరోభావాన్ని, అకాశంలో అనుగ్రహాన్ని చూస్తారు. ఈ సర్వాన్ని భూమి సృష్టిస్తుంది. సృష్టించిన సర్వాన్ని జలం పోషిస్తుంది. ఇలా పెరిగిన సర్వాన్ని అగ్ని దహించి సంహరిస్తుంది. వాయువు జీవుల ప్రాణాన్ని తీసుకు పోతుంది. ఆకాశం అనుగ్రహాన్ని ప్రసాదిస్తుంది. ఈ అయిదు కార్యాలు చేయటానికే నాకు అయిదు ముఖాలున్నాయి. నాలుగు దిక్కులలో నాలుగు ముఖాలు పైకి చూస్తున్న మరో ముఖం మధ్యలో ఉంటుంది.

ప్రియపుత్రులారా! మీరు ఎంతో తపస్సు చేసి, నన్ను సంతోషపెట్టి, నాద్వారా బ్రహ్మవైన నీవు సృష్టి కార్యాన్ని, విష్ణువైన నీవు స్థితి కార్యాన్ని నిర్వర్తించేందుకు అనుమతి పొందారు. మీలాగే సంహారాన్ని రుద్రుడు, తిరోభావాన్ని మహేశ్వరుడు నిర్వర్తిస్తున్నారు. ఇక అనుగ్రహమనే ఐదో కార్యాన్ని స్వయంగా నేనే నిర్వర్తిస్తున్నాను. ఇది వేరెవరికీ సాధ్యం కాదుకదా. ఇదంతో మీకు ఎప్పుడో తెలుసు. అయితే కాలక్రమంలో మోహావేశంతోఈ విషయాన్ని విస్మరించారు. కానీ రుద్ర మహేశ్వరులు మాత్రం ఈ విషయాన్ని విస్మరించలేదు. ఎందుకంటే వాళ్ళిద్దరికీ రూపం, వేషం, కార్యం, వాహనం. అయుధాలతో సహా నాతో సమానత్వాన్ని కల్పించాను కనుక వాళ్ళిద్దరూ నే చెప్పిన సత్యాన్ని సదా గుర్తుంచుకుంటారు.

**ప్రణవం :** బ్రహ్మ విష్ణువులారా! నాధ్యానం వదిలేయటం వల్లనే మీకు అజ్ఞానం మోహం కలిగాయి. నామీద భక్తి పరిపూర్ణంగా ఉంటే మీకీ గర్వం పోయి నారూపం ప్రాప్తించేది. కాబట్టి ఇకనైనా మీరు జ్ఞాన వంతులు కావాలంటే మీకు నాయందు భక్తి శ్రద్ధలు సిద్ధించాలంటే, ఓం కారం అనే పేరు కలిగిన నా దివ్య మంత్రాన్ని జపించండి. పూర్వం జగత్తుకి సర్వమంగళాలని చేకూర్చే ఓం కారాన్నే నామంత్రంగా అందరికీ ఉపదేశించాను. ఈ ఓంకారం నా ముఖం నుంచి ఆవిర్భవించింది. అది నా గురించి నా తత్త్వం గురించి తెలియజేస్తుంది. ఈ ఓం కార బీజ మంత్రం నా స్వరూపమే, దాన్ని నిత్యం స్మరిస్తుఉంటే నన్ను స్మరించనట్టే అవుతుంది.

ఈ ఓం కారం లోని 'అ'. కారం నా ఉత్తర ముఖం నుంచి, 'ఉ' కారం నా పడమర ముఖం నుంచి, 'మ' కారం నా దక్షిఫ ముఖం నుంచి, తూర్పు ముఖం నుంచి 'బిందువు'. మధ్య ముఖంనుంచి 'నాదం' పుట్టి ఈ మంత్రం ఐదురకాలుగా విస్తరించి తిరిగి ఒక్కటిగా చేరి ఓం అనే ఏకాక్షర మంత్రంగా ఆవిర్భవించింది.

నామరూపాత్మకం సర్వం వేదభూత కులద్వయమ్ ।<br>వ్యాప్తమేతేన మంత్రేణ శివశక్త్యోశ్చ బోధకః ॥

నామరూపాత్మకమైన ఈ సకల చారాచర ప్రపంచం, వేదం నుంచి జన్మించింది స్త్రీలు, పురుషులనే రెండు కులాలు. ఈ మంత్రం చేత వ్యాపించబడ్డాయి. ఈ దివ్య మంత్రం శివ – శక్తుల ఏకత్వాన్ని కూడా ప్రబోధిస్తుంది.

**పంచాక్షరీ :** ఈ మంత్రం నుంచి ఆకారాది వరుసలో మరియు న కారది వరుసలో పంచాక్షరీ మంత్రం పుట్టింది. ఈ పంచాక్షరీ మంత్రం సాకారుడైన నన్ను (పరమేశ్వరుణ్ణి) గురించి తెలియచేస్తుంది.

నా పంచాక్షరీ మంత్రం ఎంతో గొప్పది. దీని నుంచి ఐదు వర్ణాలు, ఐదు వర్గాలతో కూడుకున్న వర్ణమాల పుట్టింది. అంతేకాదు శిరో మంత్రం

అనే నాలుగు పాదాలతో కూడుకున్న త్రిపద గాయత్రి మంత్రం కూడా జన్మించింది. దీని నుంచే సమస్త వేదాలు వాటినుంచి, కోట్లాది మంత్రాలు పుట్టాయి. ఇలా పుట్టిన కోట్లాది మంత్రాల వల్ల కొన్ని సిద్ధులు లభిస్తాయి. సకల మంత్రాల సారమైన ఈ దివ్య ప్రణవం (ఓం కారం) భోగాన్ని మోక్షాన్ని కూడా ఇస్తుంది...

ఇలా పరమేశ్వరుడు పంచకృత్యాలు గురించి ప్రణవాన్ని గురించి, పంచాక్షరీ మంత్ర వైభవాన్ని గురించి వారిద్దరికీ సవివరంగా బోధించి బ్రహ్మ విష్ణువులని ఉత్తరాభిముఖంగా కూర్చోబెట్టి, వాళ్ళ శిరస్సుల మీద పద్మంలాంటి తన చేతుల్ని వేసి, సావధానంగా వారికి మంత్రోపదేశం చేసాడు. వాళ్ళిద్దరూ ఆ మంత్రాన్ని మూడుసార్లు ఉచ్చరించి యంత్ర-తంత్ర-పూర్వకంగా పరమగురువైన శివుడి నుంచి స్వీకరించారు. గురుదక్షిణగా తమని తాము భక్తి పూర్వకంగా పరమేశ్వరుడికి సమర్పించుకుని, చేతులు జోడించి తమకి దివ్య మంత్రోపదేశం చేసి జగద్గురువు మహాదేవుణ్ణి

నమో నిష్కల రూపాయ నమో నిష్కల తేజసే ।
నమస్సకల నాథాయ నమస్తే సకలాత్మనే ॥
నమః ప్రణవ వాచ్యాయ నమః ప్రణవలింగినే ।
నమః సృష్ట్యాది కర్త్రే చ నమః పంచముఖాయతే ॥

“పరమేశా! నిరాకారుడైన నీకు నమస్కారం. తేజో రూపంతో ప్రకాశించే నీకు నమస్కారం. సాకార రూపుడైన ఈశ్వరుడవు ఓం కార వాచ్యుడవైన నీకు అభివాదం. ఓం కారం నీ దివ్య స్వరూపం. సృష్టి, స్థితి, సంహారం తిరోధానం, అనుగ్రహం అనే పంచకృత్యాల్ని చేసే ఐదు ముఖాలు కలిగిన నీకు అభివాదం. ఆత్మరూపుడవు పరబ్రహ్మావు. అనంతమైన గుణగణాలు, శక్తి గలిగిన నీకు నమస్కారం. సాకార నిరాకార రూపాల్ని ధరించిన శివగురుస్వామీ నీకు మా ప్రణామం” అని భక్తి పూర్వకంగా స్తుతించారు.

బ్రహ్మవిష్ణువుల మంగళకరమైన స్తుతుల్ని విని ఆనందంతో పరవశించిన పరమేశ్వరుడు వారితో...ఓ కుమారులారా! నేను మీ ఇద్దరికీ నా తత్త్వాన్ని బోధించి నా స్వరూపాన్ని మీకు చూపించాను. మీరు అమ్మ కృప వల్ల నాద్వారా లభించిన ఓం కారాన్ని మంత్రంగా నిత్యం జపించండి. ఈ ఓంకార జపం వల్ల సుస్థిరమైన జ్ఞానం లభించి మీకు సర్వ సౌభాగ్యాలు కలుగుతాయి. ఈ ఓం కారాన్ని ఆర్ద్రా నక్షత్రం ఉన్న చతుర్ధశి రోజు జపిస్తే అక్షయ ఫలం లభిస్తుంది. మృగశీర్షా నక్షత్రం చివరి భాగం, పునర్వసు నక్షత్రం మొదటి భాగం అనగా తిథిద్వయం ఉన్న రోజున ఈ ఓంకార జపం, పూజా, హెూమం చేస్తే, అది కూడా ఆర్ద్రా నక్షత్రం నాడు చేసినంత ఫలితాన్నిస్తుంది.

ప్రాతఃకాలంలో, మధ్యాహ్న సమయంలో, లేదా ప్రదోష కాలంలో, రాత్రిపూట, నన్నుదర్శించాలి. అలాగే చతుర్ధశీ యుక్తమైన అమావాస్య తిథి రోజు నన్ను పూజిస్తే అనంతపుణ్యం కలుగుతుంది. నా మూర్తి నా లింగ స్వరూపం ఒకటే అయినప్పటికీ, నా లింగార్చన అభిషేకం చేయటం నాకు ప్రీతిపాత్రం కనుక మోక్షాన్ని కోరుకునే వాళ్ళు లింగార్చనే చెయ్యాలి. నా లింగాన్ని స్వయంగా ప్రతిష్ఠించి గాని లేదా ఇతరులు ప్రతిష్ఠించిన లింగాన్ని కానీ, వివిధ ద్రవ్యాలతో అభిషేకించి, అర్చిస్తే నా దివ్య ధామాన్ని తప్పకుండా పొందుతారు.

ఈ విధంగా బ్రహ్మ విష్ణువులకు ఉపదేశించి శివుడు అక్కడి నుంచి అంతర్ధానమయ్యాడు.

## శివలింగ ప్రతిష్ట - పంచాక్షరీ మంత్ర జపం

**శివలింగ ప్రతిష్ఠ :** మంచి శుభముహూర్తంలో ఒక పుణ్యక్షేత్రంగానీ, నదీతీరంలోగానీ, పార్థివం, జల. తేజో లింగాలలో మీ మనసుకి నచ్చిన లింగాన్ని ప్రతిష్ఠించి ప్రతిరోజు పూజించాలి. శాస్త్రంలో చెప్పిన విధంగా నిర్మించిన లింగాన్ని అర్చిస్తే దానిఫలితం వెంటనే లభిస్తుంది. చలప్రతిష్ఠ ఆచప్రతిష్ఠ అంటే కదిలించేది, కదిలించనిది అని అర్థం. ఈ ప్రతిష్ఠలు రెండు

రకాలు. వీటిలో చల ప్రతిష్ఠలో చిన్న లింగాన్ని అచల ప్రతిష్ఠలో పెద్దలింగాన్ని ప్రతిష్ఠించాలి. సర్వ లక్షణాలతో ఉన్న లింగాన్ని, క్రింద పీఠంతో సహా స్థాపించాలి.

శివలింగం క్రింద పీఠం మండలాకారం (గుండ్రంగా) గా కానీ, చతుర్భుజాకారంగా కానీ, త్రికోణాకారంగాగానీ, లేదా ఖట్వాంగం (ఒక విధమైన ఆయుధం) లాంటి రూపంతో కానీ నిర్మించాలి. లింగాన్ని మట్టి, రాయి, లేదా లోహాలతో చేయవచ్చు. అచల ప్రతిష్ఠలో లింగాన్ని పీఠాన్ని (పానవట్టం) ఒకే పదార్థంతో చెయ్యటం ఉత్తమం. చల ప్రతిష్ఠలో కూడా లింగ పీఠాన్ని ఒకే పదార్థంతో చెయ్యాలి. బాణలింగానికి మాత్రం ఈ నియమం వర్తించదు. బాణలింగానికి పీఠం ఉండదు. ఎందుకంటే ఇది ప్రకృతి సిద్ధంగా లభించేది కాబట్టి.

శివలింగాన్ని ప్రతిష్ఠించే యజమాని తన చేతి వేళ్ళతో 12 అంగుళాలకు తక్కువకాని పరిమాణంతో లింగాన్ని చేయించాలి. అంతకన్నా తక్కువ చేయకూడదు. ఎక్కువ చేస్తే చాలా మంచిది. చల ప్రతిష్ఠలో యజమాని చేతి వేలి ఒక అంగుళం ప్రమాణంలో  చేయించవచ్చు.

ముందుగా శిల్ప శాస్త్రంలో చెప్పిన విధంగా దేవాలయాన్ని నిర్మించాలి. దానిమీద దేవతామూర్తులు ఉండాలి. ఆలయంలో, ధృడమైన, స్వచ్ఛమైన గర్భగుడి ఉండాలి. ఆ గర్భగుడికి అందంగా అలంకరించిన నాలుగు దిక్కులలో నాలుగు ద్వారాలుండాలి. లింగాన్ని ప్రతిష్టించే ప్రదేశంలో నీలం, వైఢూర్యం, కెంపు, నీలం, మరకతం, వజ్రం, పగడం, గోమేధికం ముత్యం అనే నవరత్నాలు, మంచిద్రవ్యాలు, వేదమంత్ర పురస్సరంగా ఉంచాలి. సద్యోజాతాది మంత్రాలతో లింగం ఐదు స్థానాల్లో వరుసగా పూజించాలి. హవిస్సుతో అగ్నిగుండంలో సర్వదేవతలకు, సాకారుడైన శివుడికి హెూమం చెయ్యాలి. ఈ కార్యక్రమాన్ని నిర్వర్తించిన పురోహితుడిని, ఆచార్యుడిని మంచి దక్షిణలతో సంతోష పరచాలి. బంధుమిత్రులందర్నీ పిలిచి సన్మానించాలి. యాచకులకు అన్న వితరణ చెయ్యాలి. పశువుల్ని ధన ధాన్యాల్ని సమర్పించాలి. బంగారంతో, నవరత్నలతో లింగం గర్తభాగాన్ని పూరించాలి(నింపాలి)

సద్యోజాత, వామదేవ , అఘోర, తత్పురుష, ఈశాన అనే పంచ మంత్రాలతో మహాదేవుణ్ణి, ఓం కారన్ని జపించి, శంఖానాదాలు చేస్తూ పీఠసహిత లింగాన్ని ప్రతిష్ఠించాలి. ఇలా పీఠ సహితలింగాన్ని ప్రతిష్ఠించిన తరువాత, అదే ఆలయంలో ఉత్సవాలు నిర్వహించటం కోసం మంగళకరమైన శివుడి సాకార మూర్తిని పంచాక్షరీ మంత్రంతో స్థాపించాలి. ఈ విధంగా స్థాపించిన లింగాన్ని – మూర్తిని, భక్తిపూర్వకంగా పూజిస్తే వారికి శివపదం లభిస్తుంది.

ఈ శింలింగానికి మరో రెండు పేర్లు కూడా ఉన్నాయి. ఒకటి స్థావరలింగం, రెండోది జంగమలింగం, అని. స్థావరం లింగం అంటే చెట్లు, తీగలు, లతలు మొదలైనవి క్రిములు కీటకాలు వంటి వాటిని జంగమ లింగం అంటారు. వీటిలో నీళ్ళని సమర్పించటం ద్వారా స్థావర లింగాన్ని ,అహారాన్ని సమర్పించటం ద్వారా జంగమలింగాన్ని సంతృప్తి పరచాలి. ఇలా భక్తిపూర్వకంగా స్థావర జంగమలింగాన్ని సేవించటం కూడా శివపూజతో సమానమౌతుంది.

శింలింగం క్రింద ఉండే పీఠం అమ్మవారి స్వరూపం కాగా, పైన ఉండే లింగం చేతనాత్మకమైనది.శివుడు ఎలాగైతే పార్వతిదేవిని తన తొడమీద కూర్చోబెట్టుకుని ఉంటాడో, అదేవిధంగా ఎప్పుడూ లింగ రూపంలో పీఠాన్ని ధరించే ఉంటాడు. ఈ విధంగా ఆలయాన్ని నిర్మించి, అందులో శివలింగాన్ని పీఠసమేతంగా ప్రతిష్ఠించి ప్రాంగణలో శివుడి మూర్తిని స్థాపించి, ప్రతి రోజు ఉత్సవాలు, పూజలు, సేవలు చేయాలి. ఇలా వైభవంగా ఎవరైతే శివాలయ ప్రతిష్ఠ చేస్తారో వారందరికీ ముక్తి లభిస్తుంది.

శివ పూజని ముఖ్యంగా, అవాహనం. అసనం, అర్ఘ్యం, పాద్యం, ఆచమనం, అభ్యంగన స్నానం, వస్త్రం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, నీరాజనం, తాంబూలం, నమస్కారం, ఉద్యాపనం అనే షోడశోపచారాలతో చెయ్యాలి. వీటితోపాటు అభిషేకం, నైవేద్యం, తర్పణం, నమస్కారాలను ప్రతిరోజు శక్తి మేరకు చేస్తూ ఉంటే సాధకుడికి ముక్తి లభిస్తుంది.

మానవుడు, ఇతర మనుషులచేతగానీ, లేక ఋషుల చేతగానీ. దేవతలచేతగానీ ప్రతిష్ఠించబడిన, లేదా స్వయంభూగా వెలసిన లింగాలని, షోడశోపచార పూజలతో పూజించినా లేదా అలా పూజ చేసేవారికి పూజాద్రవ్యాన్ని సామాగ్రిని అందజేసినా, ముందుచెప్పిన ఫలితాలే లభిస్తాయి. అసలు ప్రతిరోజూ శివలింగాన్ని దర్శనం చేసుకుంటేనే పాపాలు నశించిపోతాయి. పూజచేస్తే ఇక చెప్పేదేముంది.

మట్టి, పిండి, గోమయం(ఆవుపేడ), పూలు, పళ్ళు. బెల్లం, వెన్న, విభూతి, అన్నం, అనే పదార్ధాలలో మనకు నచ్చిన పదార్ధంతో శివలింగాన్ని చేసి భక్తిగా అర్చించాలి. కేవలం ఒక అంగుళం ప్రమాణంలో ఉన్న శివలింగం కూడా పూజార్హమైనదే. శివలింగాన్ని గానీ, శివ లింగం ప్రతిష్ఠించటానికి అయ్యే వ్యయాన్నిగానీ, శక్తితో ప్రతిష్ఠాపకులకు అందిస్తే శివపదం లభిస్తుంది. అలాగే ప్రతి రోజు రెండు సంధ్యలలో ఒక వెయ్యి సార్లు చొప్పున ఓంకారాన్ని జపించినా కూడా శివ పదం లభిస్తుంది. ఓం కార మంత్ర జపాన్ని సమాధిస్థితిలో, మానసికంగా, ఇతర కాలాల్లో నిశ్శబ్దంగా చేయాలి. బిందువు నాదంతో కూడుకున్న ఓం కారాన్ని సమానప్రణవం అంటారు.

**పంచాక్షరీ జపం :** పంచాక్షరీ మంత్రాన్ని నిత్యం పదివేలు జపించాలి. లేదా ఉభయ సంధ్యలలో రోజూ 1వేయి జపించినా శివసాయుజ్యం లభిస్తుంది. బ్రాహ్మణ వర్ణం వాళ్ళు పంచాక్షరికి (నమః శివాయ) ముందు ఓం కారాన్ని చేర్చి జపించాలి. ఈ మంత్రాన్ని దీక్షా పూర్వకంగా గురువు నుంచి స్వీకరించి జపిస్తే ఫలితం త్వరగా లభిస్తుంది. బ్రహ్మణులు 'నమశ్శివాయ' అని ఇతర వర్ణాలవాళ్ళంతా 'శివాయనమః' అని జపించాలి. స్త్రీలు కూడా శివాయనమః అనే జపించాలి. ఇలా సంచాక్షరీ మంత్రాన్ని ఐదు కోట్లు జపిస్తే శివసాయుజ్యం పొందుతారు. ఒకటి, రెండు, మూడు లేదా నాలుగు కోట్లు జపం చేస్తే క్రమంగా బ్రహ్మ, విష్ణువు, రుద్ర, మహేశ్వరుల పదం లభిస్తుంది. ఈ పంచాక్షరిలోని ఒక్కో అక్షరానికి 1 లక్ష చొప్పున, 5 అక్షరాలకి 5 లక్షలసార్లు అక్షరలక్షల జపం చేయ్యాలి.లేదా ప్రతిరోజూ 1వెయ్యి సార్లు 1 వెయ్యి రోజులు జపించి నిత్యం యధాశక్తి బ్రహ్మణులకు భోజనం పెడితే అభీష్ట సిద్ధి కలుగుతుంది.

ప్రతిరోజూ బ్రహ్మణుడు నూట ఎనిమిది సార్లు గాయత్రీ మంత్రాన్ని జపించి శివసాయుజ్యాన్ని అందించే వేద మంత్రాలని, సూక్తాలని నియమంగా పారాయణ  చెయ్యాలి.

మంత్రాలలో ఒక అక్షరం కలిగినవి, పది అక్షరాలు కలిగినవి, వందఅక్షరాలున్నవి, వందకు పైగా అక్షరాలున్నవి, తొమ్మిది వేల తొంభై తొమ్మిది అక్షరాలు కలగినవి ఇలా ఎన్నో మంత్రాలున్నాయి. వీటిలో ఐదు అక్షరాలకు మించి ఉన్న మంత్రాలని అక్షర లక్షలు జపం చెయ్యాలి. ఏకాక్షర మంత్రాలు (ఓం) కనీసం కోటి సార్లు జపం చెయ్యాలి. ఆ తరువాత ప్రతిరోజు ఒక వేయి జపంచెయ్యాలి. ఇలా యధాశక్తి ఓంకారం లేక పంచాక్షరీ మంత్రం జపం చేసిన వాడికి శివానుగ్రహం లభిస్తుంది. వాడి కోరికలన్నీ తీరుతాయి.

శివుడి కోసం పూలతోటలు పెంచటం, శివాలయాన్ని తుడిచి, కడగటం, శివక్షేత్రంలో నివసించటం, పాధకులకు శివ సాయుజ్యాన్ని అందిస్తాయి. ఇలా మానవులకే కాదు స్థావరాలైన చెట్లు తీగలకు, జంగమాలైన క్రిమి కీటకాలకు కూడా శివాలయ నివాసం శివసాయుజ్యాన్ని ప్రసాదిస్తుంది. కాబట్టి భక్తులు శివాలయంలో నివసించటానికి ప్రయత్నం చెయ్యాలి.

మానవులు ప్రతిష్ఠించిన శివాలయంలో లింగం నుంచి వంద మూరల దూరం వరకూ, ఋషులు ప్రతిష్ఠించిన క్షేత్రాలలో లింగం  నుంచి వేయి మూరల దూరం వరకు, దేవతాప్రతిష్ఠశివలింగాలలో కూడా లింగం నుంచి వేయి మూరల వరకు, స్వయంభూ ప్రదేశాలలో శివలింగం నుంచి వేయిధనుస్సుల వరకూ ఉన్న దూరాన్ని ఋషులు పవిత్రమైన భూమిగా పరిగణిస్తారు.

శివ పుణ్యక్షేత్రాలలో ఉండే బావులు, చెరువులు వీటిలో ఉండే నీరు శివగంగ అంత పుణ్యప్రదమైనదని సాక్షాత్తు శివుడే చెప్పాడు. కాబట్టి శివక్షేత్రానికి సమీపంలో ఉన్న బావులు, చెరువులలో స్నానం చేసి వాటి సమీపంలో దానధర్మాలు చేస్తే అఖండ పుణ్యం లభిస్తుంది.

మానవుడు మనణించేంతవరకు శివక్షేత్రాన్ని ఆశ్రయించుకునే వుండాలి. మరణించిన వ్యక్తి శరీరాన్ని శివక్షేత్రంలో దహనం చేసినా, లేక పదోరోజు కర్మను చేసినా, లేదా మాసికం, సపిండీకరణం, ఆబ్దికం పెట్టినా, పిండప్రదానం చేసినా ఆజీవుడు పాపాలనుంచి విముక్తి పొంది శివసాయుజ్యాన్ని పొందుతాడు.

పవిత్రమైన శివక్షేత్రాలలో ఏడు రాత్రులుగానీ, కనీసం ఐదు రాత్రులుగానీ, మూడు లేక ఒక్క రాత్రి గానీ నివసిస్తే, కాలక్రమంలో ఆవ్యక్తికి శివలోకం లభిస్తుంది. లోకంలో ఎవరైతే శివపూజని భక్తి ప్రపత్తులతో కోరికలు తీరటం కోసం చేస్తారో, వారికి వెంటనే ఫలితం లభిస్తుంది. అలా కాక ఏ కోరిక లేకుండా పూజిస్తే శివపదం లభిస్తుంది.

కాలం అనేది ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం అని మూడు రకాలుగా ఉన్నది. సాధకులు ఉడయంపూట నిత్య కర్మలని, మధ్యాహ్నం కామ్య కర్మలని, సాయంత్రం శాంతి కర్మలని ఆచరించాలి. అలాగే రాత్రిపూటకూడా విభాగాలున్నాయి. రాత్రిపూట రాత్రికి పగలుకి మధ్య భాగంలో ఉండేదాన్ని నిశీధం అంటారు. ఆ సమయంలో శివపూజచేస్తే విశేషమైన ఫలితాలు లభిస్తాయి. అభీష్టాలు సిద్ధిస్తాయి. కనుక సాధకులు సమయాన్ని గ్రహించి తదనుగుణంగా తమ ఉపాసన కొనసాగించాలి. ఈ కలియుగంలో కర్మ చేయటం వల్లనే ఫలం లభిస్తుండి. అందుకే అందరూ ధార్మిక ప్రవృత్తిని, పాపభీతిని కలిగి ఉండాలి. ఇలా సూతుడు ఋషులకు లింగప్రతిష్ట ప్రణవం పంచాక్షరి గురించిన విశేషాలు తెలియచేసాడు.

## పుణ్యనదులు - పుణ్యక్షేత్రాలు - పాపపుణ్యాలు

**పుణ్యక్షేత్రాలు :** ఏభై కోట్ల యోజనాల విస్తీర్ణంలో, పెద్ద పర్వతాలతో, దట్టమైనఅరణ్యాలతో, జీవనదులతో విలసిల్లుతున్న ఈ పృధ్వీమండలం అంతా పరమేశ్వరుడి ఆజ్ఞతో ప్రాణుల్ని ధరించి ఉంది. ఈ సకల జగత్తుకి నాథుడైన ఆ మహాదేవుడు, ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో నివసించే ప్రజలకి మోక్షాన్ని

అందించటం కోసం ఆయాస్థలాల్లో పుణ్యక్షేత్రాలు విలసిల్లేలా చేసాడు. భూలోకంలో ఉన్న ఈ దివ్య స్థలాలలో ఋషులు నివసించటం వల్ల కొన్ని, దేవతలు అనుగ్రహించటం వల్ల మనికొన్ని, స్వయంభూలింగాలు ఆవిర్భవించటం వల్ల ఇంకొన్ని స్థలాలు దివ్యక్షేత్రాలుగా, పుణ్యతీర్థాలుగా మారి మానవులందరకీ శుభాల్ని చేకూరుస్తున్నాయి.

పుణ్య క్షేత్రాలలో సాధారణంగా తీర్థాలుంటాయి. అవి చాలా పవిత్రమైనవి. అలాంటి తీర్థాల్లో నిత్యం స్నానం, దానం, జపతపాలు ఆచరించాలి. ఈ విషయం తెలిసి ఆచరించని మానవులు రోగాలు, దారిద్ర్యం అనుభవిస్తాడు. ఈ భూమండలంలోని క్షేత్రాలలో స్వయంభూక్షేత్రాలు అత్యంత మహిమాన్వితమైనవి. ఈ స్వయంభూ క్షేత్రాల్లో మరణించిన వారికి పునర్జన్మ ఉండదు. పుణ్య క్షేత్రాల్లో పాపం చేస్తే అది ఎంతో పాపాన్ని కలిగిస్తుంది. కాబట్టి ఆ క్షేత్రాల్లో నివసించే వారు అక్కడికి దర్శనానికి వచ్చేవారు ఎలాంటి పాపం చేయకూడదు. ఏదో విధంగా ప్రయత్నించి పుణ్యక్షేత్రాలలో నివాసం ఉండటానికి మానవులు ప్రయత్నించాలి.

**పుణ్యనదులు :** భూలోకంలో ఉన్న సింధూనది ప్రాచీనమైనది. ఎంతో పవిత్రమైనది. అలాగే శతద్రునది కూడా వీటి తీరంలో ఎన్నో పుణ్య క్షేత్రాలున్నాయి. అలాగే అరవై ముఖాలతో విలసిల్లే సరస్వతి నది కూడా చాలా గొప్పది. వివేకం కలిగిన మానవులు ఈ నదీ తీరంలో నివసిస్తే బ్రహ్మలోకాన్ని పొందుతారు. ఇక పవిత్రమైనది గంగానది. హిమాలయాల్లో జన్మించిన ఆ నది వంద ముఖాలతో ప్రవహిస్తుంది. ఆ దివ్వ నదీతీరంలో కాశీ వంటి ఎన్నో పుణ్య క్షేత్రాలున్నాయి. సూర్యుడు సింహరాశిలో ఉండగా ఆ దివ్య క్షేత్రంలో నివసిస్తే ఎంతో పుణ్యప్రదం. అలాగే శోణభద్రానది కూడా ఎంతో గొప్పది. బృహస్పతి సింహరాశిలో ఉన్నప్పుడు ఆ దివ్య నదిలో స్నానం చెయ్యాలి. అక్కడ నివసించాలి అత్యంత పవిత్రమైన ఈ శోణభద్ర పదిముఖాలతో ప్రవహిస్తుంది. ఈ నదీతీరంలో నివసించే మానవుడు అక్కడ జప తపాలు దానధర్మాలు ఆచరిస్తే వినాయక పదాన్ని చేరతాడు.

నదుల్లో విశిష్టమైనది నర్మదానది. ఇది ఇరవై నాలుగు ముఖాలతో ప్రవహిస్తుంది. ఈ నదీతీరంలో నివసించి స్నానాదులు ఆచరిస్తే, విష్ణుపదం లభిస్తుంది. తమసా నది పంన్నెండు ముఖాలతో రేవానది పదిముఖాలతో ప్రవహిస్తు ఉంటాయి.ఇక మహా పవిత్రమైనది గోదావరి. ఇది గోహత్యా బ్రహ్మ హత్య పాపాల్ని కూడా పోగోడుతుంది. ఇదవై ఒక్క ముఖాలతో పరవళ్ళుతొక్కే గోదావరి మానవులకు రుద్రపదాన్ని అందిస్తుంది. అలాగే కృష్ణవేణి నది కూడా పరమపవిత్రమైన పద్దెనిమిది ముఖాలతో ప్రవహిస్తూ తన తీరంలో జపతపాదులు చేసిన వారికి, తనలో స్నానమాచరించిన వారికి విష్ణులోకాన్ని ప్రసాదిస్తుంది. పది ముఖాలతో ప్రవహించే తుంగభద్ర బ్రహ్మ లోకాన్ని అందిస్తుంది. ఇక సువర్ణముఖీనది ఇది తొమ్మిది ముఖాలతో ప్రవహిస్తుంది. ఇది ఎంత గొప్పదంటే బ్రహ్మలోకంనుంచి క్రిందపడే అనగా పుణ్య శేషం అయిపోయి తిరిగి జన్మించే మానవులు ఈ సువర్ణముఖీనది తీరంలోనే జన్మిస్తారు. అలాగే సరస్వతీనది పంపా సరోవరం అత్యంత శుభప్రదమైన కన్యానదీ తీరాల్లో ఎవరైతే నివసిస్తారో, వారందరూ ఇంద్రలోకానికి చేరతారు.

వీటితో పాటు ఇంకా మహిమాన్వితమైనవి చాలా ఉన్నాయి. సహ్యా పర్వతంలో పుట్టిన కావేరినది, చాలా పవిత్రమైనది.మానవుల కోరికలు తీర్చే ఈ దివ్య నది ఇరవైఏడు ముఖాలతో ప్రవహిస్తూ ఉంటుంది. ఈ పవిత్ర నదీతీరంలో జపతపాలు ఆచరించిన వాళ్ళకి స్వర్గలోకం, బ్రహ్మపదం, విష్ణుపదం లభిస్తాయి. ఈ నదీతీరంలో కామిత ఫలాలందించే ఎన్నో దివ్య శైవ క్షేత్రాలున్నాయి. బృహస్పతి మేషరాశిలో ఉన్నప్పుడు. నైమిషంలో, బదరీ క్షేత్రంలో స్నానం చెయ్యాలి. అలాస్నానంచేసి ఆ క్షేత్రాల్లో పూజలు, జపతపాలు చేస్తే బ్రహ్మలోకప్రాప్తి కలుగుతుంది. సూర్యుడు సింహరాశిలో లేదా కర్కాటక రాశిలో ఉన్నప్పుడు సింధూనదిలో స్నానం అదే సమయంలో కేదార క్షేత్రంలో కేదార స్నానం ఆచరించి అక్కడి నీళ్ళు తాగితే దివ్య జ్ఞానం కలుగుతుంది.

భాద్రపద మాసంలో బృహస్పతి సింహరాశిలో ఉన్నప్పుడు గోదావరి నదిలో స్నానం చేస్తే శివలోకం లభిస్తుందని సాక్షాత్తు పరమశివుడే పూర్వం చెప్పాడు. అదే విధంగా గురువు, రవి ఇద్దరూ కన్యారాశిలో ఉన్నప్పుడు యమునా, శోణా నదులలో స్నానాన్ని ఆచరిస్తే ఆవ్యక్తికి ధర్మ లోకంలో వినాయక లోకంలో ఎన్నో భోగాలు లభిస్తాయి. ఇక బృహస్పతి-రవి తులారాశిలో ఉన్నప్పుడు కావేరి నదిలో చేసే స్నానం వల్ల మానవులకి కోరిన కోరికలన్ని సిద్ధిస్తాయని సాక్షాత్తు విష్ణు భగవానుడే ప్రకటించాడు. మార్గశిర మాసంలో రవి బృహస్పతి వృశ్చిక రాశిలో ఉన్నప్పుడు నర్మదా నదిలో స్నానం చేస్తే విష్ణులోకం లభిస్తుంది. గురువు-రవి ధనుస్సు రాశిలో ఉన్నప్పుడు సువర్ణముఖిలో స్నానం చేస్తే శివలోకం లభిస్తుందని బ్రహ్మ దేవుడే చెప్పాడు. ఇదే విధంగా మాఘమాసంలో రవి కుంభ రాశిలో ఉన్నప్పుడు గంగానది తీరంలో శ్రాద్ధంగానీ, పిండప్రదానం గానీ, తిలోదకాలు సమర్పించటం కానీ, ఎవరైతే చేస్తారో వారి రెండు వంశాలకు చెందిన పితురులు, పితామహులు ప్రపితామహులు కోటి తరాల వరకు ఉద్ధరింపబడుతారని మహర్షులు చెప్పారు.

బృహస్పతి-రవి మీన రాశిలో ఉండగా కృష్ణానదిలో స్నానం చాలా ప్రశస్తమైనది. విధంగా పుణ్య నదులలో, తీర్థాలలో ఆయా మాసాలలో స్నానాన్ని ఆచరించి, నదీ తీరాలలో జప, తప, హోమ దానాలు నిర్వహిస్తే ఇంద్రపదం లభిస్తుంది. జ్ఞానులైన వారు పండితులు గంగా తీరంలో గానీ కావేరీ తీరంలో గానీ నివశించాలి. అలా నివాసముంటే వారు చేసిన పాపాలన్ని నశిస్తాయి. ఇలా లోకంలో రుద్రలోకాన్ని ప్రసాదించే క్షేత్రాలు ఎన్నో ఉన్నాయి. భూలోకంలోని నదుల్లో తామ్రపర్ణి-వేదవతి నదులు తమ తీరంల్లో నివసించే వారికి బ్రహ్మ లోక ఫలాన్ని అందిస్తాయి. ఈ రెండు నదుల పరివాహాక ప్రాంతాల్లో స్వర్గలోకాన్ని ప్రసాదించే మహా దివ్య క్షేత్రాలున్నాయి. అవన్నీ దర్శించ గలిగినవి కనుక మానవులందరూ సర్వ కాలాల్లో సత్ప్రవర్తన, ధర్మబుద్ధి, దయాగుణం అలవర్చుకుని ఈ దివ్య క్షేత్రాలలో అవకాశమున్న ఏదో ఒక క్షేత్రంలో నివశించాలి. అలా నివశిస్తేనే సత్ఫలం లభిస్తుంది.

## పాపపుణ్యాలు :

పుణ్యక్షేత్రే కృతం పుణ్యం బహుధా బుద్ధిమిచ్ఛతి ।
పుణ్యక్షేత్రే కృతం పాపం మహదణ్వపి జాయతే ॥
తత్కాలం జీవనార్ధశ్చేత్ పుణ్యేన క్షయ మేష్యతి ।
పుణ్యమైశ్వర్యదం ప్రాహుః కాయికం వాచకం తథా ॥

పుణ్యక్షేత్రాలలో చేసిన కొంచెం పుణ్యం ఎన్నో రెట్లు అధికంగా వృద్ధి చెందుతుంది. అలగే ఆ క్షేత్రాలలో చేసిన చిన్న పాపం కూడా అంతే రీతిగా అధికంగా వృద్ధి చెంది మహా పాపం అవుతుంది. కనుక జాగ్రత్తగా పాపం చేయకుండా ఉండాలి. ఇక పుణ్య క్షేత్రాల్లో నివశిస్తే లభించే పుణ్యం వల్ల అప్పటి దాకా చేసిన పాపం వెంటనే క్షయమైపోతుంది. ఇలా పుణ్యమనేది మానవులకు ఐశ్వర్యాన్నిస్తుందని. పూర్వం మహర్షులు ప్రవచించారు. కనుక పుణ్య మనేది ఎంతో గొప్పది. మహిమన్వితమైనది. కనుక దాన్ని మాటతోగానీ, శరీరంతోగానీ, మనస్సుతో గానీ చేస్తే జన్మ జన్మల పాపాన్ని అది నశింపచేస్తుంది.

ఇక పాపం గురించి చెప్పాలంటే ఎంతో ఉంది. మనస్సుతో చేసే పాపం వజ్రలేపనంలాగా మనసుని పట్టుకుని యుగయుగాలు వెంటాడుతూనే ఉంటుంది. అలాంటి పాపం కేవలం ధ్యానం ద్వారానే నశిస్తుంది తప్ప మరో మార్గం లేదు. మానసిక పాపం కాకుండా, వాచిక పాపం, కాయక (శరీరంతో చేసే) పాపం ధనంతో చేసే పాపం అనేవి కూడా ఉన్నాయి. ఇవి నశించాలంటే అధికంగా జపం చేసి వాచిక పాపాన్ని, శరీరం కృశించి పోయేలా తపస్సు చేసి కాయిక పాపాన్ని దానధర్మాలను ఆచరించి ధనంతో చేసిన పాపాన్ని పోగొట్టు కోవాలి. ఇది తప్ప ఇంకో దారి లేదు. ఒక్కసారి అధికంగా పాపం చేస్తే ఆ పాపం వల్ల అప్పటిదాకా చేసిన పుణ్యం కొంచెంకూడా మిగలక నశించి పోతుంది.

పుణ్యాలు పాపాలు అనే రెండిటికీ బీజాంశం వృద్ధాంశం, భాగాంశం అని మూడు భాగాలుంటాయి. వీటిలో పాపానికి సంబంధించిన వృద్ధాంశ

ఇక్కడ చెప్పిన పద్ధతులు ఆచరించటం ద్వారా పోగొట్టుకోవచ్చు. అలాగే ఆ పాపం యొక్క బీజాంశని జ్ఞానాన్ని పొందటం ద్వారా పోగొట్టుకోవచ్చు. చివరికి మిగిలిన భోగాంశని మాత్రం అనుభవించి మాత్రమే పోగొట్టుకోగలరు. అంటే అధికంగా పాపం చేస్తే ఆ పాప ఫలాన్ని మానవుడు తప్పక అనుభవించాలి తప్ప తప్పించుకునే మార్గమేలేదు. అయితే,,,

దేవానాం పూజయాచైవ బ్రాహ్మణానాం చ దారతః ।
తపోధిక్యాచ్చ కాలేన భోగః సహ్యోభవేత్ నృణామ్ ॥

దేవతాపూజలు, జపాలు, సద్బ్రాహ్మణులకు దాన ధర్మాలు చేయటం ద్వారా, చాలాకాలం నియమంగా నిష్టగా తపస్సు ఆచరించటం ద్వారా మానవులకి పాపఫలం అనుభవించగలిగే సహాశక్తి లభిస్తుంది. అంతేకానీ పాపం మాత్రం నశించదు. కాబట్టి సుఖాన్ని కోరుకునే మానవులు ఎలాంటి పాపాలు చేయకుండా జీవించాలి.

## సదాచారం- శౌచం (పవిత్రత) - ధర్మానుష్ఠానం

**సదాచారాలు :** ఎవరైతే సదాచారాన్ని పాటిస్తారో వారు బ్రహ్మణులని, వేదంలో చెప్పిన ధర్మకార్యాలు అనుష్ఠించేవాడు విప్రుడని పిలవబడతారు. అలాగే సదాచారం విద్య వేదోక్తమైన ధర్మకర్మలని అచరించటం, అనే మూడు గుణాలలో ఏదో ఒక గుణాన్ని కలిగి ఉండేవాడిని ద్విజుడంటారు. దీని కంటే తక్కువ స్థాయిలో ఆచారాన్ని పాటిస్తూ స్వల్పస్థాయిలో వేదాధ్యయనం చేస్తూ, రాజుల సేవ మాత్రమే చేసే బ్రాహ్మణుడిని క్షత్రియ బ్రాహ్మణుడని అంటారు. కొద్దిగా ఆచారాన్ని పాటిస్తూ వ్యవసాయాన్ని, వ్యాపారాన్ని ప్రధానంగా చేసే బ్రాహ్మణుడని వైశ్య బ్రాహ్మణుడని శూద్రబ్రాహ్మణుడని అంటారు. ఇతర వ్యక్తుల మీద ఆసూయతో ద్వేషంతో, వారికి ద్రోహం చేయ్యాలని భావించే బ్రాహ్మణుడు ఛండాల బ్రాహ్మణుడని పిలవబడతాడు.

ఇక క్షత్రియుల విషయానికి వస్తే భూమిని పరిపాలించే వాడిని రాజు అని, మిగిలిన రాజవంశీయులని అనగా క్షాత్రం (పౌరుషం-పరాక్రమం)

చూపించే వారిని క్షత్రియులని అంటారు. ధాన్యాదిపదార్ధాలని అమ్మేవాడిని వైశ్యుడని, ఇతర వైశ్య వంశీయుల్ని వణిక్ అని అంటారు. బ్రహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు సేవ చేసేవారిని శూద్రులంటారు. వీరిలో వ్యవసాయాన్ని చేసే వారిని కర్షకులని, పనులేమీ చేయని శూద్రులని దస్యులని అంటారు.. వీరందరూ ఉషఃకాలంలో తూర్పుముఖంగా తిరిగి పరమేశ్వరుణ్ణి ధ్యానించి ఎప్పుడూ ధర్మార్థాల గురించి, వాటి ఆచరించటంలో ఉన్న కష్టనష్టాలగురించి, ఆదాయ వ్యయాలగురించి ఆలోచిస్తూ ఉండాలి.

**కాలకృత్యవిధి :** ఉదయంపూట నిద్ర లేచే పద్ధతిని బట్టి మానవులకి ఆయుర్ధాయం, ద్వేషం, పాపం, మరణం, సంపద, వ్యాధి, పుష్టి, శక్తి అనే ఫలితాలు కలుగుతాయి. రాత్రి సమయంలో చివరి యామాన్ని ఉషస్సు అంటారు. అందులో సగ భాగాన్ని సంధి అంటారు. బ్రాహ్మణుడు ఆ సంధ్యా కాలంలో నిద్ర లేచి, కాలకృత్యాలు తీర్చుకోవాలి. తన ఇంటి నుంచి దూరంగా బయటికి వెళ్ళి ఉత్తరాభిముఖంగా మలవిసర్జన కోసం కూర్చోవాలి. ఒక వేళ అలా కుదరక పోతే ఇతర దిక్కులకు అభిముఖంగా కూర్చోవచ్చు. అయితే నీరు, నిప్పు, బ్రాహ్మణుడు, దేవతలు (విగ్రహాలు లేదా ఆలయాలు) వీటికి ఎదురుగా కూర్చోకూడదు. మలవిసర్జన చేసిన తరువాత ఎడమచెత్తో గుదభాగాన్ని, కుడి చేత్తో నోటిని మూసుకుని, పైకి లేచి తిరిగి ఆ మలాన్ని చూడకుండా జలాశయిం దగ్గర కెళ్ళాలి. సరాసరి జలాశయం (చెరువు లేక కాలువ)లో చేతులుంచి నీటిని తీసుకోకూడదు. ఒక పాత్రలో నీటిని తీసుకుని జలాశయానికి బైట ఆ నీటితో మాత్రమే శౌచక్రియని ఆచరించాలి. ముందుగా మట్టి తీసుకుని ఏడు, ఐదు లేక  మూడు సార్లు ఆమట్టితో గుదాన్ని శుద్ధి చేయాలి. మరల కొద్దిగా మట్టి తీసుకుని గుహ్యభాగాన్ని గుదాన్ని తిరిగి శుభ్రం చెయ్యాలి. ఆ తరువాత లేచి పాత్రలో తెచ్చిన నీళ్ళతో కాళ్ళు, చేతులు కడుక్కుని ఎనిమిది సార్లు నీళ్ళని పుక్కిలించి ఉమ్మివేయాలి.

ఏదో ఒక చెట్టు పుల్లను తీసుకుని జలాశయం బైట చూపుడువేలు ఉపయోగించకుండా, దంతధావనం చెయ్యాలి. ఆతరువాత జలాశయం దగ్గరకి

వచ్చి. జలాశయంలోని దేవతలకి నమస్కరించి, మంత్ర పూర్వకంగా స్నానం చెయ్యాలి. ఈ స్నానం ఎలా చెయ్యాలంటే కంఠంలోతు దిగి స్నానం చెయ్యాలి. అలా అవకాశం లేకపోతే నడుములోతు, లేదా మోకాలిలోతులో దిగి మంత్ర పూర్వక స్నానం ఆచరించాలి. అలా స్నానం చేసిన తరువాత వస్త్రాన్ని తీసుకుని ఐదు కుచ్చులు చేసి దాన్ని పంచెగా ఉత్తరీయంగా ధరించాలి.

**స్నానవిధి :-** నదుల్లో పవిత్ర జలాశయాల్లో, దివ్య తీర్థాలలో స్నానం చేసేడప్పుడు స్నానం చేసిన వస్త్రాల్ని ఆ నీళ్ళలో ఉతక కూడదు. స్నానం చేసాన తరువాత ఆ వస్త్రాన్ని బావి దగ్గరకుగానీ ఇంటికిగానీ తీసుకెళ్ళి శు భ్రంగా పిండి ఆరవేసుకోవాలి. అలా ఉతికి ఆరవేసిన వస్త్రం నుంచి జారే నీళు ్ళ పితృదేవలకి ఎంతో తృప్తినిస్తాయి.

ఆ తరువాత జాబాలోపనిషత్తులో 'అగ్ని రితి భస్మ' అనే మత్రం చెప్పబడింది. ఆ మంత్రంతో భస్మాన్ని తీసుకుని త్రిపుండ్రంగా ధరించాలి. అలా కాకుండా ఆ భస్మాన్ని నీళ్ళలో పారేస్తే ఆ మనిషి శరీరం వదిలిన తరువాత నరకానికి వెళతారు. ఒక వేళ పొరపాటున అలా భస్మాన్ని క్రింద పడేస్తే, ఆ పాపం పోగోట్టుకొవటానికి 'అపోహిష్ఠా' అనే మత్రం చదివి నీళ్ళని తలమీద జల్లుకోవాలి. దీన్ని సంధ్యా ప్రోక్షణ అంటారు.

ఆపోహిష్ఠాది మంత్రాలతో పాదాల్ని, శిరస్సుని, హృదయాన్ని మళ్ళీ శిరస్సు-హృదయం-పాదాల్ని తిరిగి హృదయం, పాదాలు, శిరస్సుని సంప్రోక్షించాలి. (చల్లుకోవాలి) దీన్ని మంత్ర స్నానం అంటారు. ఈ మంత్రస్నానం ఎప్పుడు చేయాలంటే ఆపవిత్రమైన స్పర్శ తగిలినప్పుడు అనగా ఎవరైన మైలవ్యక్తులు తగిలినప్పుడు, ఆరోగ్యం బాగోలేనప్పుడు, రాజులకి, రాష్ట్రాలకి భయం కలిగినప్పుడు, యాత్రాకాలంలో మంత్ర స్నానం చెయ్యాలి. ఉదయం పూట 'సూర్యం అనువాకం' అనే మంత్రంతో సాయంత్రం 'అగ్ని' అనే మంత్రంతో నీళ్ళని తాగి తిరిగి మంత్ర ప్రోక్షణ చెయ్యాలి.

**అర్ఘ్యవిధి :** ఇక అర్ఘ్యప్రదానం ఎలా చెయ్యాలంటే! ఉదయం పూట గాయత్రీ మంత్రంతో అభిముఖంగా (ఎదురుగా)నుంచొని సూర్యుడికి అర్ఘ్యాన్నివ్వాలి.

అలాగే మధ్యాహ్నం కూడా సూర్యాభిముఖంగా నిలబడి సూర్యుడికి ఒకే అర్ఘ్యాన్ని ఇవ్వాలి. సాయంకాల సంధ్యాసమయంలో నేల మీద కూర్చుని పడమర వైపు ముఖాన్ని ఉంచి ఆర్ఘ్యాన్నివ్వాలి.

ఉదయం తూర్పు వైపుకి తిరిగి నీళ్ళని కొద్దిగా పైకి విసిరినట్లుగా అర్ఘ్యాన్ని సమార్పించాలి. మధ్యాహ్నం వ్రేళ్ళ నుంచి ఆర్ఘ్యాన్ని సమర్పించి, ఆ చేతి వేళ్ళ మధ్య నుంచి సూర్యుణ్ణి చూడాలి. ఆ తరువాత ఆత్మప్రదక్షిణ నమస్కారం చేసి పవిత్రంగా ఆచమనం చెయ్యాలి. సాయంత్రం సంధ్యాకాలం తరువాత ఒక గంట లోపు మాత్రమే ఆర్ఘ్యాలు ఆచరించవచ్చు. అది దాటితే సంధ్యోపాసన చేయటం వ్యర్ధం కనుక కాలం దాటి పోకుండా సంధ్యోపాసన చెయ్యాలి. ఇలా ప్రతిరోజూ చెయ్యాలి. ఎప్పుడైనా ఈ పనుల్ని చెయ్యలేకపోతే వందసార్లు గాయత్రీ మంత్రాన్ని జపించాలి. ఇలా నిత్యకర్మ పది రోజులు చెయ్యలేకపోతే లక్షసార్లు గాయత్రీ మంత్రాన్నీ ప్రాయశ్చిత్తంగా చెయ్యాలి. ఇక ఈ సంధ్యోపాసన ఒక నెలపాటు చెయ్యలేక పోతే ఆ బ్రహ్మణుడికి తిరిగి ఉపనయనం చెయ్యాలి.

**తర్పణం :** శివుడు, పార్వతి, సుబ్రహ్మణ్యుడు. విష్ణువు, బ్రహ్మదేవుడు, ఇంద్రుడు, యముడు వంటి ప్రధాన దైవాల కోసం తర్పణాలు చెయ్యాలి. అలా తర్పణం చేసిన తరువాత బ్రహ్మార్పణాన్ని పవిత్రంగా ఆచమనాన్ని చెయ్యాలి.

**ఓంకార జపం :** బ్రాహ్మణుడు దివ్య తీర్థాలకి దక్షిణంగా ఉండే పవిత్రమైన మఠంలోగానీ, దేవాలయంలోగానీ, ఇంటిలోగానీ, ఒక శుభప్రదేశంలో స్థిరంగా ఆసనం మీద కూర్చుని, మంచి మనసుతో ఇష్ట దేవతలందరికీ నమస్కరించి ముందుగా ఓం కారాన్ని ఆ తరువాత గాయత్రీ మంత్రాన్ని జపించాలి. ఈ ఒంకారాన్ని ఎలా జపించాలంటే! జీవుడు బ్రహ్మ వీళ్ళిద్దరికీ భేదం లేదని భావిస్తూ ఓంకారాన్ని జపించాలి. ఈ మూడు లోకాల్ని సృష్టించిన బ్రహ్మ దేవుణ్ణి, స్థితి కర్త విష్ణుమూర్తిని, సంహారకారుడైన పరమేశ్వరుణ్ణి, ఆత్మలో ప్రకాశించే దివ్య జ్యోతిగా ఉపాసిస్తున్నాము. ఈ ఓం కారం మా

జ్ఞానేంద్రియాలని, కర్మేంద్రియాలని మా మనస్సులని, అన్ని కాలాల్లో భోగమోక్షాలనిచ్చే ధర్మ కర్మలని, ఆచరించటంలో ప్రేరేపించుగాక! అని అర్ధవంతంగా ఓం కారాన్ని భావిస్తూ ధ్యానం చెయ్యాలి. అలా చేసేవాడు తప్పకుండా మోక్షాన్ని పొందుతాడు. ఒకవేళ ఓంకారం అర్ధం తెలియకుండా జపం చేసినప్పటికీ, దాని ఫలితం లభిస్తుంది. కనుక బ్రాహ్మణుడు తన బ్రాహ్మణ్యం రక్షించుకోవటం కోసం ఓంకారాన్ని తప్పకుండా ఉపాసించాలి.

**గాయత్రీ జపం :** బ్రహ్మణుడు ఉదయంపూట ప్రతిరోజు వేయిసార్లు గాయత్రీ మంత్రాన్ని జపించాలి. ఆ తరువాత తాను నిత్యం ఉపాసించే మంత్రాన్ని యాధాశక్తి జపించాలి. మధ్యాహ్నంపూట వందసార్లు సాయంత్రంపూట ఇరవై ఎనిమిది సార్లు జపం చెయ్యాలి. తన శరీరంలో మూలాధారం నుంచి సహస్రారం వరకూ ఉండే ఆరుచక్రాల్లో విద్యేశ్వర-బ్రహ్మ-ఈశ-జీవాత్మ- పరమాత్మలను భావిస్తూ ధ్యానం చెయ్యాలి. సోహం, (అతడే నేను) అనగా ఆ పరమాత్మే నేను అనే భావంతో గాయత్రీమంత్రాన్ని జపించాలి. అత్యంత పవిత్రమైన ఈ గాయత్రీ మంత్రాన్ని ప్రతిరోజు వందసార్లు జపిస్తే ఇంద్రలోకం, వేయిసార్లు జపిస్తే ఉత్తమ జన్మలు పొందవచ్చు. పన్నెండు లక్షల సార్లు గాయత్రీ మంత్రాన్ని జపించిన వాడు, ఉత్తమ బ్రాహ్మణుడవుతాడు. అసలు ఒక లక్షసార్లు కూడా గాయత్రీ మంత్ర జపం చెయ్యని వాడు ఏ విధమైన వైదిక పరమైన కార్య కలాపాలు చేయటానికి అర్హుడు కాడు.

ఇలా బ్రహ్మణుడు డెబ్బై సంవత్సరాల వరకూ నియమపూర్వకంగా గాయత్రీ దేవిని ఉపాసించి, నిత్య నైమిత్తిక కర్మల్ని ఆచరించి, ధర్మ బద్ధమైన జీవితాన్ని గడిపి తరువాత సన్యాసం స్వీకరించాలి. ఇలా సన్యాసం స్వీకరించిన వ్యక్తి ప్రతిరోజు ఉదయం పన్నెండు వేల సార్లు ఓం కారాన్ని జపించాలి. ఏదైనా కారణాల వల్ల ఒకరోజు జపం చెయ్యలేక పోతే ఒకేసారి ఏభైవేల సార్లు జపించాలి. అప్పుడు ఆ దోషం పోతుంది. ఇక నెలకు మించి జపాన్ని మానేస్తే తిరిగి గురువు దగ్గర మరల ఓం కార దీక్షను స్వీకరించాలి. అలా చేస్తేనే ప్రాయిశ్చిత్తం జరుగుతుంది. ఈ విధంగా చెయ్యకపోతే రౌరవాది నరకలోకాలకి వెళతాడు.

**మంత్రోపాసన :** కోరికల మీద ఆసక్తి ఉన్నవారు తన కోరికలు తీర్చుకోవటం కోసం ఆ కోరికల్ని తీర్చే వేదోక్తమైన మంత్రాలు ఉపాసించాలి. వేదోక్తమైన కర్మల్ని ఆచరించాలి. దానికోసం ధనం సంపాదించాలి. కోరికలు లేని వారికి ఈ ప్రయత్నాలు అనవసరం. బ్రహ్మణుడు నిర్వికారుగా మోక్ష భావంతో ఎప్పుడూ బ్రహ్మజ్ఞానాన్ని గురించి తెలుసుకుంటూ ఉండాలి.

ధర్మాదర్థో ర్థతో భోగో భోగాద్వైరాగ్య సంభవః ।
ధర్మార్థితార్థ భోగేన వైరాగ్యముపజాయతే ॥

ధర్మం సక్రమంగా ఆచరిస్తే ధనం లభిస్తుంది. అలా లభించిన ధనం వల్ల భోగాలు కలుగుతాయి. ఇలా ధర్మబద్ధంగా లభించిన ద్రవ్యంతో వచ్చే భోగాలు మానవుడికి సంతోషాన్ని సుఖాన్ని కలిగించి చివరికి వైరాగ్యాన్ని పెంపొందిస్తాయి.

ధర్మంగా సంపాదించిన ధనంతో వచ్చే భోగాలు, కోరికల్ని కలిగిస్తాయి. వ్యామోహన్ని పెంచుతాయి. అధర్మాచరణ మీద ఆసక్తిని కలిగిస్తాయి. ఆసలు ఈ ధర్మం అనేది ద్రవ్య ధర్మం దేహధర్మం అని రెండు రకాలుగా ఉంటుంది. యజ్ఞయాగాది క్రతువుల్ని నిర్వహించటానికి ఉపయోగించేది ద్రవ్య ధర్మం. పుణ్య తీర్థాలలో స్నానాల్ని ఆచరించటం దేహ ధర్మం. ధనం ఎక్కువగా సంపాదిస్తే అది మరింత ఎక్కువగా ధనాన్ని సృష్టిస్తుంది. అదే తపస్సు అధికంగా చేస్తే అది దివ్య రూపాన్ని ప్రసాదిస్తుంది. అందుకే నిష్కామంగా (కోరికలు లేకుండా) ధర్మాచరణ చేస్తే మానవులకి అంతః శుద్ధి జరుగుతుంది. దానివలన జ్ఞానం కలుగుతుంది.

**దానవిధి :** కృతాదియుగాలలో తపస్సు ఎంతో గొప్పది. అదే కలియుగంలో ద్రవ్య ధర్మము అంటే దానం ప్రశస్తమైనది. కనుక కలియుగంలో దానాలు చెయ్యాలి. కృతయుగంలో ధ్యానంవల్ల, త్రేతాయుగంలో తపస్సు ఆచరించటం వల్ల, ద్వాపరయుగంలో యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించటం వల్ల, కలియుగంలో విగ్రహపూజవల్ల, మానవులకి జ్ఞానం కలుగుతుంది. పుణ్యాలు

పాపాలు ఎలా ఉంటాయో వాటి ఫలితాలు కూడా అదే విధంగా ఉంటాయి. దానాలు చేయటంలో ఇచ్చే ధనాన్ని బట్టి, తనస్సు ఆచరించటంతో శరీరం కృశించటాన్ని బట్టి, పుణ్య ఫలంలో ఎక్కువ తక్కువలుంటాయి. అధర్మం ఆచరిస్తే దుఃఖం ధర్మం అచరిస్తే సుఖం కలుగుతుంది. కనుక ధర్మాన్ని ఆచరిచాలి. ధర్మంగా సంపాదించాలి.

నలుగురు సభ్యులతో జీవితాన్ని గడుపుతున్న ఒక బ్రహ్మణ కుటుంబానికి వంద సంవత్సరాలపాటు అతని జీవనానికి సరిపడా ద్రవ్యాన్ని దానం చేస్తే అలా దానం చేసిన వ్యక్తికి బ్రహ్మలోకం లభిస్తుంది. అలాగే వేయిసార్లు చాంద్రాయణ వ్రతం చేసినా బ్రహ్మలోకాన్ని పొందవచ్చు. ఒక వేయి కుటుంబాలకు జీవితానికి సరిపడా దానాన్ని చేసే క్షత్రియుడు ఇంద్రలోకాన్ని చేరతాడు. అదే క్షత్రియుడు పదివేల మందికి సంతృప్తిగా దానాన్ని చేస్తే బ్రహ్మ లోకం లభిస్తుంది. మానవులు ఏదేవతను భావించి దాన ధర్మాలు చేస్తారో వారికి ఆలోకంలో నివసించే యోగం లభిస్తుంది. ధనం లేనివాడు ఎప్పుడూ తపస్సు చేస్తూ తపోధనాన్ని వృద్ధి చేసుకోవాలి. పుణ్యక్షేత్రాలు తీర్థాలు దర్శించటం వల్ల తపస్సు ఆచరించటంవల్ల మానవులకి తరగని పుణ్యం సుఖం ప్రాప్తిస్తాయి.

**దానస్వీకారం :** బ్రహ్మణుడు పవిత్రమైన మనస్సుతో, పవిత్రమైన మనుషుల ద్వారా ధనాన్ని దానంగా స్వీకరించాలి. అలాగే పవిత్రమైన యజ్ఞయాగాలు చేయించటం ద్వారా ధనాన్ని సంపాదించాలి. ఎవరి దగ్గరా ధనం కోసం యాచన చేయకూడదు. దైన్యంగా ఉండకూడదు. క్షత్రియులు భుజబలంతో, వైశ్యులు వ్యవసాయంతో, గోవుల్ని పెంచి పోషించటంతో ధనార్జన చెయ్యాలి. ఇలా న్యాయంగా సంపాదించిన ధనాన్ని దానం చెయ్యటం వల్ల పుణ్యం లభిస్తుంది. గృహస్థులైన వాళ్ళు ధన ధాన్యాలను ధర్మం చెయ్యాలి.

వివిధ కాలాల్లో లభించే వస్తువులు, ఫలాలు, ధాన్యాలు మంచి బ్రాహ్మణులకు దానం చెయ్యాలి. అలాగే మంచినీళ్ళు కూడా దానం చెయ్యాలి.

ఎవరైతే అన్నదానం చేస్తారో ఆ దాత భక్ష్యం, భోజ్యం, లేహ్యం, చోష్యం, అనగా పప్పులు, కూరలు, పిండివంటలు, పులుసులతో కూడిన మంచిభోజనాన్ని అందించాలి. అలా దాత నుంచి అన్నదానం స్వీకరించిన వాళ్ళు ఎంతకాలం ఎంతపుణ్యాన్ని సంపాదిస్తారో దానిలో సగభాగం అన్నం దానం చేసిన దాతకు లభిస్తుంది. ఇలా దాత నుంచి దానాన్ని స్వీకరించిన వ్యక్తి తాను స్వీకరించిన దానంలో (ధనం అయితే) అందులో కొంతభాగాన్ని తాను ఇతరులకి దానం చేయాలి తరువాత కొంచెం తపస్సు చేసి తాను దానం తీసుకున్న పాపాన్ని పోగొట్టుకోవాలి. అలా చేయకపోతే నరకానికి పోతాడు.

ప్రతిమనిషి తన దగ్గరున్న ధనాన్ని మూడు భాగాలు చెయ్యాలి. ధర్మం కోసం ఒక భాగం, వృద్ధి కోసం ఒకభాగం, భోగంకోసం మరో భాగం చెయ్యాలి. వీటిలో ధర్మ భాగంలోని ధనంతో నిత్య నైమిత్తిక ధర్మ పరమైన కార్యక్రమాలు నిర్వర్తించాలి. వృద్ధి భాగంలోని ధనంతో తిరిగి ధనాన్ని సపాదించటానికి అవసరమైన కార్యాలు చేయాలి భోగభాగంలోని ధనంతో భోగాలని అనుభవించాలి.

వ్యవసాయం చేసేవారు తమ ఆదాయంలో ఏడో వంతు పాపాలు పోవటం కోసం దానం చేయ్యాలి. అదే విధంగా వ్యాపారంతో సంపాదించే వాళ్ళు తాము సంపాదించిన ధనంలో ఆరోభాగం దానం చెయ్యాలి. ఇక బ్రహ్మణులు తాము సంపాదించిన ధనంలో నాలుగోవంతు దానం చెయ్యాలి. అపవిత్రంగా లభించిన ధనాన్ని సముద్రంలో పారేయ్యాలి. అకస్మాత్తుగా ఊహించని విధంగా ధనం లభిస్తే దాంట్లో సగభాగాన్ని వెంటనే దానం చెయ్యాలి. ఎప్పుడూ మానవులు ఇతరుల దోషాల్ని వర్ణించకూడదు. తమ చూసిన విన్న ఇతరుల దోషాన్ని పరుల వద్ద చెప్పకూడదు.

ఇతరుల మనసుకి బాధకలిగించే విధమైన మాటల్ని మాట్లాడకూడదు. ఐశ్వర్యం లభించాలంటే ఉదయ సాయంత్ర సంధ్యల్లో అగ్నిహోత్రాన్ని అనుష్టించాలి. రెండు సార్లు చేయలేక పోతే కనీసం ఒకసారైనా చెయ్యాలి.

హవిస్సు అర్పించాలి, తరువాత స్థాలీపాకాన్ని చెయ్యాలి. ఇలా రోజు ఆరని అగ్ని గుండాన్నీ అజస్రం అంటారు. ఈ విధంగా అగ్ని ఉపాసన చెయ్యటానికి శక్తి లేకపోతే కనీసం ప్రతిరోజూ సూర్యుడికి నమస్కారమైనా చెయ్యాలి.

అత్మ జ్ఞానాన్ని కోరుకునే వాళ్ళు, ధనాన్ని కోరుకుకనేవాళ్ళు ఈ విధంగా శాస్త్ర బద్ధంగా ఉపాసన నిత్యానుష్టానాలు చెయ్యాలి. బ్రహ్మయజ్ఞాన్ని శ్రద్ధగా చేసేవాళ్ళు ప్రతిరోజూ పరమేశ్వరుణ్ణి భక్తిగా పూజించే వాళ్ళు, నిత్యం అగ్నిని ఉపాసించేవాళ్ళు, గురుసేవని శ్రద్ధగా చేసేవాళ్ళు బ్రహ్మణులకి సంతృప్తి కలిగించే వాళ్ళు, స్వర్గాన్ని చేరుకుంటారు.

## దానం - దేశం - కాలం - పాత్రత

దేవయజ్ఞం లాంటి పవిత్రమైన కార్యాలని స్వగృహంలో చేస్తే సమానమైన ఫలితం, గోశాలలో పదింతల ఎక్కువ ఫలితం, జలాశయ తీరాలల్లో దానికంటే పదిరెట్లు, మారేడు, తులసి, రావి చెట్ల వద్ద మరో పదిరెట్ల అధికంగా ఫలితం, లభిస్తుంది. అలాగే దేవాలయాల్లో చేసిన దానికంటే తీర్థ క్షేత్రాల్లో చేస్తే పదిరెట్లు, దానికంటే పుణ్య నదీతీరంలో చేస్తే పదిరెట్లు అధికఫలం చేసిన వాడికి కలుగుతుంది.

గంగా గోదావరీచైవ కావేరీ తామ్ర పర్ణికా ।
సింధుశ్చ సరయూ రేవా సప్తగంగాః ప్రకీర్తితాః ॥

గంగా, గోదావరి, కావేరి, తామ్రపర్ణి, సింధూ, సరయూ, రేవా అనే సప్త నదీతీరాలు ఎంతో పవిత్రమైనవి. వీటి తీరాల్లో యజ్ఞాలు చేస్తే మంచి ఫలితం లభిస్తుంది. వీటన్నిటి కంటే సముద్రతీరం పదిరెట్లు అధిక ఫలాన్నిస్తుంది. దీనికన్నా పర్వత శిఖరాల్లో యజ్ఞం చేస్తే మరో పదిరెట్లు అధిక పుణ్యం సాధకుడికి సంప్రాప్తిస్తుంది.

ఇలా యజ్ఞదానాది కర్మల్ని ఎన్ని చేసినప్పటికీ వాటి వాటి ఫలితాలు మాత్రం ఇలానే ఉంటాయి. కృతయుగంలో సంపూర్ణఫలం, త్రేతాయుగంలో నాలుగు భాగాల్లో మూడోవంతు ఫలం ద్వాపరంలో సగం ఫలం కలియుగంలో

నాలుగో వంతు ఫలం మాత్రమే లభిస్తుంది. ఇక కలియుగంలో సగం కాలం పూర్తయితే నాలుగో వంతుకన్నా చాలా తక్కువ మాత్రమే ఫలం లభిస్తుంది. అందుకే ఈ కలియుగంలో భక్తి శ్రద్ధలతో పవిత్రమైన మనసుతో పుణ్యకర్మల్ని ఆచరించాలి. రవిసంక్రమణం రోజు యజ్ఞయాగాది క్రతువులు దాన ధర్మాలు చేస్తే వచ్చే ఫలితం దక్షిణాయన ప్రారంభంలో చేస్తే పదిరెట్లు అధికంగా లభిస్తుంది. దానికంటే మకర సంక్రమణం రోజు మరోపదిరెట్లు అధికంగా, దానికన్నా పదిరెట్లు చంద్రగ్రహణం రోజున దానికన్నా పదిరెట్లు అధిక ఫలం సూర్య గ్రహణం రోజున చేస్తే లభిస్తుంది.

సూర్య గ్రహణం పరమ పుణ్య కాలం అని పండితులు చెప్తారు. ఈ జగత్తుకి ప్రకాశాన్ని ఇచ్చే సూర్య భగవానుడు రాహువు చేత పట్టుకోబడి గ్రహణాన్ని పొందినప్పుడు దోషం కలుగుతుంది. ఆదోషం పోగొట్టుకోవటానికి స్నానాలు, జపాలు, దానాలు చెయ్యాలి. మనకున్న దోషాల్ని శాంతింప చేస్తుంది. కాబట్టి గ్రహణ కాలాన్ని పుణ్యకాలం అంటారు. దీనితో సమానమైన కాలం ఏదంటే జన్మ నక్షత్రం వచ్చిన రోజు, వ్రతాలు పూర్తి చేసిన రోజు గ్రహణ కాలంతో సమానమైన ఫలితాన్నిస్తాయి. ఇక మహాపురుషులందరూ ఒక చోట కలిస్తే అది కోటి సూర్యగ్రహణాలంత పుణ్యంప్రదం.

తపోనిష్ఠులు, యెగులు, జ్ఞానులు, యతులు నిత్యం పూజించటానికి అర్హులు. అటువంటి దివ్య పురుషుల్ని పూజిస్తే పాపాలు నశిస్తాయి. గాయత్రీ మంత్రాన్నీ 24 లక్షల సార్లు జపం చేసిన బ్రహ్మణుడే సంపూర్ణ మైన దానాన్ని గ్రహించటానికి అర్హుడు. మానవుడు పతితుడు భ్రష్టుడు కాకుండా రక్షించే శాస్త్రాన్ని పాత్రము అంటారు. దానం చేసే దాతని పాపాలనుంచి కాపాడేవాడు దాన గ్రహీత. అలా దానాన్ని స్వీకరించిన యోగ్యమైన ప్రతిగ్రహీత కూడా పాత్రము అని పిలవబడుతాడు.

**"గాయంతాం త్రాయతే పాతాద్గాయత్రీ మ్యుచ్యతేహిసా"**

తన మంత్రాన్ని నిరంతరం గానం చేసే వాణ్ణి రక్షించేది కాబట్టి గాయత్రీ అని గాయత్రీ మంత్రానికి పేరు వచ్చింది. లోకంలో ధనం లేనివాడు ఎలాగైతే

ఇతరులకి ధనాన్ని ఇవ్వలేడో, అలాగే పవిత్రమైన మనసుని ధర్మ ప్రవర్తనని కలిగిన సత్పురుషుడు మాత్రమే ఇతరుల్ని ప్రభావితం చేసి వారిని రక్షించగలడు. గాయత్రీ జపాన్ని నియమంగా చేసి పవిత్రమైన వాడే శుద్ధ బ్రాహ్మణుడు. అలాంటి వాడే దాన స్వీకారానికి అర్హుడు. స్త్రీ ఐనా పురుషుడైనా ఆకలి వేసిన ప్రతివాడూ అన్నదానానికి పాత్రుడవుతాడు. మంచి మనస్సు కలిగిన సదాచార పరాయణుడైన బ్రహ్మణుడిని పిలిచి ఆయన ద్వారా గాయత్రీ మంత్రార్థాన్ని తెలుసుకుంటే కోరిన కోర్కెలు తీరుతీయి. ఒక వస్తువుమీద మనసుపడిన వ్యక్తికి దానిని అతడు కోరకుండానే ఇచ్చేస్తే దాని ద్వారా సంపూర్ణమైన పుణ్యఫలం లభిస్తుంది.

**దానఫలితాలు :** పుట్టుకతో దరిద్రాన్ని అనుభవిస్తున్న బ్రాహ్మణుడికి దానం చేస్తే ఆ దాతకి భూలోకంలో పది సంవత్సరాలు భోగాలు కలుగుతాయి. అదే ధనాన్ని వేదం చదివిన పండితుడికిస్తే స్వర్గంలో పది సంవత్సరాలు భోగాలు అనుభవిస్తాడు. గాయత్రీ మంత్రాన్నీ నిరంతరం జపించేవాడికిస్తే పది సంవత్సరాలు సత్యలోక నివాసం లభిస్తుంది. విష్ణు భక్తుడైన విప్రుడికి దానం ఇస్తే వైకుంఠం, శివభక్తుడైన విప్రుడికిస్తే కైలాసం దాతకి సంప్రాప్తిస్తాయి.

ఆదరం, ఆహ్వానం, అభ్యంగనస్నానం, పాదసేవ చేయటం, వస్త్రం, గంధ పుష్పాలతో పూజ, నేతి అప్పాలతో షడ్రసోపేతమైన భోజనం, అనంతరం తాంబూలం, దక్షిణ, నమస్కారం, తిరిగి వెళ్ళేటప్పుడు కొంత దూరం సాగనంపటం అనే పది అంగాలతో బ్రహ్మణుడికి అన్నాన్ని సమర్పిస్తే ఆదాతకి మరో జన్మలో పది సంవత్సరాలు పరిపూర్ణమైన ఆరోగ్యం సంప్రాప్తిస్తుంది. ఇలా దశాంగంతో కూడిన భోజనాన్ని ఆదివారం రోజు పదిమంది బ్రహ్మణులకి పెడితే ఆ దాతలు 100 సంవత్పరాలు ఆయురారోగ్యాలతో జీవిస్తాడు. సోమ మొదలైన వారాల్లో అన్నదానం చేస్తే ఇహలోకంలో పరలోకంలో కూడా మంచి ఫలితం లభిస్తుంది.

విద్యని కోరుకునే మానవులు చిన్న పిల్లలని బ్రహ్మలుగా భావించి వారికి అన్న దానాన్ని చెయ్యాలి. పుత్ర సంతానం కావాలనుకునేవారు యువకులను విష్ణుస్వరూపులుగా భావించి వారికి శ్రద్ధగా అన్నాన్ని సమర్పించాలి. ఇక జ్ఞానాన్ని కోరుకునే వాళ్ళు వృద్ధుల్ని రుద్ర స్వరూపులుగా భావించి అన్న దానాన్ని సమర్పించాలి. అలాగే బుద్ధిని, శక్తిని కోరుకునే వాళ్ళు కన్యలని సరస్వతిగా దేవి రూపంగా భావించి వారికి దానం చెయ్యాలి. భోగభాగ్యాలు కోరుకునే మానవులు మంచి యువతులని లక్ష్మీరూపిణిలుగా, ఆత్మ జ్ఞానాన్ని కోరుకునే వాళ్ళు వృద్ధస్త్రీలని పార్వతి దేవిగా భావించి దానాలు సమర్పించాలి.

గురు దక్షిణ రూపంగా మానవులకి లభించిన ధనం పరిశుద్ధమైనది. దాన్ని దానం చేస్తే పూర్ణఫలితం కలుగుతుంది. క్షత్రియులకి పరాక్రమాన్ని చూపించటం ద్వారా వచ్చిన సంపద, వైశ్యులకి వ్యాపారం ద్వారా లభించిన ధనం. శూద్రులకి వ్యవసాయం ద్వారా ప్రాప్తించిన సంపద ఉత్తమమైనవి.

ధర్మాన్ని కోరుకునే స్త్రీలకి, తండ్రి, భర్త ఇచ్చిన ధనం ఉత్తమమైనది. చైత్రం, వైశాఖం లాంటి పన్నెండు మాసాలలో గోవు, భూమి, నువ్వులు, బంగారం, నేయి, వస్త్రాలు, ధాన్యం, బెల్లం, వెండి, ఉప్పు, గుమ్మడికాయ, కన్య, అనే పన్నెండు వస్తువుల్ని వరుసగా 12 నెలలు దానం చెయ్యాలి. లేదా వాటన్నిటినీ కలిపి ఒకేసారి మహా పర్వదినాలలో దానం చెయ్యాలి.

ఆవుని, ఆవుపాలని, నెయ్యిని దానం చేస్తే ధనధాన్యాలని ఆశ్రయించుకున్న దోషాలు పోతాయి. ఆవు తాకిన నీళ్ళని చిలకరిస్తే నీళ్ళు, నూనె మొదలైన వాటిని ఆశ్రయించుకొని వున్న దోషాలు పోతాయి.

ఆవు పాలు, పెరుగు, నెయ్యిని దానం చేస్తే శారీరక, మానసిక, వాచక దోషాలు తొలగిపోయి, శరీరం, మాట, మనస్సు పరిశుద్ధం అవుతాయి. భూదానంవల్ల ఇహలోకంలో పరలోకంలో దాతకి ప్రతిష్ఠ కలుగుతుంది. నువ్వుల్ని దానం చేస్తే బలం, మృత్యుంజయత్వం కలుగుతుంది. అలాగే బంగారాన్ని దానం చేస్తే జఠరాగ్ని వృద్ధి చెంది బలం పెరుగుతుంది. నెయ్యిని దానం చేస్తే

పుష్టి అభివృద్ధి, వస్త్రదానం చేస్తే ఆయుర్వృద్ధి కలుగుతాయి. ధాన్య దానం వల్ల అన్న సమృద్ధి, బెల్లం దానం వల్ల, మధురమైన ఆహార పదార్థాలు లభించటం. వెండిని దానం చేస్తే వీర్య వృద్ధి, ఉప్పు దానం వల్ల షడ్రసోపేతమైన ఆహారం లభిస్తాయి. వీటిన్నిటినీ ఒకేసారి దానం చేస్తే సకల సన్మంగళాలు ఆ దాతకి కలుగుతాయి.

గుమ్మడి కాయను దానం చేసేవారికి పుష్టి కలుగుతుంది. కన్యాదానం చేస్తే జీవించి ఉన్నంత వరకూ భోగాలు లభిస్తాయి. తరువాత పరలోకంలో కూడా సుఖభోగాలు ప్రాప్తిస్తాయి. పనస, మామిడి, అరటి, వంటి పళ్ళను, మినుములు, పెసలు వంటి తృణ ధాన్యాలను, మిరియాలు, లవంగాలు వంటి సుగంధ ద్రవ్యాలను ఆయా ఋతువులలో లభించే పళ్ళను, కూరలను దానం చెయ్యాలి.

యేన కేన ఉపాయేన హ్యల్పం వాయదివా బహు ।
దేవతార్పణ బుద్ధ్యా చ కృతం భోగాయ కల్పతే ॥

ఏదో ఒక ఉపాయాన్ని అనుసరించి మానవుడు తన శక్తి కొలది కొద్దిగాకానీ. ఎక్కువగా కానీ దానాన్ని దేవతార్పణ బుద్ధితో ఆచరించాలి. అలా ఆచరిస్తే మోక్షాన్ని పొందుతాడు.

## శివపూజచేసే పద్ధతి - శివపూజా ఫలం

మట్టిలో చేసిన విగ్రహాలను పూజించడం వల్ల ఎన్నో పుణ్యఫలాలు కలుగుతాయి. ఇలా మట్టి విగ్రహాలను పూజిస్తే అపమత్యువు కాలమత్యువు కూడా తొలగిపోతుంది. అన్న పానాలకు ఎప్పుడు లోటుండదు. ఈ పూజని స్త్రీలు పురుషులు కూడా ఎలాంటి విచక్షణాలేకుండా చేయవచ్చు. ఇక మట్టితో విగ్రహాలు ఎలా చేయాలంటే!

మంచి నీరు ప్రవహించే నదిలోగానీ, చెరువులోగానీ, బావిలోగానీ, నీళ్ళల్లో గాని ఉన్న మట్టిని తీసుకురావాలి. ఆ మట్టిని పరిశుభ్రం చేసి, అందులో గంధాన్ని కలిపి, చక్కగా అందంగా దేవుడి మూర్తిని తయారు చేసి అందమైన

మండపంలో ఉంచి, పాలతో సంస్కరించాలి. ఆ తరువాత భక్తి శ్రద్ధలతో పూజించాలి. వినాయకుడు, పార్వతి శివుడు, విష్ణువు, సూర్యుడి మట్టి విగ్రహాలను శివలింగాన్ని ఒకే చోట ఉంచి షోడశోపచారాలతో పూజించాలి. ఆ తరువాత అభిషేకం చేసి, పావుశేరు బియ్యంతో వండిన అన్నాన్ని నైవేద్యంగా దేవుడికి సమర్పించాలి. ఈ నైవేద్యం ఎంత పరిమాణంలో ఉండాలంటే ఇంట్లో ఉండే విగ్రహానికి పావుశేరు, మానవులు ప్రతిష్టించిన ఆలయంలోని మూర్తికి ఒకశేరు, దైవ ప్రతిష్ట జరిగిన క్షేత్రాలలో మూడుశేరులు, స్వయంభూ లింగాలు వెలసిన ఆలయాలలో ఐదుశేరులు బియ్యాన్ని అన్నంగా వండి నైవేద్యం పెట్టాలి. అలాచేస్తేనే పరిపూర్ణమైన ఫలితం లభిస్తుంది.

**మహాపూజ :** ఇక మహాపూజ అంటే మానవులు ప్రతిష్టించిన శివలింగాలకి వంద శేర్లు స్వయంభూ శివలింగాలకి వెయ్యి శేర్లు బియ్యాన్ని అన్నంగా వండి, ఆ లింగాలకి జలం, తైలం, గంధం వంటి పదార్ధాలతో పంచామృతాలతో అభిషేకంచేసి నైవేద్యాన్ని సమర్పిస్తే ఆ పూజని మహాపూజ అంటారు.

అభిషేకాదాత్మశుద్ధిః గంధాత్పుణ్యమవాప్యతే ।
ఆయుఃతృప్తిశ్చ నైవేద్యాత్ ధూపాదర్థ మవాప్యతే ॥
దీపాత్ జ్ఞానమాప్నోతి, తాంబూతాద్భోగ మాప్నుయాత్ ।
తస్మాత్స్నానాదికం షట్కం ప్రయత్నేన సాదయేత్ ॥

భక్తవశంకరుడైన పరమేశ్వరుడికి అభిషేకంచేస్తే మనస్సు శుద్ధి చెందుతుంది, గంధంతో అభిషేకిస్తే పుణ్యం లభిస్తుంది. నైవేద్యాన్ని భక్తిగా సమర్పిస్తే ఆయుర్ధాయం పెరుగుతుంది. ధూపాన్ని ఇస్తే ధనం లభిస్తుంది. దీపం చూపిస్తే జ్ఞానజ్యోతి మనలో వెలుగుతుంది. ఇక తాంబూలాన్ని అందిస్తే ఆయన భోగభాగ్యాల్ని ప్రసాదిస్తాడు కనుక అందరూ యధాశక్తి పరమేశ్వరుణ్ణి ఈ ఆరు ఉపచారాలతో సంతృప్తి పరచాలి.

## తిథులు - దేవతల పూజా ఫలాలు

దేవతల్ని భక్తిగా పూజించటం వల్ల వచ్చే శుభఫలితాలు చాలా ఉన్నాయి. వినాయకుణ్ణి పూజిస్తే కోరిన కోరికలు తీరతాయి. ఏ రోజుల్లోనంటే శుక్రవారం నాడు గానీ, శ్రావణభాద్రపద మాసాల్లో వచ్చే శుక్ల పక్ష చతుర్థితిథినాడు గానీ, ధనుర్మాసంలో వచ్చే శతభిషా నక్షత్రం ఉన్న రోజుగానీ, తనని పూజిస్తే గణపతి సంతోషిస్తాడు. దేవతలందరినీ ఆయావారాల్లో పూజిస్తే పూజించినవారి అభీష్టాలు తీరుతాయి. ఎందుకంటే! తిథులు, నక్షత్రాలు యోగాలు అన్నిటికీ వారమే ఆధారం కాబట్టి వారానికి పెరగడం తరగడం ఉండవు కదా! అందుకే వారాన్ని పూర్ణ బ్రహ్మస్వరూపంగా భావిస్తారు. సూర్యోదయం నుంచి మర్నాడు సూర్యోదయందాకా ఒక రోజుని ఒక వారంగా పరిగణించాలి. ఇక తిథులలో పూజ ఎలా చేయాలంటే.

కృష్ణపక్ష చతుర్థి రోజు మహా గణపతిని పూజిస్తే పదిహేను రోజులు పాటు చేసిన పాపం పోతుంది. ఆదే చైత్రశుద్ధ చతుర్థి, పౌర్ణమి, పాడ్యమి నాటి తిథులలో, తిథి మొదటి సమయంలో పూజ చేస్తే, మానవులకి పరిపూర్ణమైన ఫలితం లభిస్తుంది. రాత్రితో ఉన్న తిథి ముందుభాగం పితృదేవతల్ని పూజించటానికి మంచిది. ఏ తిథి అయినా ఉదయం నుంచి మధ్యాహ్నం వరకూ ఉంటే చాలాప్రశస్తం. వేదాల్లో పూజ శబ్దానికి ఇలా అర్థం చెప్పబడింది. 'పూజాయతే అనేన', ఆనేన అంటే ఈ పనిచే పూజ అనగా పరిపూర్ణమైన ఫలితం 'జాయతే' అందుతుంది అదే పూజా అని భావం.

భాద్రపద గణపతిని మాసంలో సూర్యుడు సింహరాశిలో ఉన్నప్పుడు పూజిస్తే ఒక సంవత్సరం కాలం చేసిన పాపం తొలగిపోతుంది. శ్రావణ మాసంలో ఆదివారం హస్తా నక్షత్రం ఉన్న సప్తమి తిథిలోగాని, మాఘమాసం శుక్లపక్ష సప్తమీ తిథి రోజుగాని, సూర్యుడిని ఉపాసించాలి. జ్యేష్ఠ - భాద్రపద మాసాల్లో వచ్చే బుధవారం, శ్రవణానక్షత్రం ద్వాదశీ తిథి కలసి వచ్చిన రోజుగానీ, కేవలం ద్వాదశి తిథి నాడు గానీ విష్ణు మూర్తిని పూజించాలి.

అధికమైనధనాన్ని కోరుకునేవాడు కర్కాటక సంక్రాంతి నాడు గానీ, సోమవారం నాడు మృగరాశి నక్షత్రం - నవమి తిధి కలసి వచ్చిన రోజు గానీ, జగన్మాత ఆది పరాశక్తిని పూజిస్తే సకలభోగాలు లభిస్తాయి. అలాగే ఆశ్వయుజ మాసం శుక్లపక్ష నవమి, కృష్ణ పక్షంలో వచ్చే చతుర్దశీ ఆదివారం కూడా దేవికి ప్రీతిపాత్రమైనవే. ఇవే కాక ఆర్ద్రా నక్షత్రం వచ్చిన రోజు శివుడిని పూజిస్తే చాలా మంచిది. మాఘమాసంలో వచ్చే కృష్ణ చతుర్ధి రోజు శివపూజ చేస్తే ఆయురారోగ్యాలు, కలిగి అపమృత్యువు తొలగి పోతుంది.

**కార్తీకమాసం :** కార్తీకమాసంలో దేవతలందరినీ వారి వారి వారాలలో తిధులలో పూజిస్తే సకల శుభమంగళాలు కలుగుతాయి. వ్యాధులు నశిస్తాయి. గ్రహబాధలు తొలగి పోతాయి. కార్తీక మాసంలో వచ్చే ఆదివారాలలో సూర్యభగవానుణ్ణి పూజించి నూనె, వస్త్రాలను దానం చేస్తే కుష్టురోగం పోతుంది. కరక్కాయలు, మిరియాలు, వస్త్రాలు, పాలు బ్రాహ్మణులకి దానం చేస్తే క్షయరోగం పారిపోతుంది. దీపాలు ఆవాలు దానం చేస్తే మూర్ఛ వ్యాధి నివారించబడుతుంది.

కృత్తికా నక్షత్రం ఉన్న సోమవారం రోజు కార్తీక మాసంలో శివుణ్ణి భక్తిగా పూజించే మానవులకు దరిద్రం కదిలిపోతుంది. ఇదే కృత్తికా నక్షత్రం వచ్చిన మంగళవారం రోజు సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని పూజించి దీపం, ఘంట దానం చేస్తే వాక్సిద్ధి కలుగుతుంది. ఈ కృతికా నక్షత్రం చాలా గొప్పది ఈ నక్షత్రం వచ్చిన గురువారం నాడు బ్రహ్మదేవుడిని పూజించి తేనె, బంగారం, నేయి దానం చేస్తే భోగభాగ్యాలు కలుగుతాయి. శుక్రవారం నాడు గణపతిని పూజించి గంధం, పుష్పం, అన్నదానం చేస్తే సుఖభోగాలు వృద్ధి చెందుతాయి. బుధవారం నాడు విష్ణుమూర్తిని ఆరాధించి, పెరుగన్నాన్ని దానం చేస్తే మంచి సంతానం కలుగుతుంది. శనివారం నాడు దిక్పాలకులను పూజించి నమస్కరించాలి. ఇలా చేస్తే అపమృత్యువు తొలగిపోతుంది.

కార్తీకమాసంలో ఉప్పు, ఇనుము, మినుములు, శొంఠి అల్లం, మిరప, నూనె, గంధం నీళ్ళు, దానం చేస్తే స్వర్గం లభిస్తుంది. ఈ దానాలలో ద్రవపదార్థాలైన నూనె, నీళ్లని కనీసం ఒకశేరు (ఒక లీటరు సమానంగా)

ఘనపదార్థాలైన పప్పు ఉప్పులు కనీసం మూడుతులాలు (సుమారుగా 30 గ్రాములు) తగ్గకుండా చెయ్యాలి. ధనుర్మాసంలో శివాది దేవతలని తెల్లవారుఝామున పూజిస్తే సకల సిద్ధులు కలుగుతాయి. మార్గశిర మాసంలో అన్నదానం చేస్తే పాపాలు నశించి పుణ్యలోకాలు సంప్రాప్తిస్తాయి. సుఖభోగాలు కావాలనుకునే మానవుడు మార్గశిరమాసంలో కనీసం మూడురోజులు పూజలు చెయ్యాలి. అదీ తెల్లవారుఝామునుంచి సూర్యోదయం అయ్యేలోపు మాత్రమే చెయ్యాలి.

**ధనుర్మాసం :** ధనుర్మాసంలో బ్రాహ్మణులు నెలరోజుల పాటు మధ్యాహ్నం వరకూ ఆహారాన్ని తీసుకోకుండా ఉపవాసం ఉండి. గాయత్రీ మంత్రాన్ని జపించాలి. తిరిగి మధ్యాహ్నం భోజనం చేసిన తరువాత నుంచి రాత్రి పడుకునే వరకూ. శివ పంచాక్షరీ మంత్రాన్నీ జపించాలి అలా చేస్తే కైవల్యం లభిస్తుంది. ధనుర్మాసంలో మహానైవేద్యాన్ని పరమేశ్వరుడికి సమర్పించాలి. ఇది ఎలా ఉండాలంటే ! మంచి పరిశుభ్రమైన బియ్యాన్ని, ఒక పుట్టెడు తీసుకుని అన్నం వండాలి. ఒక శేరు మిరియాలు, మూడు శేరుల తెనె, నెయ్యి, ఒక కుంచెడు పెసరపప్పు, పన్నెండు శేర్ల పెరుగు, ముప్పై ఆరు తమలపాకులు – వక్కలు, కర్పూరం, సుగంధ చూర్ణం కలిగిన తాంబూలం కలిపి సమర్పిస్తే అది మహానైవేద్య మవుతుంది. ఇలాంటి మహానైవేద్యాన్ని పరమేశ్వరుడికి నివేదించి దాన్ని భక్తులందరికీ వితరణ చేయ్యాలి.

ఇలా మహానైవేద్యాన్ని దానం చేసే వ్యక్తి స్వర్గలోకాన్ని పొందుతాడు. ఇలాంటి ముప్పై ఆరు వేల మహానైవేద్యాలని ఒక జన్మ నైవేద్యం అంటారు. ఈ జన్మనైవేద్యాన్ని ఎవరైతే తమ జీవిత కాలంలో ఒక సారి శివుడికి సమర్పిస్తారో వాళ్ళకి పునర్జన్మ అనేది ఉందదు. ఈ జన్మ నైవేద్యాన్ని కార్తీక మాసంలో చేస్తే శుభప్రదంగా ఉంటుంది. ఈ జన్మ నైవేద్యాన్ని దానం చేస్తే తన జన్మని శివుడికి సమర్పించినట్లే అవుతుంది. అది చేసిన వాడిని శివుడు తనలో కలిపేసుకుంటాడు.

ఇటువంటి జన్మనైవేద్యాన్ని శివుడికి మాత్రమే సమర్పించాలి. ఎందుకంటే ఈ సకల చరాచర జగత్తుకీ, స్త్రీ పురుషరూపంలో (అర్ధనారీశ్వరుడుగా) జన్మనిచ్చేవాడు ఆయనే కాబట్టి.

ఈ ప్రపంచం అంతా బిందు-నాదంతో కూడుకుని ఉంటుంది. బిందువు శక్తి అయితే శివుడు నాదం. ఈ రెండిటి స్వరూపమే ఈ ప్రపంచం. బిందువుకి నాదం ఆధారమైతే, నాదానికి బిందువు ఆధారమౌతోంది. ఈ రెండూ ప్రపంచానికి ఆధారమౌతున్నాయి.

బిందుర్దేవీ శివోనాద శ్శివలింగంతు కథ్యతే ।
తస్మాజ్జన్మ నివృత్యర్థం శివలింగం ప్రపూజయేత్ ॥

బిందువు దేవీరూపం. శివుడు నాద రూపం. ఈ రెండూ కలిసిందే శివలింగం కాబట్టి జన్మ రాహిత్యం కోసం శివశక్త్యాత్మకమైన శివలింగాన్ని భక్తిగా పూజించాలి. ఈ జగత్తుకి తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరుల రూపంగా శివలింగాన్ని భావించి విశేషంగా అర్చించాలి. ఈ సమస్త ప్రకృతికి ప్రభువు కాబట్టి భగవంతుడైన శివుణ్ణి ఋషులందరూ భర్గుడని పిలుస్తారు. ఇహలోకంలో పరలోకంలో భోగాల కోసం భర్గుడైన శివుడిని శివలింగ రూపంలో పూజించాలి. శివశక్తుల చిహ్నాలు శివలింగంలో కలిసిపోయి ఉన్నాయి. తన శివలింగాన్ని పూజిస్తే శివుడు ఎంతో సంతోషిస్తాడు. ప్రతి ఆదివారం రోజున లభించిన ద్రవ్యాలతో శివలింగానికి షోడశోపచారర పూజలు చేయాలి. అలాచేస్తే పునర్జన్మ ఉండదు.

ఆదివారం రోజు ఓంకారంతో మహాలింగాన్ని పూజించాలి. ఆవుపేడ, ఆవుమూత్రం, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపెరుగు, అనే పంచగవ్య ద్రవాలతో విడివిడిగా అభిషేకం చేసి, ఆ తరువాత తేనె చక్కెర కలిపి మరోసారి అభిషేకం చేయాలి. ఆ తరువాత ఆవు పాలతో పాయసం చేసి ఓంకారం ఉచ్చరిస్తూ స్వామి లింగానికి నివేదన చెయ్యాలి. లింగాలలో ఓంకారాన్ని ధ్వని లింగం అని, స్వయంభూగా వెలసిన లింగాన్ని, ప్రతిష్ఠించబడిన లింగాన్ని 'మ'కార

లింగమని, ఉత్సవాలలో ఊరేగించే శివలింగాన్ని 'ఉ'కార లింగమని, మంత్రదీక్ష ఇచ్చిన గురువు శరీరాన్ని 'ఆకార' లింగం అని అంటారు. ఈ ఆరు రకాల లింగాలని నిత్యం పూజించే మానవుడు జీవన్ముక్తుడవుతాడు.

## ఓంకారం - పంచాక్షరీ మంత్ర మహిమ

**ఓంకార మహిమ :** ఈ ప్రకృతి నుంచి పుట్టిన సంసారం అనే సముద్రాన్ని 'ప్రః' అని పిలుస్తారు.దీన్ని దాటించే అనగా సంసార సాగరాన్ని దాటించి మనల్ని తరింపచేసే నావ లాంటిది ఓంకారం అని పండితులు చెప్తారు. అలాగే 'ప్రః' అంటే ప్రపంచం 'న' లేదు. 'వః' మీకు అనగా ఈ ప్రపంచంలోని దుఃఖాలు బాధలు అనేవి లేకుండా పోగోట్టేది ప్రణవం ప్రణవ అనగా ప్ర=నిశ్చయంగా న=నడిపించేది (అనగా మోక్ష మార్గానికి చేర్చేది) వః=మమ్మల్ని అనే అర్థంలో కూడా ఓం కారం (ప్రణవం) భావించబడుతుంది.

ఇటువంటి పవిత్రమైన ఓంకారాన్ని జపిస్తూ ఆ పరమేశ్వరుడిని ఓం కారంతో పూజిస్తూ ఉండే వాళ్ళకి, అన్ని కర్మలూ నశించి దివ్య జ్ఞానం కలుగుతుంది. ఈ ఓంకారం స్థూలం సూక్ష్మం అని రెండు విధాలుగా ఉంటుంది. 'ఓం' అనే ఏకక్షరాన్ని సూక్ష ప్రణవం అని అంటారు. ఈ రెండు ప్రణవాలలో మొదటిదైన సూక్ష్మప్రణవాన్ని అనగా శుద్ధ ఓంకారాన్ని జీవన్ముక్తుడైన మానవుడు జీవితాంతం ధ్యానిస్తూ ఉండాలి. అలా ఎవరైతే ధ్యానిస్తారో వారు శరీరం పతనం చెందాక పుణ్యపురుషుడైన పరమేశ్వరుడి సన్నిధికి చేరతారు. ఈ ప్రణవ బీజాన్ని (ఓం కారాన్ని) 36 కోట్ల జపం చేసిన వ్యక్తి దివ్య యోగాన్ని నిశ్చయంగా పొందుతారు. ఈ ప్రణవం మరల హ్రస్వ–దీర్ఘభేదాలతో రెండు రకాలుగా ఉంటుంది.

**ఓంకారజపం :** 'ఆ'కార 'ఉ'కార 'మ'కార బిందు, నాద, శబ్ద, కాల, కళ అనే వాటితో ప్రణవ మంత్రం యోగుల హృదయాలతో మాత్రమే ఉంటుంది. 'అ'కార 'ఉ'కార 'మ'కారాలనే మూడు వర్ణాలతో మాత్రమే కలిసి ఉండేదాన్ని హ్రస్వ ప్రణవం అంటారు. వాటిలో అ కారం శివుడు, ఉ కారం శక్తి, మ

కారం శివశక్తుల ఏకత్వాన్ని సూచిస్తాయి. కనుక సకల పాపాల నుంచి విముక్తి పొందాలనుకునే సాధకులు హ్రస్వ ప్రణవాన్ని (ఓం) జపించాలి.

శివ శక్తి స్తయోర్త్యైక్యం మకారాంతం త్రికాత్మకమ్ ।
హ్రస్వమేవం హి జాప్యంస్యాత్ సర్వపాప క్షయైషిణామ్ ॥

భూమి, నీరు, నిప్పు, ఆకాశం, గాలి అనేవి పంచభూతాలు, గంధ, స్పర్శ, రూప, రస, శబ్దాలు అనేవి వీటి లక్షణాలు. ఈ మొత్తం కలిసిన పది విషయాల మీద ఆశతో ఉండే మానవుల్ని ప్రవృత్తులంటారు. – వీటి మీద ఆశలేని వాళ్ళని నివృత్తులు (అనగా సన్న్యాసులు – యతులు) అంటారు. వీరిలో ప్రవృత్తులు హ్రస్వ ఓం కారాన్ని నివృత్తులు దీర్ఘ ఓం కారాన్ని జపించాలి.

అత్యంత పవిత్రమైన ఈ ఓం కారాన్ని తోమ్మిది కోట్ల జపం చేసినవాడు పూర్తిగా పాపాలనుంచి విముక్తి పొంది శుద్ధుడవుతాడు. మరో తొమ్మిది కోట్ల జపం చేస్తే పృదివీ తత్త్వాన్ని,27 కోట్లు చేస్తే జలతత్త్వాన్ని, 36 కోట్లు చేస్తే ఆకాశత్త్వాన్ని, 45 కోట్లు చేస్తే వాయుతత్త్వాన్ని, 54 కోట్లు చేస్తే ఆకాశతత్త్వాన్ని జయిస్తాడు. అలాగే 63 కోట్ల జపంతో గంధాది పంచగుణాల్ని 72 కోట్ల జపంతో అహంకారతత్త్వాన్ని కూడా జయిస్తాడు. ఇలా ఇంతజపం చేయలేని వారు ప్రతిరోజు కనీసం వేయిసార్లు జపించినా పరిశుద్ధులౌతారు. కాబట్టి 108 కోట్ల సార్లు ప్రణవాన్ని ఉపాసించిన వ్యక్తి జ్ఞానిగా మారి శుద్ధయోగాన్ని పొందుతాడు.కనుక మానవులు ఆత్మ సాక్షాత్కారం కోసం ఓం కారాన్ని జపించాలి.ఇలా ప్రణవ స్వరూపుడైన పరమేశ్వరుడిని ఎప్పుడూ ధ్యానిస్తూ ఓం కారాన్ని ఎల్లప్పుడూ జపిస్తూ ఉండేవాడు. సాక్షాత్తు శివస్వరూపుడే అనటంలో ఎలాంటి సందేహం లేదు. అతడే నిజమైన శివయోగి.

**శివయోగి :** క్రియాయోగి, తపోయోగి, జపయోగి అని శివయోగులు మూడు విధాలుగా ఉంటారు. వీరిలో తనదగ్గరున్న ధనాన్ని ఖర్చుపెడుతూ, శివపూజలు వైభవంగా చేస్తూ చేయిస్తూ ఉండేవాడిని క్రియాయోగి అని, కేవలం శివపూజను చేస్తూ, తక్కువగా ఆహారాన్ని స్వీకరిస్తూ, ఇంద్రియాలను జయించి, నిశ్చలంగా

ఉడే వాడిని తపోయోగి అని, ఇవే గుణాలతో ఉండి కోరికలన్నిటినీ వదిలేసి మంచిమనసుతో ఎప్పుడూ శివనామ జపాన్ని కొనసాగించే వ్యక్తిని జపయోగి అని అంటారు. ఇలాంటి మూడు రకాల యోగుల్ని షోడశోపచారాలతో పూజించే వారుకూడా ముక్తిని పొందుతారు.

**పంచాక్షరీ జపయోగం :** తపస్సు చేసే వారి కోసమే 'జపం' విధించబడినది. ఈ జపం జన్మ బంధాల్ని తుడిచేస్తుంది. నమః శివాయ. అనేది పంచాక్షరీ మంత్రం. దీన్ని జపించేవాడు సర్వసిద్ధుల్నీ పొందుతాడు. ఎప్పుడూ ఓం కారంతో కూడిన (ఓం నమః శివాయ) పంచాక్షరీ మంత్రాన్నే జపించాలి. మాఘమాసం. భాద్రపద మాసాలు ఈ మంత్ర జపానికి చాలా మంచివి. ఈ మాసాలలో చక్కగా గురువు నుంచి ఉపదేశాన్ని పొంది శుక్ల పక్షంలో జపాన్ని ప్రారంభించాలి. కృష్ణ పక్షంలో ముగించే వరకు జపాన్ని చేయాలి.సాధకుడు ఒకపూట భోజనాన్ని చేస్తూ మితంగా మాట్లాడుతూ, ఇంద్రియ నిగ్రహంతో ప్రతిరోజు. కనీసం ఒక వేయి జపంచేయాలి. ఈ పంచాక్షరిని అక్షర లక్షలు అనగా ఐదు లక్షలు జపంచేస్తే చాలా మంచిది.

పద్మాసనస్థం శివథం గంగాచంద్ర కళాన్వితమ్ ।
వామోరూ స్థిత శక్త్యా చ విరాజంతం మహాగణైః ॥
మృగటంక ధరం దేవం వరదాభయ పాణికమ్ ।
సదానుగ్రహ కర్తారం సదాశివ మనుస్మరేన్ ॥

ఇలా పంచాక్షరీ మంత్ర జపాన్ని అనుష్టానం చేసేవారు. పద్మాసనంతో కూర్చుని మంగళాలని ప్రసాదిస్తూ, గంగతో చంద్రకళతో ప్రకాశిస్తూ, ఎడమ తొడపై పార్వతి దేవి కూర్చుని ఉండగా ప్రమథగణాలు కీరిస్తూ ఉండగా తన దివ్య హస్తాలలో మృగాన్ని, త్రిశూలాన్ని, వరద, అభయ ముద్రల్ని ధరించి, భక్తుల్ని సదా అనుగ్రహించే పరమేశ్వరుడిని మనసులో భావిస్తూ తూర్పు ముఖంగా కూర్చుని పంచాక్షరీ మంత్ర జపాన్ని చేయ్యాలి. ఇలా జపాన్ని శుక్లపక్ష చతుర్ధశి రోజు ప్రారంబించాలి.

కృష్ణపక్షంలోని చతుర్ధశీ తిథిరోజు జపాన్ని పూర్తిచేసిన తరువాత సాధకుడు మరల 12 వేల సార్లు పంచాక్షరిని జపించి, భార్య సహితుడైన శివభక్తుల్ని ఐదుగురిని భక్తిగా పూజించాలి. అలా వారిని పూజించిన తరువాత పరమేశ్వరుడిని కూడా భక్తిగా పూజించి పంచాక్షరీ మంత్రహోమాన్ని చెయ్యాలి.

**పంచాక్షరీ మంత్ర హోమం :** శివ పంచాక్షరీ హోమంలో కపిలగోవు నెయ్యితో ఒక వేయి, లేదా నూటఒకటి, కనీసం పదకొండు ఆహుతులు సమర్పించాలి. ఆ తరువాత గురువుగారికి రెండు ఆవులని దక్షిణగా సమర్పించి. వారి ఆశీర్వాదాన్ని అందుకోవాలి. తదనంతరం భార్య సహితులైన శివభక్తుల్ని శివుడి పంచరూపాలుగా భావించి వారిని మంచి విందు భోజనంతో సంతృప్తిపరిచి, రుద్రాక్షలు, వస్త్రాలు సమర్పించి, ఆ తరువాత తను భోజనం చెయ్యాలి. ఈ విధంగా శాస్త్రోక్తంగా పంచాక్షరీ మంత్ర పురశ్చరణ చేస్తేనే సాధకుడికి మంత్రసిద్ధి కలుగుతుంది.

ఈ విధంగా మంత్రసిద్ధి పొందిన సాధకుడు పంచాక్షరిని ఐదు లక్షలు జపిస్తే పాపాలన్నీ నశిస్తాయి. క్రమంగా ఐదేసి లక్షలు ద్విగుణీకృతంగా చేస్తూ ఉంటే ఉత్తమ లోకాలు చేరతాడు. కోటి జపంతో బ్రహ్మలోకాన్ని పొంది బ్రహ్మతో సమానుడౌవుతాడు. మరో కల్పం ప్రారంభం కాగానే సాధకుడు బ్రహ్మపుత్రుడుగా తిరిగి జన్మిస్తాడు.

**పంచాక్షరీ జపఫలం :** కాలచక్రంలో ఒకదానిపై ఒకటిగా ఐదు చక్రాలుంటాయి. వీటిలో సృష్టి-మోహాన్ని బ్రహ్మ చక్రమని. భోగ మోహాన్ని విష్ణు చక్రమని, కోపమోహాన్ని రుద్ర చక్రమని, సంసారంలో సంచరించటాన్ని ఈశ్వర చక్రమని, జ్ఞాన మోహాన్ని శివచక్రమని అంటారు. పంచాక్షరీ మంత్రాన్ని పదికోట్లు జపం చేసిన సాధకుడు కారణేశ్వర లోకాన్ని పొందుతాడు. నూట అయిదు కోట్లు జపం చేస్తే శివలోకంలో ఐదో ప్రాకారానికి బైట నివాసం ఉండే అర్హత లభిస్తుంది. ఈ ఐదో ప్రాకారంలో గొప్ప వెండి మండపం ఉంటుంది. అది నందీశ్వరుడి నివాస స్థానం. ఈ నందీశ్వరుడు ఎల్లపుడు శివ పంచాక్షరీ జపాన్ని చేస్తూనే ఉంటాడు. ఆయన ఉండే ప్రాకారానికి ఐదు

ప్రాకారాల తరువాత ఉండే ప్రాకారం శివుడి నిలయం. ఆ నిలయంలో పరమేశ్వరుడి అనుగ్రహంతో నందీశ్వరుడికి శివజ్ఞానం లభిస్తుంది. శివుడి అనుగ్రహం ఉంటేనే ఎవరికైనా శివలోక ప్రభావం తెలుసుకునే ఆవకాశం లభిస్తుంది.

ఇలా ఇంద్రియ నిగ్రహంతో పంచాక్షరీ మంత్ర జపాన్ని ఆచరించి బ్రాహ్మణులు మోక్షాన్ని పొందవచ్చు. అలాగే ఇతర వర్ణాల వారు బ్రాహ్మణ స్త్రీలు గురువుద్వారా ఉపదేశాన్ని పొంది పంచాక్షరీ మంత్రాన్నీ 'శివాయ నమః' అని జపించాలి. ఈ జపాన్ని ఐదు లక్షలు చేస్తే దీర్ఘాయుష్షు లభిస్తుంది. అలా క్రమంగా ఐదేసి లక్షలు పెంచుకుంటూ జపంచేస్తే ఎన్నో శుభ ఫలితాలు లభిస్తాయి. వైశ్యులు ఐదులక్షలు పంచాక్షరీ జపాన్ని చేస్తే వైశ్యత్వం తొలగి క్షత్రియుడవుతాడు. మరో ఐదు లక్షలు చేస్తే క్షత్రియత్వం పోయి బ్రాహ్మణుడవుతాడు. అలాగే శూద్రులు కూడా పంచాక్షరిని 'శివాయ నమః' అని ఇరవై ఐదు లక్షలు జపిస్తే బ్రాహ్మణత్వాన్ని పొందుతాడు.

శివ పంచాక్షరీ జపం చేసే సాధకులు శివభక్తుల్ని శివస్వరూపులుగా భావించి పూజించాలి. శివభక్తుడికి శివుడికి తేడా లేదు. శివమంత్రం జపించే వాడు శివుడే అవుతాడు. శివభక్తురాలైన స్త్రీని దేవి స్వరూపురాలుగా భావించాలి.

శక్తిం బేరం చ లింగం చ హృల్లేఖ్యా మాయయా యజేత్ ।
శివలింగం శివంమత్వా స్వాత్మానం శక్తి రూపకః ॥

మహర్షులారా! మంచిపనులు చేసే వారి కంటే తపస్సు చేసేవాడు గొప్ప, అలా వందమంది తపస్సు చేసేవాని కంటే జపం చేసేవాడు, మేయిమంది జపం చేసేవారి కంటే శివజ్ఞానం కలిగిన ఒక్కడు ఎంతో గొప్ప. అలా శివజ్ఞానం కలిగిన లక్షమంది కంటే ధ్యానం చేసేవాడు. కోటిమంది ధ్యానం చేసేవారి కంటే సమాధిలో ఉండే వాడు ఎంతో గొప్పవాడు. ఇలాంటి శివభక్తులని శ్రద్ధగా పూజించాలి. శివ-శక్తులని. శివభక్తులని పూజించే మానవులు శివరూపులై సకల శుభ మంగళాలని పొందుతారు.

# బంధం - మోక్షం

ప్రకృతి మొదలైన ఎనిమిది బంధాలు చేత బంధించబడతాడు జీవుడు. అలాంటి జీవుడిని బద్ధుడుఅనంటారు. ఎవరైతే ఈ ఎనిమిది బంధాల నుంచి విముక్తి పొందుతాడో ఆ జీవుడు ముక్తుడవుతాడు. ప్రకృతి మొదలైన ఎనిమిది బంధాలని వశం చేసుకోవటాన్ని మోక్షము అంటారు. మోక్షమనేది స్వతస్సిద్ధమైనది. బద్ధుడైన జీవుడు ముక్తిని పొందితే అతడు ముక్తజీవుడని పిలువబడతాడు. ప్రకృత్యాది అష్టకాలు ఇవి ప్రకృతి, సమీష్టి, బుద్ధి, త్రిగుణాత్మకమైన అహంకారము, పంచతన్మాత్రలు అనే ఎనిమిది. మానవదేహం ఈ ప్రకృత్యాది అష్టాకాల వల్లనే పుడుతుంది. దేహం నుంచి కర్మ తిరిగి కర్మనుండి దేహము పుడుతుంది. ఇలా జన్మ నుంచి కర్మ, కర్మనుంచి జన్మ తిరిగి తిరిగి పుడుతూ వుంటాయి.

మానవ శరీరం స్థూలరూపం, సూక్ష్మరూపం కారణరూపం అని మూడు విధాలుగా వుంటుంది. స్థూల శరీరం క్రియల్ని నిర్వహిస్తూ వుంటుంది. సూక్ష్మ శరీరం ఇంద్రియ భోగాలనిస్తుంది. కారణ శరీరం ఆత్మానందాన్నిస్తుంది జీవుడు.తను చేసిన పుణ్యపాప కర్మలకి అనుగుణంగా సుఖము దుఃఖము వంటి ఫలితాలని పొందుతాడు. ఈవిధంగా జీవుడు కర్మ అనే తాడుతో కట్టబడి, మూడు శరీరాలతో, కర్మలతో కూడుకుని ఎప్పుడూ, సంసారమనే చక్రంలో తిరుగుతూ వుంటాడు. ఈ సంసార చక్రంలో పడి తిరగడాన్ని జీవుడు నివారించుకోవాలంటే ఆ చక్రాన్ని సృష్టించిన సర్వేశ్వరుడనే ప్రార్ధించాలి. అసలు ప్రకృత్యాది అష్టకమే ఈ సంసారమనే మహా చక్రానికి కారణభూతము. శివుడు ప్రకృతికన్నా పై స్థానంలో వుండేవాడు. ప్రకృతికంటే ఉత్కృష్టమైన స్థానంలో వున్న పరమేశ్వరుడే జీవుడిని రక్షించగలడు. విత్తనం నీటిని పీల్చుకుని ఉబ్బి తిరిగి అంకురిస్తుంది. అలాగే శివుడు కూడా ప్రకృత్యాది అష్టకాలని తన వశం చేసుకుని, ఈ సృష్టిని చేస్తుంటాడు. ఈ సర్వమూ ఆయన వశంలో వుంటుంది కనుకనే ఆయనకి శివుడనే పేరువచ్చింది. శివుడే సర్వజ్ఞుడు, పరిపూర్ణమైనవాడు.

ఎటువంటి కోరికలూ లేనివాడు. ఆయనకి, సర్వజ్ఞత్వము, తృప్తి, అనేది జ్ఞానం, స్వాతంత్ర్యం, అనంతమైన శక్తి ఉన్నాయి. పరమేశ్వరుడి కున్న అనంతమైన విభూతులు గురించి కేవలం వేదములే తెలుసుకోగలవు. కాబట్టి శివుడు అనుగ్రహం ఉంటే ప్రకృత్యాది అష్టగుణాలు వశమవుతాయి. అలా వశం అవ్వాలంటే అందరూ ఆయన్ని భక్తి శ్రద్ధలతో పూజించాలి.

ఎటువంటి కోరికలు లేని శివుడిని ఎలా పూజించాలి? అంటే శివుడిని గురించి భక్తితో చేసిన ఏరకమైన కర్మ అయినా ఆయన అనుగ్రహాన్ని జీవుడికి కలిగిస్తుంది. శివుడిని లింగ రూపంలో, విగ్రహరూపంలో, భక్తుడిలో శివభావన చేసి, శరీరంతో, మనస్సుతో, వాక్కుతో, ధనంతో భక్తిగా పూజించాలి. ప్రకృతి కంటే అధికుడైన శివుడిని ఇలా ఎవరైతే పూజిస్తారో వారిని విశేషంగా అనుగ్రహిస్తాడు. ఈవిధంగా చేసిన సాధకుడికి శివుడి అనుగ్రహం వలన కర్మ స్వాధీనమవుతుంది. క్రమంగా కర్మనుంచి ప్రకృతివరకూ అష్టగుణాలు జీవుడికి స్వాధీనమై అతడు ముక్తుడుగా, ఆత్మారాముడుగా, విరాజిల్లుతాడు. ఇలా పరమేశ్వరుడి అనుగ్రహంలో కర్మ అనేది శరీరం వశంకాగానే ఆసాధకుడికి, శివలోకంలో నివాస స్థానం లభిస్తుంది. దీనినే సాలోక్యం అంటారు. ఎప్పుడైతే సాధకుడికి పంచతన్మాత్రలు వశం అవుతాయో అప్పుడు ఆ జీవుడు శివుడి సమీప స్థానాన్ని పొందుతాడు. దీనివల్ల ఆముక్త జీవుడికి శివుడికి వున్న ఆయుధాలు ఆయనకున్న క్రియలు సిద్ధిస్తాయి. శివుడి దివ్యానుగ్రహంతో అతడికి సమిష్టి బుద్ధికూడా వశమవుతుంది.

ఎప్పుడైతే సమిష్టిబుద్ధి జీవిడికి వశమవుతుందో అప్పుడు అతడికి సార్ష్టి(శివుడితో సమానమైన శక్తి) లభిస్తుంది. దీనితో ఆ వ్యక్తికి ప్రకృతి వశమైపోతుంది. ఇలా ప్రకృతిని వశం చేసుకున్న జీవుడు శివుడికున్న సర్వజ్ఞత్వం, వంటి విభూతులన్నీ అప్రయత్నంగానే లభించి ఆత్మారాముడుగా ప్రకాశిస్తాడు. వేద శాస్త్రాలు తెలిసిన పండితులు ఇలా లభించే ముక్తిని సాయుజ్యముక్తి అని అంటారు. ఈవిధంగా శివలింగాదుల్ని పూజించటం వలన ముక్తి అనేది క్రమంగా

జీవుడికి లభిస్తుంది. కాబట్టి భక్తుడు శివుడు దివ్యానుగ్రహాన్ని పొందటానికి, ఆయన్ని క్రియ అనే వాటితో ఆరాధించాలి. శివక్రియ, శివుడి గురించిన తపస్సు, సర్వకాల సర్వావస్థలలో, శివమంత్ర జపం, శివజ్ఞానం, శివుడిని గురించి చింతిస్తూ ధ్యానం అనే క్రియల్ని ఒకదాని తరువాత ఒకటి క్రమంగా అభ్యసించాలి. ఇలా తను జీవించినంతకాలం ప్రతిరోజూ, ఉదయం నించి నిద్రపోయేవరకూ శివనామస్మరణ చేస్తూ కాలం గడపాలి. ఇలా చేస్తు సద్యోజాతాది మంత్రాలతో నిత్యం ఆయన్ని పుష్పాలతో పూజిస్తూ వుంటే ఆ జీవుడు శివుడి అనుగ్రహాన్ని పొందుతాడు.

## శివలింగ మహిమ

లింగములు ప్రధానంగా రెండువిధాలు. జీవుల కోరికలు అన్నీ తీర్చి మోక్షాన్నిచ్చే సూక్ష్మ లింగం దీనినే ప్రణవం(ఓం) అంటారు. ఇది మొదటిలింగం ఇది నిరాకారంగా వుంటుంది. ఇక రెండవది స్థూల ప్రణవం అనగా పంచాక్షరి (నమశ్శివాయ) ఇది సాకార లింగం. ఈ స్థూల, సూక్ష్మ ప్రణవాలు రెండింటినీ జపించిన వాడికి మోక్షం లభిస్తుంది. ఇవేగాక పురుష, ప్రకృతి లింగాలు ఇంకా చాలా వున్నాయి. వీటి పూర్తి వివరాలు ఆపరమేశ్వరుడికే తప్ప ఇంకెవరికీ తెలియవు. అయితే పృథివీ వికారమైన లింగాల మరికొన్ని వున్నాయి.

పృథివీ సంబంధలింగాలలో మొదటిది స్వయంభూ లింగము, రెండవది పృధివీ లింగము, ప్రతిష్ఠిత లింగం మూడవది కాగా నాలుగవది చరలింగం, అయిదవది గురులింగం. ఇలా ఐదు రకాలుగా లింగాలు వుంటాయి. సర్వేశ్వరుడు ఋషుల, దేవతల తపస్సుకి మెచ్చుకుని, సంతోషించి, వారికి తన సాన్నిధ్యాన్ని కల్పించటానికి భూమిలో నాదరూపంలో వుండి, “చెట్టు బీజం భూమిని ఛేదించుకుని మొలకెత్తిన” విధంగా తను కూడా భూమినుంచి ఉద్భవిస్తాడు. అలా ఉద్భవించిన లింగాన్ని స్వయంభూ లింగమని అంటారు. అటువంటి స్వయంభూ లింగాన్ని భక్తి శ్రద్ధలతో పూజించిన భక్తుడికి జ్ఞానం తనంత తానుగా అతణ్ణి వరిస్తుంది.

భక్తుడు, బంగారు రేకుమీదగానీ, వెండిరేకుమీద గానీ భూమిమీద గానీ, వేదికమీదగానీ, పవిత్రమైన ప్రణవరూపంతో వున్న లింగాన్ని తన చేతులతో వ్రాసి దానిమీద శివుడిని ప్రతిష్ఠించి ఆవాహన చేయాలి. బిందులింగం నాదలింగం అనేవి స్థిర, చర, అనే రెండు విధాలుగా వుంటాయి. వీటిలో శివుడిని దర్శించటం ఎంతో గొప్పది. సాధకుడికి ఏ లింగం మీద శ్రద్ధ వుంటుందో ఆ రూపమైన ఫలితాన్నే పొందుతాడు. శివభక్తుడు తన చేతులతో రాసిన యంత్రంలోగానీ, వృక్షాదుల మీదకానీ శివుడిని ఆవాహన చేసి ఆయన్ని షోడశోపచారాలతో పూజించాలి. అలా చేసిన వాడు స్వయంగా ఈశ్వరత్వాన్ని పొందుతాడు. దేవతల చేత, ఋషుల చేత, తమ ఆత్మసిద్ధికోసం, మంత్ర పూర్వకంగా పవిత్రమైన ప్రదేశాలలో, పవిత్రమైన మనస్సుతో, తమ చేతులతో స్థాపించబడిన లింగాలకు, పౌరుషలింగాలు, లేక ప్రతిష్ఠిత లింగాలని పేరు. ఇటువంటి లింగాన్ని నిత్యం పూజించిన వారికి పౌరుషైశ్వర్యం లభిస్తుంది. విద్యావేత్తలైన బ్రాహ్మణుల చేత, సంపన్నులైన రాజులచేత మంత్రపూర్వకంగా శిల్పుల చేత నిర్మించబడి, స్థాపించబడిన లింగం, ప్రతిష్టిత లింగమని, ప్రాకృత లింగమని పిలువబడుతుంది. అటువంటి లింగాన్ని పూజిస్తే ప్రాకృతైశ్వర్యం, సకల భోగాలూ లభిస్తాయి.

నిత్యమైనది బలమైనది పౌరుషం అని చెప్పబడుతుంది. బలం లేనిది, అనిత్యమైనది ప్రాకృతం అనబడుతుంది. నాభి, నాలుక, ముక్కు చివర, శిఖ అనే వరుసలో తొడలు, హృదయం శిరస్సు అనే మూడు స్థానాలలో భావన చేయబడే లింగాన్ని ఆధ్యాత్మిక లింగమని, చరలింగమని అంటారు. భూమిని ప్రాకృతలింగమని, భూమిమీద ఉండే పర్వతాన్ని పౌరుషలింగమని అంటారు. అలాగే వృక్షాలని పౌరుషలింగాలని, లతలు తీగలని, ప్రాకృత లింగలని కూడా అంటారు. అణిమాది అష్టసిద్ధులనిచ్చే ఐశ్వర్యం పౌరుషమని, భార్య, సాధారణ ధనం వంటి ఐశ్వర్యాలు ప్రాకృతమని పండితులు చెబుతారు. చర లింగాలలో రసలింగం ఎంతో గొప్పదని చెబుతారు. రసలింగాన్ని పూజించిన బ్రాహ్మణులకు

వారి కోరికలన్నీ నెరవేరుతాయి. మంగళకరమైన బాణలింగాన్ని పూజించే క్షత్రియులకు, సామ్రాజ్యం లభిస్తుంది. బంగారు లింగాన్ని భక్తి శ్రద్ధలతో పూజించే వైశ్యులకు, అమితైశ్వర్యం లభిస్తుంది. అలాగే పవిత్రమైన రాతిలింగాన్ని భక్తిగా అర్చించే శూద్రులకు ఎంతో పవిత్రత లభిస్తుంది. ఇక స్ఫటికంతో చేయబడిన బాణలింగాన్ని అందరూ పూజించవచ్చు. అది అందరి కోరికలనీ నెరవేరుస్తుంది. భక్తుడు తన దగ్గర లింగం లేకపోతే ఇతరుల దగ్గరవున్న లింగాన్ని పూజించవచ్చు అది దోషం కాదు.

భక్తివున్న సుమంగుళులు మట్టితో చేసిన లింగాన్ని పూజిస్తే చాలా మంచిది. ప్రవృత్తి మార్గంలో వున్న భర్తృహీనురాలైన (విధవా)స్త్రీలు స్ఫటికలింగాన్ని పూజించటం శ్రేష్ఠం. అలాగే నివృత్తి మార్గంలో వున్న విధవా స్త్రీలు రసలింగాన్ని పూజిస్తే మంచిది. స్త్రీలు తమ బాల్యంలోగానీ, యవ్వనంలో గానీ, వార్ధక్యంలోగానీ, స్ఫటికలింగాన్ని పూజించాలి. అలా చేస్తే వారికి సర్వభోగాలూ లభిస్తాయి. ప్రవృత్తి మార్గంలో వున్న స్త్రీలు భూమిమీద పీఠ పూజచేస్తే వారి కోరికలన్నీ తీరుతాయి. ఇలా ప్రవృత్తి మార్గంలో వుండే భక్తుడు శివపూజా కార్యక్రమాన్ని యోగ్యుడైన గురువు సహాయంతో చేయాలి. శివాభిషేకాన్ని శ్రద్ధగా చేసి, మంచి బియ్యంతో అన్నాన్ని వండి నైవేద్యం పెట్టాలి. ఇలాపూజ అయిన తరువాత ఆ పూజచేసిన లింగాన్ని ఇంటిలో ఒక ప్రత్యేకమైన గదిలో లేదా ప్రదేశంలో వుంచాలి. నివృత్తి మార్గంలో వుండే భక్తుడు తన అరచేతిలో లింగాన్ని వుంచుకుని, దీనిని పూజించాలి. భిక్షాన్నాన్ని నివేదన చేయాలి. ఇలా నివృత్తి మార్గంలో వుండేవారికి సూక్ష్మలింగమే శ్రేష్ఠమైనది. వారు ఆ లింగాన్ని విభూతితో పూజించి ఆ విభూతిని నైవేద్యంగా సమర్పించాలి. ఇలా పూజచేసిన లింగాన్ని ఎల్లప్పుడూ శిరస్సుమీద ధరించాలి.

## విభూతి

విభూతి మూడు రకాలు 1.వేదాగ్నిజము 2.లోకాగ్నిజము 3.శివాగ్నిజము అని వుంటుంది. లౌకికాగ్నినుంచి పుట్టిన భస్మాన్ని ద్రవ్యాల శుద్ధి కోసం

వినియోగించాలి. మట్టి వస్తువులు, చెక్క వస్తువులు లోహ వస్తువులు, ధాన్యాలు, తిలలు వంటి ద్రవ్యాలు, వస్త్రాలు, పాత ఆహార పదార్ధాలు, కుక్కలు వంటి జంతువులు తాకిన పదార్ధాలు, వంటి వాటిని లౌకికాగ్ని భస్మం శుద్ధి చేయాలి. ఈ భస్మాన్ని అవసరాన్ని బట్టి పొడిగాలేక తడిచేసిగాని వినియోగించాలి.

వేదాగ్నిజమైన భస్మాన్ని వెంటనే అనగా అగ్నిహోత్రం నుంచి పుట్టిన భస్మాన్ని ఆ కర్మపూర్తికాగానే ధరించాలి. పవిత్రమైన వేద మంత్రాలతో హవిస్సుని సమర్పించగా అది హుతమై భస్మరూపాన్ని పొందుతుంది. అటువంటి పవిత్రమైన హోమభస్మాన్ని ధరించిన భక్తుడు. తాను స్వయంగా హోమాన్ని నిర్వర్తించిన ఫలితాన్ని పొందుతాడు. ఇక మూడవది శివాగ్నిజం. అఘోరేభ్యః అనే మంత్రాన్ని ఉచ్చరిస్తూ మారేడు సమిధల్ని అగ్ని గుండంలో వేయాలి. అలాగే అందులో కపిలగోమయంతోగానీ, ఇతర గోమయం (ఆవుపేడ)తోగానీ పిడకలు చేసి ఆ పిడకలని దానితో పాటూ జమ్మి, రావి, పలాశ, మర్రి, అరగ్వథము అనే వృక్షాల సమిథల్ని కూడా వేయాలి. ఇలా ఇవన్నీ దహించబడి మిగిలిన భస్మాన్ని శివాగ్నిజ భస్మం అంటారు. శివమంత్రాన్ని ఉచ్ఛరిస్తూ, దర్భల జ్వాలతో సమిధను కాల్చి ఆ భస్మాన్ని మంచి వస్త్రంతో బాగా శుద్ధి చేసి ఒక కొత్త కుండలో దాచుకోవాలి. అటువంటి పవిత్రమైన భస్మాన్ని ధరించిన వ్యక్తి ఎంతో తేజస్సుతో, సకల జనాకర్షణ శక్తిని పొందుతాడు. అందరిచేత ఆదరించబడతాడు. శివుడు ఈ సృష్టి మొదట్లో భస్మం అనే శబ్దాన్ని ఇలా నిర్వచించాడు. “రాజు తన రాజ్యంలో సారవంతమైన పన్నుని తీసుకుంటాడు. అలాగే మనుషులు ధాన్యాదుల్ని వేడిచేసి (ఉడికించి) దాని సారాన్ని ఆహారంగా స్వీకరిస్తారు. అలాగే అందరూ తినే వివిధ రకాల భక్ష్యాలు పచనం అయి వాటిసారం దేహానికి పుష్టిని కలిగిస్తుంది. అదేవిధంగా ఈ ప్రపంచాన్ని సృష్టించిన పరమేశ్వరుడు కూడా తన చేత అధిష్టించబడిన ఈ జగత్తుని దహించి, ఆ సారాన్ని (భస్మం) తీసుకుని తన దేహం మీద పూసుకున్నాడు. అలా శివుడు భస్మాన్ని ధరించే మిషతో ఈ జగత్తు సారాన్నంతా గ్రహించాడు. సాక్షాత్తు తన రూపమే అయిన ఈ జగత్తుసారాన్ని తన శరీరం మీద స్థాపించుకున్నాడు.

ఆకాశసారంతో కేశాలని, వాయుసారంతో ముఖాన్ని, అగ్నిసారంతో హృదయాన్ని, జలం సారంతో నడుముని, పృధివీసారంతో మోకాళ్ళని అలాగే మిగిలిన ఇతర అవయవాలను ధరించాడు. బ్రహ్మ, విష్ణు, రుద్రుల సారభూతమైన భస్మాన్ని పరమేశ్వరుడు తన లలాటం మీద త్రిపుండ్రంగా ధరించాడు. అలా ఆయన విభూతిని ధరించగా ఆయన ప్రకాశం ఎంతో పెరిగిపోయింది. తన ఐశ్వర్యానికి కారణం విభూతి అని శివుడు ఎల్లప్పుడూ భావిస్తాడు. ప్రపంచ సారంఅంతా శివుడు భస్మంచేతనే వశం చేసుకున్నాడు. కాబట్టి ఇక శివుడిని వశం చేసుకునేవాడు ఇంకొకడు లేడు. 'వశి' అవటం వల్లనే ఆయన శివుడైనాడు. సింహం అన్ని మృగాలనీ హింసిస్తుంది. కానీ సింహాన్ని హింసించగల మృగం లేదు అందుకే దానికి సింహమని పేరువచ్చింది.

'శం' అంటే శాశ్వతానంది. ఇ అంటే పురుషుడు, వ అంటే శక్తి, అమృతం. ఇలా ఈ మూడూ శాశ్వతానందం, పురుషుడు, శక్తి, అమృతం కలిసి శివుడు అనే పేరుతో వ్యవరించబడుతోంది. కాబట్టి భక్తుడు తన ఆత్మనే శివుడుగా భావించి అర్చించాలి. ముందుగా భస్మాన్ని దేహంమీద వుండే అవయవాల మీద క్రమంగా ధరించి, ఆ తరువాత లలాటం మీద త్రిపుండ్రంగా ధరించాలి. పూజా సమయంలో విభూతిని తడిపి వాడాలి. వస్తువుల్ని శుద్ధి చేయటానికి కూడా విభూతిని వినియోగించాలి. పగలుగానీ, రాత్రిగానీ, స్త్రీలు, పురుషులు, తడిపిన విభూతిని మాత్రమే ధరించి పూజచేయాలి. అలా చేసినవారు మాత్రమే సంపూర్ణంగా శివపూజా ఫలాన్ని పొందగలరు. శివమంత్రాన్ని ఉచ్ఛరిస్తూ భస్మాన్ని ధరించే వ్యక్తిని అత్యాశ్రమి అంటారు. అలాంటి వ్యక్తి శివనిష్ఠా పరుడుగా వుంటాడు. కనుక శివాశ్రమీ కూడా అని పిలువబడతాడు. శివవ్రతాన్ని నిరాటంకంగా ఆచరించే భక్తుడికి మైల, పురుడు, వంటి దోషాలు అంటవు. లలాటం మీద భక్తుడు తెల్లని విభూదిని తిలకంగా ధరించాలి. అలాంటి తిలకాన్ని స్వయంగా పెట్టుకోవచ్చు. లేదా గురువుచేత పెట్టించుకోవచ్చు. ఇలా తిలకాన్ని ధరించటం శివభక్తుడి లక్షణం.

# గురుమహిమ

గురుశబ్దానికి గుణాన్రుంధే(గుణాలని తొలగించును) అని విగ్రహవాక్యము త్రిగుణాతీతుడైన పరమేశ్వరుడు గురు రూపాన్ని ఆశ్రయించి వికారంతో వుండే రాజసాది గుణాలని తొలగించివేస్తాడు. గురువు తనమీద శ్రద్ధా భక్తులు కలిగిన శిష్యుడిని చేరదీసి ముందుగా అతడి త్రిగుణాలనీ నిర్మూలించి, ఆ తరువాత శివుడి గురించి, శివతత్త్వాన్ని గురించి బోధిస్తాడు. అందువల్లనే ఆయనకి గురువు అనే పేరు కలిగింది. కాబట్టి గురువు శరీరమే గురు లింగం అని అందరూ గ్రహించాలి. గురువుకి శుశ్రూష చేస్తే గురులింగాన్ని పూజించినట్లే అవుతుంది. అందుకే శిష్యుడు శరీరంతో మనస్సుతో వాక్కుతో గురుసేవ చేయాలి. పవిత్రమైన మనస్సుతో వుండే శిష్యుడు గురువు యొక్క ఆజ్ఞని తను చేయగలిగినా, చేయలేక పోయినా ప్రాణాల్ని పణం పెట్టయినా, ధనాన్ని వెచ్చించి అయినా తీరుస్తాడు. శాసించదగినవాడు కనుకనే శిష్యుడు అనే పేరు కలిగింది యోగ్యుడైన శిష్యుడు తనకు లభించిన అన్ని పదార్థాలనీ గురువుకి సమర్పిస్తాడు. ఆహారాన్ని గురువుకి ముందుగా నివేదించి ఆయన అనుజ్ఞతో తిరిగి తాను భుజిస్తాడు. గురువుకి శిష్యుడు పుత్రుడవుతాడు.

జిహ్వాలింగాన్మంత్రం శుక్రంకర్ణయోనౌ నిషిచ్యవై ।
జాతఃపుత్రో మంత్ర పుత్రః పితరం పూజయేద్గురుమ్ ॥
(శి.పు.అధ్యా-18,శ్లో॥92)

జిహ్వా అనే లింగం నుంచి మంత్రం అనే వీర్యాన్ని కర్ణం (చెవి) అనే యోనిలో వదలటం వలన మంత్ర పుత్రుడైన శిష్యుడు జన్మించాడు. కాబట్టి శిష్యుడు గురువుని కన్న తండ్రిలాగా భావించి పూజించాలి. కన్న తండ్రి పుత్రుణ్ణి సంసారంలోకి నెడతాడు. కానీ గురువు శిష్యుడిని సంసారం నుంచి తరింపచేస్తాడు. ఇలా వీరిద్దరికీ మధ్య వున్న భేదాన్ని గుర్తించి శిష్యుడు గురువును తండ్రికన్నా మిన్నగా భావించి పూజించాలి.

గురువు యొక్క శరీరానికి సేవలు చేయాలి. తన స్వార్జిత ధనాన్ని గురువు కోసం వినియోగించాలి. పాదాల నుంచి కేశాల దాకా గురువుగారి శరీరం అంతా శివస్వరూపమే కనుక గురువుని ధనంతో, పాద సంవాహనం (కాళ్ళు వత్తటం) స్నానం, నైవేద్యం వంటి సేవలతో శ్రద్ధగా పూజించాలి. గురువుని పూజిస్తే సాక్షాత్తు శివుణ్ణి పూజించినట్లే అవుతుంది. గురుశేషం శిష్యుడికి అంతఃకరణ శుద్ధిని కలిగిస్తుంది. గురువు తినగా వదిలివేసిన నీరు, అన్నం, ఇతర ఆహార పదార్థాలు శివుడి ఉచ్ఛిష్టం (ఎంగిలి) తో సమానం కనుక శివభక్తులైన శిష్యులు, గురుశేషాన్ని భక్తిగా స్వీకరించాలి.

గురువు అనుజ్ఞలేకుండా దేన్ని స్వీకరించినా అది దొంగతనమవుతుంది. గురువుకంటే ఎక్కువ జ్ఞానం కలిగినవాడు కనిపిస్తే, ఆయన్ని కూడా తనకు గురువుగా చేసుకోవాలి. అజ్ఞానం పోగొట్టుకోవటమే శిష్యుడి జీవిత లక్ష్యం. గొప్ప జ్ఞానం కలిగినవాడు మాత్రమే అజ్ఞానాన్ని పోగొట్టగలడు. మన కర్మలు నిర్విఘ్నంగా. కుంభంలో కొబ్బరికాయని ఉంచి, విష్ణుమూర్తిని ఆవాహన చేసి పూజించాలి. తూర్పున ఇంద్రుడిని ఇతర దిక్కులలో ఆయాదిక్పాలకుల్ని పూజించాలి. ఆయాదేవతల పేర్లను బట్టి చతుర్ధీ విభక్తికి 'నమః' (దేవతాయై నమః) చేర్చి పూజించాలి. ఆవాహన నుంచి మొదలయ్యే పూజ అంతా ఆచార్యుడి ద్వారా  చేయించాలి.

**హోమం :** యజమాని ఆచార్యుడితో, ఋత్విక్కులతో కలిసి దేవతల మంత్రాల్ని వందసార్లు జపించాలి. అలా జపం చేసిన తరువాత మహాకుంబానికి పశ్చిమ భాగంలో హోమం చేయాలి. మహర్షులారా! ఆహోమాన్ని శక్త్యానుసారం ఒక కోటిసార్లు గానీ, లక్షసార్లు గానీ, వేయిసార్లు గానీ, కనీసం 108 పర్యాయాలు గానీ చేయాలి. ఒకటి, తొమ్మిది, లేక నలభైరోజులపాటు, దేశకాలానుగుణంగా హోమాన్నిఆచరించాలి. శాంతిని కోరుకునేవారు జమ్మి సమిధలతో, ధనధాన్యాలు కావలసినవారు మోదుగ సమిధలతో హోమం చేయాలి.

సమిధలని, అన్నాన్ని నేయిని దేవతా నామంతోగానీ, మంత్రంతో గానీ, హోమం చేయాలి. హోమం ఆరంభంలో ఉపయోగించే ద్రవ్యాలనే చివరి వరకూ వినియోగించాలి. చివరిరోజు పుణ్యాహవాచనం చేసి ఆ ద్రవ్యాన్ని యాగశాల అంతటా చల్లాలి. చివరగా హోమం ఎన్ని సార్లు చేసారో అంతమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. ఆచార్యుడు, ఋత్విక్కులు, హవిస్సుని భుజించాలి. ఆదిత్యాది నవగ్రహ హోమాన్ని కూడా చేయాలి. హోమం పూర్తయిన తరువాత ఋత్విక్కులకి వరుసగా నవరత్నాలని ఇవ్వాలి. ఆ తరువాత దశదానాలని చేసి, ఆపై శక్త్యానుసారం వివిధ దానాలు చేయాలి. ఉపనయనం అయిన పిల్లలకి, గృహస్థులకి, వానప్రస్థులకి, కన్యలకి, ముత్తయిదువులకి, విధవాస్త్రీలకు ధనాన్ని ఇవ్వాలి. చివరికి మిగిలిన యజ్ఞసామాగ్రి అంతా ఆచార్యుడికి ఇవ్వాలి.

జ్వరాన్ని భయాన్ని, ఉత్పాతాల్ని, దుఃఖాన్నికలిగించేవాడు యముడు అని అంటారు. కాబట్టి ఆయన ప్రీతికోసం కాలదానాన్ని ఇవ్వాలి. కాలదానం అంటే వందలేక, పది పలాల బంగారంతో పాశాన్ని, అంకుశాన్ని ధరించిన కాలపురుషుడి ప్రతిమని తయారు చేయించాలి. ఆ ప్రతిమని దక్షిణతో సహా దానం చెయ్యాలి. ఆ తరువాత పూర్ణాయుర్దాయం కలగటానికి తిలల్ని (నువ్వుల్ని) దానం చేయాలి. వ్యాధులు పోగొట్టుకోవటానికి నేతిలో ముఖాన్ని చూసి దానిని విప్రుడికి దానం చెయ్యాలి. వేయి, లేదా వంద మంది బ్రాహ్మణులకు అన్నదానం చెయ్యాలి. అంతధనం లేనివారు యథాశక్తి దాన ధర్మాలు చేయవచ్చు. భూత బాధలు నశించటానికి భైరవుడిని పూజించాలి. ఆ తరువాత శివుడికి మహాభిషేకం చేసి, మహానైవేద్యం సమర్పించాలి. ఈవిధంగా యజ్ఞం చేయటం వల్ల దోషాలన్నీ శాంతిస్తాయి. ఇటువంటి శాంతి యజ్ఞాన్ని ప్రతి సంవత్సరం ఫాల్గుణ మాసంలో చేయాలి. భయంకరమైన ఉత్పాతాలు (కరువు కాటకాలు వంటివి) సంభవిస్తే వెంటనే చేయాలి. మహాపాపాలు సంప్రాప్తమైతే భైరవుడిని పూజించాలి. ధనంలేని వాడు కనీసం దీపదానం చేయాలి. అది కూడా చేయలేనివాడు శుచిగా స్నానం చేసి తనకు శక్తి కలిగినదేదైనా దానం చేయాలి.

**నమస్కారం :** విద్వాంసుడైనవాడు నిత్యం సూర్యమంత్రాన్ని జపిస్తూ నూట ఎనిమిది సూర్య నమస్కారాలు చేయాలి. శక్తిని అనుసరించి వంద, వేయి, లక్ష లేక కోటి నమస్కారాలు చేయింయాలి

'నమస్కారాత్మయజ్ఞన తుష్టాస్స్యుస్సర్వదేవాతః"॥

నమస్కారమనే ఆత్మయజ్ఞం చేత దేవతలందరు సంతోషిస్తారు. "స్వామీ! నా బుద్ధి నీ స్వరూపానికి అర్పించబడింది. నీవు లేని చోట నా బుద్ధి రమించదు. అహంకారం మమకారం అనేవి నిన్ను చూడగానే తొలగిపోతాయి. నేను నీకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను. ఓ దేవా! నీ మహిమ ఎంతో గొప్పది నా స్వరూపం శూన్యంకాదు. నేను నీకు దాసుడను" ఇలా యధోచితంగా నమస్కారం అనే ఆత్మయజ్ఞాన్ని భక్తుడు ఆచరించాలి. ఈ నమస్కార యజ్ఞాన్ని నిర్వహించిన తరువాత శివుడికి నైవేద్యం ఇచ్చి, తాంబూలాలు సమర్పించాలి. తాను నూట ఎనిమిది సార్లు ప్రదక్షిణ చేయాలి. వేయి, పదివేలు, లక్ష ఇలా శక్త్యానుసారం ఇతరుల చేత ప్రదక్షిణ చేయించాలి.

**ప్రదక్షిణ :** "శివ ప్రదక్షిణాత్సర్వం పాతకం నశ్యతి క్షణాత్" శివ ప్రదక్షిణ చేసిన వారి పాపాలన్నీ క్షణంలో నశిస్తాయి. మనుషుల దుఃఖానికి మూలం వ్యాధి. వ్యాధికి మూలం పాపం. పాపాలు ధర్మంతోనే తొలగిపోతాయి. కాబట్టి శివుడిని ఉద్దేశించి చేసిన ధర్మం పాపాల్ని ఎంతో సులభంగా పోగొడుతుంది.

శివధర్మాలలో ప్రదక్షిణ సర్వోత్కృష్టమైనది. జపం క్రియ అయితే, ప్రదక్షిణ ప్రణవం అవుతుంది. జననం మరణం అనే ద్వంద్వాలకి మాయ అనిపేరు. శివుడి మాయా చక్రాన్ని బలిపీఠం అంటారు. బలిపీఠం వద్ద మొదలుపెట్టి ఎడమనుంచి కుడివైపుకి నడిచి బలిపీఠం దగ్గరకి రావాలి. వచ్చి లింగానికి నమస్కారం చేయాలి. అది ఒక ప్రదక్షిణ అవుతుంది. శివుడి మాట నుంచి బయటకు రావటంతో జీవుడికి జన్మ కలిగింది. నమస్కారం చేసి శివుడికి ఆత్మ సమర్పణ చేస్తే జనన మరణమనే ద్వంద్వం నుంచి విముక్తి కలుగుతుంది.

జననమరణాలనే ద్వంద్వాలని శివుడికి జీవుడు సమర్పిస్తే అది తిరిగి జీవుడిని బాధించదు.జీవుడి దేహం కర్మాధీనంగా ఉన్నంతవరకూ ఆ జీవుడు బద్ధుడనబడతాడు. మాయా చక్రాన్ని త్రిప్పే శివుడే జగత్తుకి పరమకారణం. శివుడిచే కల్పించబడిన ద్వంద్వాన్ని శివుడికే సమర్పించాలి. కాబట్టి ప్రదక్షిణ, నమస్కారాలు అనేవి శివుడికి ఎంతో ప్రీతిపాత్రమైనవని గ్రహించి. పరమేశ్వరుడికి నమస్కారం చేసి ప్రదక్షిణలు చేస్తే షోడశోపచార పూజ చేసిన ఫలితం లభిస్తుంది.

శివస్యాతిప్రియం విద్యాత్ప్రదక్షిణం నమో బుధాః ।
ప్రదక్షిణ నమస్కారాః శివస్య పరమాత్మనః ॥

షోడశైరుపచార్యైశ్చ కృతపూజా ఫలప్రదా ।
ప్రదక్షిణా అవినాశ్యం హి పాతకం నాస్తి భూతలే ॥

(శ్లో॥148-149)

ప్రదక్షిణ నశింపచేయలేని పాపం ఈ భూలోకంలో లేదు. కాబట్టి ప్రదక్షిణ చేసి పాపాలన్నీ పోగొట్టుకోవాలి.

శివపూజలో శ్రద్ధ కలిగిన భక్తుడు నిత్యం మౌనాన్ని పాటిస్తూ, సత్యం, ధర్మం వంటి గుణాలు కలిగి, శివకర్మ, శివుడి గురించి తపస్సు, జపం, ధ్యానం, అనేవి క్రమ క్రమంగా ఆచరించాలి. ఈ అయిదిటినీ ఆచరించటం వల్ల ఐశ్వర్యం, దివ్యజ్ఞానం, దివ్యదేహం, అజ్ఞాననివృత్తి శివసన్నిధి అనే ఫలాలు సాధకుడికి క్రమంగా లభ్యమవుతాయి. శివపూజద్వారా అజ్ఞానాన్ని తొలగించుకోవటం వలన, జన్మరాహిత్యం, జ్ఞానోదయం వంటి ఫలాలు లభిస్తాయి. శివభక్తుడు శివక్షేత్రంలో న్యాయంగా సంపాదించిన ధనంతోనే జీవించాలి. జీవహింస చేయకుండా వుండాలి.

పంచాక్షరీ మంత్రంతో ప్రోక్షించిన (చల్లిన) నీళ్ళు అన్నం సుఖాన్ని కలిగిస్తాయి. ఒకవేళ శివభక్తుడు దరిద్రుడయితే భిక్షాన్నంతో జీవించాలి. అలా చేయటం వల్ల జ్ఞానాన్ని పొందుతాడు. శివభక్తుడికి భిక్షవల్ల లభించిన అన్నం శివభక్తిని పెంపొందింప చేస్తుంది. ఇలా శివయోగి భుజించే భిక్షాన్నాన్ని 'శంభుసత్రం' అంటారు.

ఈవిధంగా శివభక్తుడు ఏదో ఒక ప్రాంతంలో నివసిస్తూ, భూమిమీద పడుకోవటం, పరిశుద్ధమైన అన్నాన్ని భుజించటం, సదా మౌనంగా ఉండటం, వంటి నియమాలు పాటించాలి. తన యొక్క సాధనా పద్ధతుల్ని ఇతరులకి చెప్పకూడదు. ఇతర భక్తులకు శివుడి మహిమల్ని గురించి వివరించాలి. శివమంత్రం రహస్యాన్ని శివుడు తప్ప మరొక్కరు తెలుసుకోలేరు. శివభక్తుడైన వాడు ఎల్లప్పుడూ శివలింగాన్ని ఆశ్రయించే వుండాలి. ప్రతిష్ఠచేయబడిన లింగాన్ని ఆశ్రయించి జీవించే వ్యక్తి మాత్రమే శివసాయుజ్యాన్ని పొందుతాడు. చరలింగాన్ని పూజించే భక్తుడు క్రమంగా ముక్తిని పొందుతాడు.

## పార్థివలింగ మాహాత్మ్యం

శివుడి అన్ని లింగాలలోకీ పార్థివ లింగం సర్వ శ్రేష్ఠమైనది. ఆ లింగాన్ని పూజించి అభిషేకించినవారు ఎందరో పరమ సిద్ధిని పొందారు. విష్ణువు, బ్రహ్మదేవుడు, ఇంకా ఋషులు, మునులు, ప్రజాపతులు పార్థివలింగాన్ని అర్చించి కోరిన కోరికలు పొందారు. అలాగే దేవతలు, రాక్షసులు, మనుష్యులు, సిద్ధులు, గంధర్వులు నాగజాతివారు ఇంకా ఎంతోమంది పార్థివ లింగపూజ చేసి తరించారు.

కృతే రత్నమయం లింగం త్రేతాయాం హేమ సంభవమ్ ।
ద్వాపరే పారదం శ్రేష్ఠం పార్థివంతు కలౌయుగే ॥

కృతయుగంలో రత్నాలతో చేసిన శివలింగం, త్రేతాయుగంలో బంగారంతో చేసిన శివలింగం, ద్వాపర యుగంలో పాదరసంతో చేసిన శివలింగ శ్రేష్ఠమైతే కలియుగంలో పార్థివ శివలింగ పూజ సర్వశ్రేష్ఠమని చెబుతారు. పంచభూతాలు (పృధివి, నీరు, నిప్పు, ఆకాశం,వాయువు) సూర్య చంద్రులు, సోమయాజి అనే శివుడి అష్టవిధమూర్తులలో పార్థివమూర్తి శ్రేష్ఠమైనదిగా చెప్పబడినందువలన, ఇతరమైన లింగాల పూజకంటే పార్థివలింగ పూజే గొప్పదని దేవతలందరిలోకీ పరమేశ్వరుడు గొప్పవాడు. అలాగే నదులన్నిటిలోకీ గంగానది గొప్పది అదేవిధంగా లింగాలన్నిటిలోకీ పార్థివలింగం శ్రేష్ఠమైనది.

ఓంకారం మంత్రాలన్నిటిలోకీ గొప్పది అని స్మృతులు చెబుతున్నాయి. అలాగే వర్ణాలన్నిటిలోకీ బ్రాహ్మణ వర్ణము నగరాలన్నిటిలోకీ కాశీనగరము, వ్రతాలన్నిటిలోకీ కాశీవ్రతము, దేవీమూర్తులన్నిటిలోకీ శైవీశక్తి ఏవిధంగా గొప్పవని చెప్పబడ్డాయో, అదేవిధంగా లింగాలన్నిటిలోకీ పార్థివలింగ సర్వశ్రేష్ఠమైనది. అంత గొప్పదైన పార్థివ లింగాన్ని కాకుండా మరొక లింగాన్ని పూజించటం వృధా. పార్థివలింగాన్ని ఆరాధించే భక్తుడు శివుడి అనుగ్రహంతో దీర్ఘాయుష్షుని, తుష్టిని, పుష్టిని, సంపదల్ని పొందుతాడు. అతని జీవితం ధన్యమవుతుంది. భక్తుడు తనకు లభించిన పూజా ద్రవ్యాలతోనే పార్థివ లింగపూజ చేయవచ్చు. సశాస్త్రీయంగా, భక్తి శ్రద్ధలతో వివిధ పూజాద్రవ్యాలతో పార్థివలింగ పూజచేసే భక్తుడు జీవితకాలంలో సుఖసంతోషాలతో కాలం గడిపి దేహం విడిచాక శివుడిలో ఐక్యమైపోతాడు.

పరమ పవిత్రమైన పార్థివలింగాన్ని ప్రతిరోజూ మూడు సంధ్యాకాలాలలో, మారేడు పత్రాలతో పదకొండు సంవత్సరాలు పూజించిన భక్తుడికి ఎటువంటి సత్ఫలితం లభిస్తుందంటే! ఇలా పార్థివలింగార్చన చేసిన భక్తుడు సశరీరంగానే రుద్రలోకంలోకి చేరతాడు. అటువంటి భక్తుడిని చూసిన, తాకిన వారికందరికీ పాపాలు నశిస్తాయి. ఆవ్యక్తి జీవన్ముక్తుడు జ్ఞాని, శివస్వరూపుడుగా పిలువబడతాడు. అటువంటి వ్యక్తిని కేవలం చూడటంతోనే ఇహము పరము రెండూ గొప్పగా వుంటాయి. అతడు సాక్షాత్తు శివుడి సాన్నిధ్యాన్ని పొందుతాడు. ఆయన సన్నిధిలో ఎంతోకాలం వుంటాడు. ఒకవేళ ఆ వ్యక్తి తిరిగి జన్మించాలి అని భావిస్తే, తిరిగి భూలోకంలో జన్మనెత్తి దేశానికి సార్వభౌముడవుతాడు. బ్రాహ్మణ వర్ణంలో జన్మించినవాడు పార్థివలింగాన్ని పూజించకపోతే భయంకరమైన నరకంలో పడి అక్కడ శూలాలకి కట్టబడి, దారుణమైన బాధలుపొందుతాడు. కాబట్టి వారు ఎలాగైనా శ్రమపడి పార్థివలింగాన్ని అర్చించాలి.

పార్థివలింగాన్ని అఖండంగా తయారు చేయాలి. అంటే రెండు భాగాలు చేసి అతికించరాదు. అలా రెండు భాగాలుగా చేస్తే పూజాఫలం లభించదు. రత్నాలు, బంగారం, పాదరసం, స్ఫటికం, మట్టి వంటి వాటితో చేసే లింగాలు అఖండంగా వుండాలి. లింగాలలో చరలింగాలు అఖండంగా, స్థిరలింగాలు అనగా ప్రతిష్ఠిత లింగాలు ద్విఖండంగా వుండాలని స్మృతులు చెబుతాయి. ఈ విషయాన్నే శైవసిద్ధాంత పండితులు కూడా చెబుతున్నారు. ఈ సిద్ధాంతాన్ని తెలియని వాళ్ళు, శాస్త్ర పాండిత్యంలేని అజ్ఞానులు చరలింగాన్ని ద్విఖండంగా చేస్తారు. అలాంటి మూర్ఖులకి పూజాఫలం ఏమాత్రం లభించదు. కనుక ప్రతిఒక్కరూ శాస్త్రవిధిని అనుసరించి లింగాన్ని నిర్మించాలి. ఇలా నిర్మించిన లింగాన్ని భక్తి శ్రద్ధలతో పూజిస్తే వాంఛితార్థ సిద్ధి పొందుతారు. అలా కాకుండా అఖండంగా వున్న స్థావర లింగాన్ని పూజిస్తే కోరికలు ఫలించకపోగా భక్తులకు దుష్ఫలితాలు కలుగుతాయి కాబట్టి ఈ విషయాన్ని బాగా గమనించి పూజని ఆచరించాలి.

## పార్థివ శివలింగ పూజా విధానం

వైదిక మార్గంలో చేసే పార్థివ శివలింగ పూజ ఇహపరాల్ని ఇస్తుంది. గృహ్య సూత్రంలో చెప్పిన విధంగా భక్తుడు స్నాన సంధ్యాదులు ఆచరించి, ఆ తరువాత బ్రహ్మ యజ్ఞాన్ని తర్పణాలని చేయాలి. ఇలా నిత్యకర్మలన్నిటినీ ఆచరించిన తరువాత పరమేశ్వరుడిని స్మరిస్తూ భస్మాన్ని, రుద్రాక్షలని ధరించాలి. అప్పుడు సంపూర్ణ శివానుగ్రహం పొందటానికి అనన్యమైన భక్తితో పార్థివ లింగాన్ని పూజించాలి. పవిత్రమైన నదీ తీరంలోగానీ, చెరువు గట్టుమీదకానీ, పర్వత ప్రదేశం, లేదా అరణ్యం లోగానీ శివాలయం లేదా ఏదైనా పవిత్రప్రదేశంలో గానీ, పార్థివలింగాన్ని స్థాపించి పూజించాలి.

పవిత్రమైన ప్రాంతంలో వుండే మట్టిని శ్రద్ధగా తీసుకువచ్చి పార్థివలింగాన్ని నిర్మించాలి. బ్రాహ్మణుడు తెల్లని మట్టిని, క్షత్రియుడు ఎర్రని మట్టిని, వైశ్యుడు పచ్చని మట్టిని, శూద్రుడు నల్లని మట్టిని పార్థివలింగ

నిర్మాణంలో వినియోగించాలి. ఇలా నాలుగు రకాల మట్టి లభించకపోతే దొరికిన మట్టితో శివలింగాన్ని నిర్మించాలి. ఇలా శివలింగం కోసం తెచ్చిన మట్టిని మంచి ప్రదేశంలో ఉంచాలి. ఆ తరువాత శుద్ధ జలంతో ఆమట్టిని తడిపి మెల్లగా ఉండలుగా చేసి పార్థివలింగాన్ని నిర్మించాలి. అలా నిర్మించిన లింగాన్ని వేదోక్త విధానంగా పూజిస్తే శివానుగ్రహంతో కోరిన కోరికలన్ని తీరుతాయి.

పార్దివ శివ లింగ పూజ చేసే వైదిక పద్ధతి ఇలా ఉంటుంది. శివ పంచాక్షరీ (నమశ్శివాయ) మంత్రంతో పూజాద్రవ్యాలని సంప్రోక్షించాలి. ఆ తరువాత 'భూరసి' అనే మంత్రంతో పూజాస్థలాన్ని శుద్ధిచేసి సిద్ధం చేయాలి. 'అపోస్మాన్' అనే మంత్రంతో నీటిని, సంస్కరించి 'నమస్తేరుద్ర' అనే మంత్రంతో క్షేత్రాన్ని పవిత్రం చేసి పంచామృతాలతో ప్రోక్షణ చేయాలి. ఇలా చేసిన తరువాత భక్తి శ్రద్ధలతో 'నమోనీలగ్రీవాయచ' అనే మంత్రాన్ని ఉచ్చరిస్తూ శివలింగాన్ని స్థాపించాలి. ఆ తరువాత అలా స్థాపించిన లింగాన్ని సాక్షాత్తు శివుడిగా భావిస్తూ 'ఏతేరుద్రాయు' అనే మంత్రంతో శివుడికి ఆసనాన్ని సమర్పించి 'మానోమహాంతమ్' అనే మంత్రంతో ఆయన్ని ఆహ్వానించి, 'యాతేరుద్ర' అనే మంత్రం చెప్పి ఆసనం మీద శివుడిని కూర్చోబెట్టాలి. ఇలా చేసి, ఆ తరువాత 'యామిఘం' అనే మంత్రాన్ని ఉచ్చరిస్తూ శివుడికి న్యాసం చేయాలి.

'అధ్యవోచత్' అనే మంత్రంతో అధివాసాన్ని చేయించాలి. తిరిగి 'మనునాసాయ' అనే మంత్రంతో దేవతాన్యాసాన్ని చేసి 'అసౌయోవసర్పతి' అనేమంత్రం చెప్పి శివుడి దగ్గరకి వెళ్ళాలి. నమోస్తు నీలగ్రీవాయ మంత్రంతో పాద్యాన్ని '.తత్పురుషాయ విద్మహే" అనే రుద్ర గాయత్రీ మంత్రంతో అర్ఘ్యాన్ని, 'త్ర్యంబకం యజామహే" మంత్రంతో ఆచమనాన్ని సమర్పించాలి. ఆ తరువాత 'పయపృథివ్యాం' మంత్రంతో పాలాభిషేకాన్ని, 'దధిక్రావర్ణో' మంత్రంతో పెరుగు అభిషేకాన్ని 'ఘృతం' ఘృతపావా! మంత్రంతో నేయితో అభిషేకాన్ని మదువాతా 'మధునక్తం' 'మధుమాన్నః' అనే మూడు మంత్రాలతో తేనె, చక్కెర, నీరు

ఉపయోగించి అభిషేకం చేయాలి. ఇలా చేసే అభిషేకాన్ని పంచామృతాభిషేకం అంటారు. ఇలా చేయలేకపోతే 'పాద్యం' కి చెప్పిన మంత్రంతో కూడా పంచామృత స్నానాన్ని మసర్పించవచ్చు.

ఇలా పంచామృతాభిషేకం చేసిన తరువాత 'మానస్తోకే' అనే మంత్రంతో శివుడికి కటి బంధాన్ని 'నమోధృష్టవే' అనే మంత్రంతో ఉత్తరీయాన్ని సమర్పించాలి. ఆ తరువాత 'యాతేహేతిః' అనే నాలుగు మంత్రాలు ఉచ్ఛరిస్తూ భక్తి పూర్వకంగా శివుడికి వివిధ వస్త్రాలని ఇవ్వాలి. ఈవిధంగా వస్త్రాలు సమర్పించిన తరువాత భక్తుడు పవిత్రమైన మనస్సుతో 'నమఃశ్వభ్యః' అనే మంత్రంతో గంధాన్ని, 'నమఃస్తక్షభ్యః' అనే మంత్రంతో అక్షతలని, 'నమఃపార్యాయ' మంత్రంతో పుష్పాలని, 'నమఃపర్ణ్యాయ' అనే మంత్రంతో మారేడు ఆకుల్ని సమర్పించాలి. ఇలా భక్తిగా అర్పించిన తరువాత 'నమఃకపర్దినేచ' అనే మంత్రంతో యథావిధిగా ధూపాన్ని 'నమఃఆశవే' మంత్రం చెప్పి దీపాన్ని ఇవ్వాలి. ఇలా ఇచ్చిన తరువాత, నమోజ్యేష్ఠాయ మంత్రాన్ని చెబుతూ నైవేద్యాన్ని, త్ర్యంబకం' మంత్రంతో పునరాచమనాన్ని అర్పించాలని స్మృతులు చెబుతున్నాయి. ఇలా నైవేద్య పునరాచమనాల తరువాత 'ఇమాగ్ంరుద్రాయ' అనే మంత్రంతో సర్వాన్నీ శివుడికి సమర్పించాలి. ఇలా చేసిన తరువాత 'మానోమహాంతరమ్' 'మానస్తోకే' అనే రెండు మంత్రాలు చెబుతూ  ఏకాదశ రుద్రులని అక్షతలతో పూజించాలి. పూజ తరువాత 'హిరణ్యగర్భః' అనే మూడు మంత్రాలతో దక్షిణ సమర్పించాలి విద్వాంసుడైన వాడు దీప మంత్రంతో శివుడికి నీరాజనాన్ని అందించి 'ఇమాగ్ంరుద్రాయ' మంత్రంతో దోసెడు పుష్పాలను ఆయనకి సమర్పించాలి.

జ్ఞాని అయిన శివభక్తుడు 'మానోమహాంతమ్' అనే మంత్రాన్ని చెబుతూ ప్రదక్షిణ చేసి, 'మానస్తోకే' అనే మంత్రం పఠిస్తూ సాష్టాంగ దండ ప్రణామాన్ని ఆచరించాలి. ఆ తదుపరి 'ఏతేరుద్ర' మంత్రంతో శివముద్రని 'యతోయతః' మంత్రంతో అభయముద్రని, "త్ర్యంబకం" మంత్రంతో మహాముద్రని,

'నమోగోభ్యః' అనేమంత్రంతో ధేనుముద్రని ఇలా పంచముద్రలని శివుడికి చూపించి, శివమంత్రాన్ని భక్తి శ్రద్ధలతో జపించాలి. వేదవేత్తలయిన వారు శతరుద్రీయాన్ని పఠించాలి. లేదా జపించాలి. ఇలా జపంచేసిన తరువాత పంచాంగాన్ని పఠించి, 'దేవాగాతు' అనే మంత్రంతో శివుడికి ఉద్వాసన పలకాలి.

'సద్యోజాతం' అనే మంత్రాన్ని చెబుతూ భక్తుడు మట్టిని తీసుకువచ్చి 'వామదేవాయ' అనే మంత్రంతో నీటిని ఆమట్టిపై చల్లాలి. ఆ తరువాత 'అఘోరేభ్యః' అనే మంత్రంతో శివలింగాన్ని నిర్మించి, 'తత్పురుషాయ' అనే మంత్రాన్ని చెబుతూ శివుడిని ఆహ్వానించాలి. ఈశానః అనే మంత్రంతో శివుడిని వేదిక మీద ప్రతిష్ఠించి, ఆ తరువాత పరిశుద్ధమైన మనసుతో భక్తి శ్రద్ధలతో యధాశక్తిగా శివుడిని పూజించాలి. భక్తుడు గురువుద్వారా ఉపదేశం పొందిన మంత్రంతో గానీ, పంచాక్షరీ మంత్రంతో గానీ శివుడికి షోడశోపచార పూజలు సమర్పించాలి. లేదా.....

భవాయ భవనాశాయ మహాదేవాయ ధీమహి ।
ఉగ్రాయ ఉగ్రనాశాయ శర్వాయ శశిమౌళినే ॥

సంసారాన్ని నశింపచేసే భవుడిని, ఉగ్రత్వాన్ని నాశనం చేసే ఉగ్రుడిని, చంద్రకళను శిరస్సుపై ధరించిన శర్వుడిని, మహాదేవుడిని భక్తితో ధ్యానిస్తున్నాను అనే శ్లోకాన్ని పఠించి శంకరుడిని భక్తిగా అర్చించాలి. శివుడు భక్తసులభుడు, భక్తితో మాత్రమే ఆయన అనుగ్రహాన్ని పొందగలం. శివుడి పార్థివలింగాన్ని శివుడి దివ్యనామాలతో కూడా పూజించే ఒక పద్ధతి ఉన్నది. కోరిన కోరికలు తీర్చే ఆ పూజా విధానం ఈవిధంగా ఉంటుంది.

ఓం హరాయ నమః, మంత్రం చెప్పి మట్టిని తీసుకురావాలి. మహేశ్వరాయ నమః మంత్రం చెప్పి శివలింగాన్ని తయారుచేయాలి. శంభవేనమః మంత్రంతో శివుడిని ప్రతిష్ఠించాలి. ఓం శూలపాణయే నమః అనే మంత్రం చెప్పి శివుడికి ఆహ్వానం పలకాలి. ఓం పినాకధృతే నమః అనేమంత్రం చెప్పి స్నానం సమర్పించాలి. ఓం శివాయ నమః మంత్రంతో

పూజను చేయాలి. ఓం పశుపతయే నమః అనే మంత్రం చెప్పి క్షమాపణ వేడాలి. ఓం మహాదేవాయ నమః అనే మంత్రం చెప్పి శివుడికి ఉద్వాసన పలకాలి.

ఈ విధులన్నీ ఆనందంగా భక్తి శ్రద్ధలతో ఆచరించాలి. ఆ తరువాత షడక్షర మంత్రంతో (ఓం నమఃశివాయ)యదావిధిగా

'ఓం' అంగుష్ఠాభ్యా నమః, 'న' తర్జనీభ్యాం నమః 'మః' మధ్యమాభ్యాం నమః, 'శి'అనామికాభ్యాం నమః, 'వా' కనిష్ఠికాభ్యాం నమః 'య' కరతల కరపృష్టాభ్యాం నమః అని కరన్యాసాన్ని 'ఓం' హృదయాయ నమః, 'న' శిరసేస్వాహా, 'మః' శిఖాయై వషట్, 'శి' కవచాయ హుం, 'వా' నేత్రత్రయాయ వౌషట్, 'య' అస్త్రాయ ఫట్ అని హృదయ న్యాసాన్ని చేయాలి.

ఆ తరువాత ఇలా ధ్యానాన్ని చేయాలి.

కైలాస పీఠాసన మధ్యసంశ్థం భక్తైస్సనందాదిభిరర్చ్యమానమ్ ।
భక్తార్తి దావానల మప్రమేయం ధ్యాయేదుపలింగిత విశ్వ భూషమ్ ॥
ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం చారుచంద్రావతంసమ్ ।
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశుమృగ వరాభీతిహస్తం ప్రసన్నమ్ ॥
పద్మాసీనం సమంతాత్ స్థితమమరగణైః వ్యాఘ్రకృత్తిం వసానం ।
విశ్వాద్యం విశ్వబీజం నిఖిలభయహరం పంచవక్త్రం త్రినేత్రమ్॥

కైలాస పర్వతం మీద సింహాసనం అధిష్టించినవాడు సనక సనందనాది భక్తులచేత అర్చించబడేవాడు, దావాగ్నిలాంటి భక్తుల దుఃఖాల్ని పోగొట్టేవాడు, ఉమాదేవితో కలిసి ఈ విశ్వానికి ఒక దివ్యభూషణంగా ప్రకాశించే వాడు అయిన పరమేశ్వరుడిని ధ్యానించాలి.

వెండికొండలాగా తెల్లగా వెలుగొందేవాడు, అందమైన చంద్రుడిని శిరస్సుమీద అలంకారంగా ధరించినవాడు, దివ్యరత్నాభరణాలతో ప్రకాశించే శరీరంగలవాడు, పరశువుని, లేడిని, వర, అభయముద్రలని చేతులతో

ధరించినవాడు, ప్రసన్నవదనంతో, పద్మాసనాసీనుడైవున్నవాడు, వ్యాఘ్రచర్మాన్ని ధరించినవాడు, ఈ బ్రహ్మాండానికి ఆదిలోవున్న వాడు, ఈ బ్రహ్మాండానికి కారణమైనవాడు, అందరి భయాల్ని పోగొట్టేవాడు, ఐదుముఖాలతో, మూడు కళ్ళతో ప్రకాశించే సర్వేశ్వరుడిని ప్రతిరోజూ ధ్యానించాలి.

ఈ విధంగా పరమోన్నతమైన పార్థివలింగాన్ని పూజించి, శివుడి గణగణాలను భక్తిగా ధ్యానించి, గురువు ద్వారా ఉపదేశం పొందిన పంచాక్షరీ మంత్రాన్ని భక్తుడు శ్రద్ధగా జపించాలి. ఆ తరువాత వివిధ రకాల స్తోత్రాలతో స్వామిని స్తుతించి నమస్కరించాలి. చివరగా అక్షతలు పూలు చేతిలోకి తీసుకుని "ఓ పరమేశ్వరా నేను నీవాడిని, నా జీవితం అంతా నీ అధీనం, నా మనస్సులో నీవే నిండిపోయివున్నావు, ఓ దయాసముద్రా! భూతనాథా! ఈ విషయాన్ని గ్రహించి నన్ను అనుగ్రహించు. ఓ శంకరా! తెలిసిగానీ, తెలియక గానీ నేను చేసిన పూజలు జపాలు నీదయతో ఫలించాలి. నేను చాలా పాపాలు చేసినవాడిని, నీవు పాపాలను తొలగించే పాపనాశనుడవు. ఓ గౌరీపతీ! ఓ మహాదేవా! నిన్ను వేదాలు, పురాణాలు వివిధ సిద్ధాంతాలూ, ఋషులూ, మునులూ, సిద్ధులూ, దేవతలూ, ఎవరూ తెలుసుకోలేకపోయారు.

ఓ స్వామీ నీవెక్కడ, నేనెక్కడ, ఓ సర్వేశా! నేను అన్నివిధాలా నీ అధీనంలో నీవాడిగా వున్నాను. నీవు నన్ను సదా అనుగ్రహించి రక్షించు" అని ఈవిధంగా ప్రార్థించి అక్షతలను పూలను శివుడి శిరస్సుమీద (శివలింగంపైన) ఉంచి తిరిగి యథావిధిగా సాష్టాంగ నమస్కారాన్ని ఆచరించాలి. ఆ తరువాత శివుడి చుట్టూ ప్రదక్షిణాలు చేసి, "హర హర మహాదేవ శంభో శంకరా! మహాదేవా ఓం నమశ్శివాయ" అని జయ జయ ధ్వానాలు బిగ్గరగా చేయాలి. ఇలా భక్తి పూర్వకంగా చేసిన తరువాత మంచి మనసుతో మనసులోని కోరికను సఫలం చేయమని శివుడిని ప్రార్థించి ఆయనకి ఉద్వాసన పలకాలి.

# పార్థివలింగాల పూజాఫలం

విద్యని కోరుకునే భక్తుడు ఒకవేయి పార్థివలింగాలని భక్తిగా పూజిస్తే అతడి కోరిక నెరవేరుతుంది. వస్త్రాలు, ధనం కావాలనుకునేవారు ఐదువందల లింగాలని, మంచి కుమారుడు కావాలనికోరుకునేవారు పదిహేనువందల లింగాలని, మోక్షాన్ని కోరుకునేవారు కోటిలింగాలని, భూమికావాలనుకునేవాడు వేయిలింగాలని, శివుడి అనుగ్రహం కావాలనుకునేవాడు మూడువేల లింగాలని తీర్థయాత్రలు సక్రమంగా చేయాలనుకొనే వ్యక్తి రెండువేల లింగాలని, మంచిమిత్రుడు లభించాలని కోరే భక్తుడు మూడువేల లింగాలని, జనవశీకరణ కోరుకునేవాడు ఎనిమిది వందల లింగాలని, శత్రునాశనం జరగాలనుకొనే వాడు, ఏడువందల లింగాలని, అందరినీ మోహింపచేయాలనుకొనేవాడు ఎనిమిది వందల లింగాలని భక్తిగా ఆరాధించాలి.

భూతప్రేతాలని తరిమికొట్టాలనుకునేవాడు వేయి లింగాలని, భూతాల్ని స్తంభింపచేయాలనుకునేవాడు వేయి లింగాలని, కారాగారం నుంచి విముక్తి పొందాలనుకునేవాడు పదిహేనువందల లింగాలని, మహారాజువల్ల ప్రభుత్వం వల్ల దండన భయం కలిగితే ఐదువందల లింగాలని, దొంగలు సంపద దోచుకుపోతే అవి తిరిగి లభించటానికి రెండవందల లింగాలని, సకల దారిద్ర్యాలూ వదలి పోవటానికి ఐదువేల లింగాలని, అన్ని రకాల కోరికలు తీరాలంటే పదివేల శివలింగాలని యథావిధిగా స్థాపించి భక్తితో షోడశోపచార పూజలు చేస్తే ఇష్టకామ్యసిద్ధి కలుగుతుంది.

భక్తుడు ఒక లింగాన్ని పూజిస్తే పాపాలన్నీ తొలగిపోతాయి. రెండు లింగాలని అర్చిస్తే కార్యసిద్ధి జరుగుతుంది. మూడు లింగాలని పూజిస్తే అన్ని కోరికలూ తీరుతాయి. ఈ సంఖ్య విషయంలో మరొక అభిప్రాయ భేదం ఉన్నది. అదేమిటంటే? భక్తుడు పదివేల లింగాలని పూజిస్తే రాజభయమే కాకుండా అన్నిరకాల భయాలూ తొలగిపోతాయి. చెరసాల నుంచి విడుదల కావాలనుకునేవాడు పదివేల లింగాలని పూజించాలి. శాకినీ డాకినీ వంటి

పిశాచాల వల్ల భయం కలిగితే అదిపోవటానికి ఏడువేల శివలింగాలు పూజించాలి. పుత్రసంతానం కావాలనుకునేవాడు ఏభైఅయిదువేల లింగాలను, పుత్రిక జన్మించాలంటే పదివేల లింగాలని పూజించాలి.

పదివేల లింగాలని అర్చించినవాడికి విష్ణువుతో సమానమైన ఐశ్వర్యం లభిస్తుంది. లక్ష శివలింగాలని అర్చించిన భక్తుడు అపారమైన సంపదలకి అధిపతి అవుతాడు. ఇక కోటి లింగాలని ఎవరైతే అర్చిస్తారో ఆవ్యక్తి సాక్షాత్తు శివస్వరూపుడుగా కీర్తించబడతాడు. పార్థివ లింగార్చన వల్ల కోటి యజ్ఞాలు చేసిన ఫలితం, సాధకుడికి లభిస్తుంది. అన్ని రకాల దానాలు, వ్రతాలు, యజ్ఞాలు, తీర్థాలు, నియమాలు ఒకవైపు, పార్థివలింగార్చనా విధానం మరొకవైపు అని స్మృతులు చెబుతాయి. ఈ కలియుగంలో లింగార్చనకన్నాశ్రేష్ఠమైనది వేరొకటి లేదని శాస్త్రాలు నిర్ణయించాయి. పంచాక్షరీ మంత్ర స్వరూపమైన లింగం అన్ని లింగాలలోకీ గొప్పది కాబట్టి, మహర్షులు, మునులూ నిత్యం దానిని ఉపాసించాలి.

శివలింగాలు వాటి మహిమలను అనుసరించి ఉత్తమం, మధ్యమం, అధమం అని మూడు రకాలుగా వుంటాయి. నాలుగు అంగుళాల ఎత్తుతో పీటాన్ని కలిగిన శివలింగం ఎంతో ఉత్తమమైనదని పండితులు చెప్తారు. దానిలో సగం అనగా రెండు అంగుళాల ఎత్తు వున్న పార్థివలింగం మధ్యమమని, నాలుగోవంతు అనగా ఒక అంగుళం కలిగిన లింగాన్ని అధమమని చెప్తారు. ఇలా ఉండే మూడు రకాల శివలింగాలు ఒకదానికన్నా మరొకటి అధికమైన మహిమ కలిగినవని చెప్పబడ్డాయి. నాలుగు వేదాలలో కూడా లింగారాధన గొప్పదని చెప్పబడింది.

జ్ఞాని అయినవాడు ఈ కర్మల సమూహాన్ని వదిలేసి పరిపూర్ణమైన భక్తితో లింగపూజచేయాలి. శివలింగాన్ని అర్చిస్తే ఈ జగత్తునంతా అర్చించిన ఫలం లభిస్తుంది. అజ్ఞానమనే చీకటిలో గుడ్డివాళ్ళై, ఇంద్రియ భోగాలపై మనసు చిక్కుకున్న వారికి, లింగార్చన ఒక్కటే దిక్కు. బ్రహ్మ విష్ణువు వంటి దేవతలు,

రాక్షసులు, మునులు, యక్షలు, గంధర్వులు, చారణులు, సిద్ధులు, ఆదిశేషుడు వంటి నాగజాతివారు, గరుత్మంతుడులాంటి పక్షిజాతివారు, వివిధ ప్రజాపతులు, మనువులు, నరులు, కిన్నరులు ఇలా అందరూ అన్ని కోరికలనూ తీర్చే పార్థివలింగాన్ని మహాభక్తిగా పూజించారు. కనుక స్త్రీలకు అన్ని వర్ణాలవారికీ లింగపూజచేసే అర్హతవుంది. అందరికీ ఆ అధికారం వుంది. అయితే బ్రాహ్మణులు మాత్రం శివలింగ పూజని వైదిక పద్ధతిలో చేయటమే మంచిది. ఇతర వర్ణాలవారు వైదిక పద్ధతిని విడిచి నేను చెప్పిన నామ పూజావిధాన పద్ధతిలో చేస్తే మంచిది.

భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం, సూర్యుడు, చంద్రుడు సోమయాజి అనేవి శివుడి అష్టమూర్తులు కాగా వీటితో పాటూ శర్వుడు, భవుడు, రుద్రుడు, ఉగ్రుడు, భీముడు, ఈశ్వరుడు, పశుపతి, మహాదేవుడు అనే శివుడి దివ్యనామాలను కూడా అష్టమూర్తులతో పాటు చేసి అర్చించాలి. ఆ తరువాత శివపరివారాన్ని కూడా భక్తి శ్రద్ధలతో పూజించాలి. శివపరివారం ఎవరంటే? ఈశానుడు, నంది, చండుడు, మహాకాలుడు, భృంగి, వృష, స్కంద, కపర్దీశ, సోమ, శుక్రులనేవారిని, అగ్రము మీద వీరభద్రుడిని, వెనుకవైపున కీర్తిముఖుడిని గంధం పుష్పం, అక్షతలతో పూజించాలి. వీరి తరువాత ఏకాదశ రుద్రులని అర్చించి పంచాక్షరి జపించి రుద్రాధ్యాయ పంచాంగ స్తుతి స్తోత్రాలని పఠించి శివుడికి ప్రదక్షిణ నమస్కారాలు సమర్పించి, ఉద్వాసన పలకాలి.

దేవుడి కార్యక్రమాలని రాత్రి పూటైనా, మరెప్పుడైనా గానీ ఉత్తర దిక్కువైపుకూర్చుని మాత్రమే చేయాలి. భక్తుడు పరిశుభ్రంగా వుండి మంచి వస్త్రాలు ధరించి ఉత్తరాభిముఖంగా కూర్చుని శివపూజ ఆచరించాలి. శివలింగానికి ఎదురుగా, తూర్పువైపుగానీ, శక్తి ఉండే ఉత్తరభాగంలో కానీ, వెనుకవైపు పశ్చిమంగా కానీ, పూజ చేసే అర్చకుడు కూర్చోకూడదు. అసలు మారేడు దళాలు లేకుండా శివపూజే చేయకూడదు. భక్తుడికి ఒకవేళ శివపూజ చేసేటప్పుడు భస్మం లభించకపోతే మట్టినైనా నుదురుమీద త్రిపుండ్రంగా ధరించేందుకు వినియోగించాలి.

# శివ నైవేద్యం

శివుడికి నైవేద్యం పరమ పవిత్రమైనది. దృఢమైన నిశ్చయంతో మంచి వ్రత దీక్షని ఆచరిస్తూ శరీరంలోపల, బైటా, పవిత్రంగా ఉండే శివభక్తుడైనవాడు తీసుకోవాలా, వద్దా? అనే సంశయాన్ని పోగొట్టుకొని, శివుడికి సమర్పించిన నైవేద్యాన్ని స్వీకరించాలి. శివనైవేద్యం ఎంత గొప్పదంటే ఆ నైవేద్యాన్ని చూస్తేనే చాలు పాపాలు పారిపోతాయి. అటువంటి శివనైవేద్యాన్ని తింటే కోటిరెట్లు పుణ్యం లభిస్తుంది. వందలాది వేలాది యాగాలు చేయాల్సిన అవసరం లేదు. భక్తితో శివనైవేద్యాన్ని భక్షిస్తే చాలు శివసాయుజ్యాన్ని పొందుతారు.

ఏ ఇంట్లోనైతే శివనైవేద్యాన్ని తాము తిని, ఇతరులకి పంచుతారో అటువంటి వారి ఇల్లు చాలా పవిత్రమైపోతుంది. అంతేకాదు ఆ ఇంట్లో వారిని ఆ ఇంటికి వచ్చిన వారిని కూడా పవిత్రం చేస్తుంది. భక్తుడైన వాడు తనకు లభించిన శివప్రసాదాన్ని ఆనందంగా, వినయంగా స్వీకరించి, కళ్ళకు అద్దుకుని శివుడిని స్మరిస్తూ తినాలి. శివుడి ప్రసాదం లభించినప్పుడు తీసుకోకుండా అశ్రద్ధతో ఇంకొకసారి తీసుకోవచ్చులే అని భావించి తిరస్కరిస్తే పాపాన్ని పొందుతారు. అసలు శివప్రసాదం స్వీకరించాలి అనే కోరిక ఎవడికి ఉండదో వాడు మహాపాపిగా పరిగణించబడి నరకం పాలవుతాడు. మంచి హృదయంలోగానీ, చంద్రకాంతమణి, బంగారం, వెండి, వంటి వాటితో నిర్మించిన లింగాలలో కొలువుండే సర్వేశ్వరుడికి భక్తితో నైవేద్యాన్ని సమర్పించి ఆ మహాప్రసాదాన్ని శివదీక్షలో ఉండే భక్తుడు స్వీకరించాలని ఋషులు చెప్తారు. శివదీక్షను స్వీకరించిన భక్తుడు శివుడికి పెట్టిన నైవేద్యాన్ని మహాప్రసాదంగా భావించాలి.

సాలగ్రామాలలో ఉద్భవించిన లింగము, పాదరసంతో చేసిన లింగము వెండి బంగారం వంటి లోహాలతో చేసిన లింగము, దేవతలు, ఋషులు, సిద్ధులు చేత ప్రతిష్ఠించబడిన లింగాలు, అలాగే అన్ని జ్యోతిర్లింగాలలో ప్రకాశించే శివుడికి సమర్పించిన నైవేద్యాన్ని ప్రసాదంగా తిన్న భక్తుడికి చాంద్రాయణ వ్రతం చేసిన ఫలితం లభిస్తుంది. ఏ భక్తుడైతే శుచిగా, శివుడి నిర్మాల్యాన్ని

ధరించి ఆయన ప్రసాదాన్ని తింటాడో అటువంటి వాడు, బ్రహ్మహత్య చేసినప్పటికీ అతని పాపం తొలగిపోతుంది. అయితే చండీశ్వరుడు అధికారిగా వుండే శివాలయంలో నైవేద్యాన్ని తినకూడదు. చండీశ్వరుడు అధికారంలో లేని ఆలయాలలో మాత్రమే నైవేద్యాన్ని స్వీకరించవచ్చు. ఈ చండీశ్వరుడి అధికారం ఎక్కడ వుండదంటే! బాణలింగాలు, లోహంతో నిర్మించిన లింగాలు, సిద్ధులు ప్రతిష్ఠించిన లింగాలు స్వయంభూలింగాలు, అలాగే అన్ని రకాల శివుడి ప్రతిమలలో (విగ్రహాల ప్రతిష్ఠలలో) చండీశ్వరుడికి అధికారం ఉండదు. ఇలాకాని వాటిల్లో ఆయనకి అధికారం వుంటుంది. ఏ భక్తుడైతే శివలింగానికి యథావిధిగా అభిషేకాన్ని చేసి ఆ తీర్థాన్ని మూడుసార్లు భక్తిగా స్వీకరిస్తాడో వాడు చేసిన మూడు రకాల పాపాలు వెంటనే నశిస్తాయి. శివలింగం మీద ఉంచిన వస్తువుల్ని స్వీకరించవచ్చు అవి చాలా పవిత్రమైనవి కూడా. ఇప్పుడు మీరు అడిగినట్లు బిల్వము దాని మహిమను గురించి చెబుతాను శ్రద్ధగా వినండి.

## బిల్వమహిమ

బిల్వవృక్షము అనగా మారేడు చెట్టు ఇది సాక్షాత్తు పరమేశ్వరుడి స్వరూపం. ఈ వృక్షాన్ని దేవతలు కూడా పూజిస్తారు. దీని మహిమను గురించి పూర్తిగా చెప్పటం ఎంతో కష్టం. లోకంలో ప్రసిద్ధమైన పుణ్య తీర్థాలెన్నైతే ఉన్నాయో అవన్నీ మారేడు చెట్టు మూలంలో నివసించి ఉంటాయి. మారేడు చెట్టు క్రింద లింగరూపంలో వున్న పరమేశ్వరుడిని పూజించే భక్తుడు అనంత పుణ్యాత్ముడై శివసాన్నిధ్యాన్ని పొందుతాడు. అలాగే మారేడు చెట్టు మొదట్లో స్నానాన్ని ఆచరించినవాడు సకల తీర్థాలలో స్నానం చేసిన ఫలితాన్ని పొందుతాడు. అలా చేసినవాడు మాత్రమే నిజమైన పవిత్రుడని చెప్పబడతాడు. మారేడు చెట్టు మూలం కట్టిన కుదురు ఎంతో శ్రేష్ఠమైనది. ఆ కుదురుని గనుక నీటితో తడిపినట్లైతే శివుడు ఎంతో ఆనందిస్తాడు. ఏ మనిషైతే మారేడు చెట్టు మూలాన్ని గంధం, పుష్పం, మొదలైన ద్రవ్యాలు సమర్పించి పూజిస్తాడో అతడు అంత్యంలో శివలోకాన్ని చేరతాడు. అలాంటి వాడి సంతానం కూడా సుఖ శాంతుల్ని పొందుతుంది.

బిల్వమూలే దీపమాలాం యః కల్పయతి సాదరమ్ ।
స తత్త్వజ్ఞాన సంపన్నో మహేశాంతర్గతో భవేత్ ॥
బిల్వశాఖాం సమాదాయ హస్తేన నవ పల్లవమ్ ।
గృహీత్వా పూజయేద్బిల్వం స చ పాపైః ప్రముచ్యతే ॥
(శ్లో॥28-29)

ఏ భక్తుడైతే శ్రద్ధగా బిల్వవృక్షం మొదట్లో వరసగా దీపాలను పెడతాడో అతడు తత్త్వజ్ఞానాన్ని పొంది సాక్షాత్తు పరమేశ్వరుడిలో లీనమైపోతాడు. అలాగే మారేడు చెట్టు కొమ్మలని ఆ కొమ్మలకున్న లేత మారేడు చిగురుల్ని పట్టుకుని భక్తిగా పూజిస్తాడో ఆ మానవుడు పాపాలనుంచి విముక్తి పొందుతాడు. మారేడు చెట్టుకింద కనీసం ఒక్క భక్తుడికి భోజనం పెట్టినా కోటిమందికి పెట్టిన పుణ్యం లభిస్తుంది. ఆ చెట్టు కింద పాలు, నేయితో కూడిన అన్నాన్నిఏ శివభక్తుడికైనా పెడితే అలా పెట్టినవాడు వచ్చే జన్మలో ఐశ్వర్యాన్ని పొందుతాడు.

## శివనామ మహిమ

శివుడిని ఉపాసించే వారందరూ ఎంతో పుణ్యాత్ములు. శివ పూజ వల్ల వారి జన్మ సఫలమవుతుంది. వారి కులం, వంశం, ఉద్ధరించబడుతుంది.

ముఖేయస్య శివనామ సదాశివ శివేతి చ ।
పాపాని న స్పృశ్యంత్యేవ ఖదిరాంగారకం యథా ॥

సదాశివా! సదాశివా! అని శివనామాన్ని ఎల్లప్పుడూ ఉచ్చరించి జపించేవాడి పాపాల్ని చెదల్ని నిప్పులు దహించినట్లుగా ఆ శివ నామ మహిమ దహించివేస్తుంది. ఓ శివా! నీకు నమస్కారం అని పలికేనోరు ఏదైతే ఉందో. అది పాపాలను పోగొట్టే పవిత్ర తీర్థం. అలా నామాన్ని జపించేవాడి ముఖాన్ని ఎవరైతే భక్తిగా చూస్తారో వారందరికీ పుణ్యతీర్థాలు దర్శించిన ఫలితం లభిస్తుంది. ఏ వ్యక్తిలో ఎంతో పవిత్రమైన శివనామం, శివుడి విభూతి, రుద్రాక్షలు అనే మూడు ఉంటాయో అలాంటి వ్యక్తి దర్శనం చేత త్రివేణీ సంగమంలో స్నానం చేసిన ఫలితం లభిస్తుంది.

శివనామ విభూతిశ్చ తథా రుద్రాక్ష ఏవ చ ।
ఏతత్త్రయం మహాపుణ్యం త్రివేణీ సదృశం స్మృతమ్ ॥

శివనామము, విభూతి, రుద్రాక్ష అనే మూడూ త్రివేణీ అనగా గంగా యమునా, సరస్వతీ నదులంత పవిత్రమైనవి పుణ్యప్రదమైనవని ఋషులు చెప్తారు.

ఏ భక్తుడి శరీరం మీద శివనామం, విభూతి, రుద్రాక్షలు నిత్యం ఉంటాయో, వాటిని చూసినంతనే పాపాలు పటాపంచలైపోతాయి. ఎవరి నుదుటిపై విభూతి ఉండదో, ఎవడి శరీరం రుద్రాక్షమాలని ధరించి ఉండదో, ఎవడి మాటలు శివుడి దివ్యనామాన్ని పలుకవో, అలాంటి వాడిని అధముడిగా భావించి వాడిని తిరస్కరించాలి. శివుడి నామం గంగానది లాంటిది. విభూతి యమునానది రుద్రాక్ష సకల పాపాల్నీ దోషాల్నీ పోగొట్టే సరస్వతీ నది. ఈ మూడూ ధరించిన వ్యక్తి పుణ్యాన్ని ఒకవైపు. త్రివేణీసంగమస్నానం వల్ల వచ్చిన పుణ్యం ఒకవైపు ఉంచితే అవి రెండూ సమానమైనవిగా ఉన్నట్టు బ్రహ్మదేవుడు పోల్చిచూసి చెప్పాడు. కాబట్టి ఈ మూడు సర్వులూ సర్వవేళలా ధరించాలి. ఈ విషయం తెలిసిన నాటినుంచీ బ్రహ్మ విష్ణువంటి దేవతలంతా ఈ మూడింటినీ ధరించటం మొదలుపెట్టారు.

## శివనామ మాహాత్మ్యం

ఈ బ్రహ్మాండంలో వ్యక్తావ్యక్తాలంటే గొప్పవాడైన పరమేశ్వరుడు తప్ప ఈ నామ మహిమని ఎవరు పూర్తిగా తెలుసుకోలేడు. శివనామం అనేది మహాదావాగ్ని దాని ఎదుట నిలబడిన పాపాలనే పర్వతాలు సైతం ఎంతో తేలికగా బూడిదైపోతాయనటంలో ఎలాంటి సందేహం లేదు. పాపాల వల్ల మానవులకి సంభవించే వివిధ రకాల దుఃఖాలన్నీ శివనామ స్మరణతోనే నశిస్తాయిగానీ మరోవిధంగా నశించవు.

ఏమనిషైతే నిత్యం శివనామాన్ని జపించటంలో ఆసక్తి కలిగి వుంటాడో అతడే వైదికుడుగా చెప్పబడతాడు. అంతేకాదు పుణ్యాత్ముడుగా, ధన్యాత్ముడుగా పండితుడుగా కూడా కొలవబడతాడు. శివనామం జపించటంలో విశ్వాసాన్ని

కలిగివుండే భక్తులకి వారు చేసే పనులన్నీ వెంటనే సఫలీకృతమవుతాయి. ఓ శివనామం ఎన్ని రకాల పాపాల్ని నశింపచేస్తుందంటే, అసలు అన్నిరకాల పాపాల్ని భూలోకంలో ఎవరూ చేయలేరు. మానవులు శివనామాన్ని ఉచ్చరించిన వెంటనే బ్రహ్మహత్య వంటి పాపరాశులు తరిగిపోతాయి. శివనామం అనే పడవతో సంసార సముద్రాన్ని దాటవచ్చు. అలాదాటేవారి సంసార మూలక పాపాలన్నీ శివనామం అనే గొడ్డలి ఛేదిస్తుంది. పాపం అనే దావాగ్నితో దహించబడే మానవులు శివనామం అనే అమృతాన్ని పానం చేయాలి. అలా దావాగ్నిలో చిక్కుకున్న వారికి శివనామం తప్ప మరొక శాంతి మార్గంలేదు. శివనామం అనే అమృత ధారలలో తడిసిన మానవులు సంసారం అనే దావాగ్నిలో ఉన్నా ఏనాడూ బాధలు పడరు. శివనామం మీద నిశ్చలమైన భక్తి కలిగిఉన్నవారు తప్పకుండా ముక్తిని పొందుతారు. పూర్వం అనేక జన్మలలో తపస్సుచేసిన వాడికి మాత్రమే శివనామం మీద అచంచలమైన భక్తి కుదురుతుంది.

ఎవరికైతే శివనామం మీద భక్తి కుదురుతుందో వారికే మోక్షం సులభమవుతుందని, మిగిలిన వారికి మోక్షం దుర్లభం ఎన్నో పాపాలు చేసిన వాడైనప్పటికీ శివనామం మీద గురి కుదిరితే వాడి పాపాలన్నీ నశిస్తాయి.

> భవంతి భస్మసాద్వృక్షాదవదగ్ధాయథావనే ।
> తథా తావంతి దగ్ధాని పాపాని శివనామతః ॥
>
> యోనిత్యం భస్మపూతాంగ శ్శివనామ జపాదరః ।
> సంతరత్యేవ సంసారం సుఘోరమపి శౌనకా ॥ *(శ్లో॥37-38)*

అడవిలో ఉండే వృక్షాలు దావాగ్ని చెలరేగితే ఎలా భస్మమైపోతాయో, అదేవిధంగా పాపాలన్నీ శివనామం అనే దావాగ్ని వల్ల దగ్ధమైపోతాయి. నిత్యం విభూతిని ధరించి భక్తి శ్రద్ధలతో శివనామాన్ని జపించే వ్యక్తి ఘోరమైన సంసార సాగరాన్ని అవలీలగా నిశ్చయంగా దాటేస్తాడు. బ్రాహ్మణుల ద్రవ్యాన్ని అపహరించటం, బ్రాహ్మణులని ఎంతో మందిని చంపటం, వంటి ఘోరమైన పాపాలు కూడా శివనామాన్ని శ్రద్ధగా జపించేవాడిని చేరవు. పూర్వం

పండితులందరూ వేదాల్ని శాస్త్రాల్ని పరిశీలించి శివనామజపం సంసారాన్ని తరింపచేసే గొప్ప మార్గమని తేల్చిచెప్పారు.

పూర్వం మహా పాపాత్ముడైన ఇంద్రద్యుమ్న మహారాజు అనేవాడు శివనామ మహిమ వల్ల ఉత్తమమైన లోకాల్ని పొందాడు. అంతేకాదు పూర్వం ఎన్నో పాపాలు చేసిన ఒక బ్రాహ్మణస్త్రీ కూడా శివనామ మహిమ వల్ల ఉత్తమ గతుల్ని పొందింది.

## భస్మం-దానిని ధరించే విధానం

భస్మధారణ జనులందరికీ సర్వమంగళాలని కలిగిస్తుంది. ఎంతో ఉత్తమమైనది. ఈ భస్మం అనేది రెండు విధాలుగా వుంటుంది. 1.మహాభస్మం 2.స్వల్ప భస్మం అని మహా భస్మంలో తిరిగి భేదాలున్నాయి. అవి శ్రేతము, స్మార్తము లౌకికము అని మూడు విధాలు. అలాగే స్వల్ప భస్మంలో కూడా ఎన్నో రకాల భేదాలున్నాయి. శ్రౌత స్మార్త రకాల భస్మాలని బ్రాహ్మణులు మాత్రమే ధరించాలని, మిగిలిన వారందరూ లౌకిక భస్మాన్ని ధరించాలని శాస్త్రంలో చెప్పబడింది. బ్రాహ్మణులు మంత్రపూర్వకంగా ఇతరులు మంత్రం లేకుండా భస్మాన్ని ధరించాలని మహర్షులు చెప్తారు.

ఆవుపేడను కాల్చగా వచ్చిన భస్మాన్ని ఆగ్నేయ భస్మం అంటారు. అది త్రిపుండ్రాలను ధరించటానికి యోగ్యమైనదిగా చెప్తారు. విద్వాంసులైనవారు అగ్నిహోత్రంలో భస్మాన్ని గానీ, వివిధ యజ్ఞాలలో లభించే భస్మాన్ని గానీ జాగ్రత్త చేసుకుని, దాన్ని త్రిపుండ్రాలు ధరించటానికి వినియోగించుకోవాలి. జాబాలోపనిషత్తులో చెప్పిన "అగ్నిః" వంటి ఏడు మంత్రాలని ఉచ్చరిస్తూ భస్మాన్ని నీటితో కలిపి శరీర అంగాలపై ధరించాలి. అన్ని వర్ణాలవారు అన్ని ఆశ్రమాల వారు మంత్రంతో గానీ, మంత్రం లేకుండా గానీ భస్మాన్ని ధరించాలని జాబాల ఋషి శిష్యులు చెప్తారు. మోక్షాన్ని కోరుకునే వాళ్ళు శరీర అవయవాల మీద భస్మధారణని, లలాటం మీద త్రిపుండ్ర ధారణని పొరపాటున కూడా ధరించటం విడవకూడదని వేదాలు చెబుతున్నాయి.

బ్రహ్మ శివుడు, విష్ణువు, ఉమాదేవి, లక్ష్మి, సరస్వతీ, మరియు ఇతర దేవతలందరూ నిత్యం లలాటంమీద అడ్డంగా భస్మంతో త్రిపుండ్రాలని ధరిస్తారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులే కాకుండా, అందరు మానవులూ భస్మాన్ని భక్తి శ్రద్ధలతో శరీరావయవాల మీద లలాటం మీద ధరించాలి. ఇలా త్రిపుండ్రాలని శ్రద్ధగా ధరించని వాళ్ళకి వర్ణాశ్రమ ధర్మాలు సిద్ధించవు. అలా ధరించని వారికి కోటి జన్మలెత్తినా సంసారం నుండి విముక్తి లభించదు. ఎన్ని కోట్ల సంవత్సరాలైనా వారికి శివజ్ఞానం కలగదు. ఉద్ధూలన (అనగా శరీరావయవాల మీద భస్మదారణ చేయటం) త్రిపుండ్రాలను ఎవరైతే శ్రద్ధగా ఆచరించరో వారు మహాపాపులని శాస్త్రాలు నిర్ణయించాయి. అలాంటివారు చేసే పనులన్నీ విపరీత ఫలితాలనిస్తాయి. శివుడిని ద్వేషించే మహాపాపులైన వారికి భస్మంతో ఉద్ధూలన త్రిపుండ్రధారణ ధరించటంలో కూడా ద్వేషం కలుగుతుంది. ఆత్మవేత్తలైన పండితులు 'త్రియూషాది' మంత్రాలు పఠిస్తూ శివాగ్ని కార్యాన్ని చేసి అన్ని పాపాలనుండీ విముక్తి పొందుతారు. అంతేకాదు ఆ అగ్ని ద్వారా వచ్చిన భస్మాన్ని స్పృశించిన మానవులు కూడా పాప విముక్తులవుతారు.

సితేన భస్మనాకుర్యాత్ త్రిసంధ్యం యస్త్రిపుండ్రకమ్ ।
సర్వపాపవినిర్ముక్తః శివేన సహమోదతే ॥
సితేన భస్మనాకుర్యాల్లలాటే తు త్రిపుండ్రకమ్ ।
యోసావనాది భూతాన్హి లోకానాప్తో మృతోభవేత్ ॥ *(శ్లో॥20-21)*

ఏ మానవుడైతే మూడు సంధ్యలలో తెల్లని భస్మంతో త్రిపుండ్రాలని ధరిస్తాడో అతడు పాపాల నుంచి విముక్తుడై శివుడితో కలిసి ఆనందిస్తాడు. తెల్లని పవిత్ర భస్మాన్ని లలాటం మీద త్రిపుండ్రంగా ధరించే భక్తుడు శరీరం వదిలిన తరువాత శాశ్వతంగా శివలోకాన్ని పొందుతాడు.

భస్మస్నానం అనగా భస్మాన్ని ధరించకుండా "ఓం నమఃశ్శివాయ" అనే శ్రీమంత్రాన్ని జపించకూడదు. త్రిపుండ్రాన్ని ధరించి మాత్రమే జపం

చేయాలి. దయలేని వాడు, అధముడు, ఎన్నో పాపాలు చేసినవాడూ, సూర్యోదయ సమయంలో నిద్రపోయేవాడు, మూర్ఖుడు, పతితుడూ అయినప్పటికీ అటువంటి దుర్గుణాలున్నవాడు విభూతి ధరించి ఎక్కడ ఉంటాడో అక్కడే అన్ని తీర్థాలు, క్రతువులు వాడి సమీపంలోకి వచ్చి చేరతాయి. త్రిపుండాలని ధరించే మానవుడు కఠిన పాపాత్ముడైనా అతడు దేవతలు దానవులు, అందరి చేతా పూజించబడతాడు. ఇక శ్రద్ధగా విభూతి ధరించేవాడి గొప్పతనం గురించి ప్రత్యేకంగా చెప్పేదేముంది. కనుక పండితులు, జ్ఞానులు ఈ విషయాన్ని తెలుసుకుని తప్పనిసరిగా భస్మాన్ని ధరించాలి. నిత్యం లింగ పూజ ఆచరించాలి. ప్రతిరోజూ ఓం నమశ్శివాయ మంత్రాన్ని జపించాలి. ఇలా ఈ భస్మధారణ ప్రభావాన్ని బ్రహ్మ, విష్ణు, రుద్రులు, మునులు కూడా వర్ణించలేరు.

వర్ణాశ్రమ ధర్మాలని పాటించేవాడు గానీ, పాటించనివాడుగానీ, ఒక్కసారి త్రిపుండ్రాలని ధరిస్తే, అతడు పాపం నుంచి విముక్తి పొందుతాడ. ఏవిప్రుడైతే తన లలాటం మీద త్రిపుండ్ర ధారణ చేస్తాడో అతడు సకల శాస్త్రాలు గురువు దగ్గర అభ్యసించినట్లు, అన్ని కర్మలనీ అనుష్టించినట్లు అవుతుంది. ఇలా భక్తి శ్రద్ధలతో భస్మాన్ని ధరించే వ్యక్తుల్ని అవమానించిన వారికి అతినీచమైన జన్మలభిస్తుంది. బ్రాహ్మణ క్షత్రియవర్ణాలవారు 'మాస్తోకేతనయే" అనే మంత్రంతో భస్మాన్ని మంత్రించి నిర్ధిష్టమైన అవయవాలలో ధరించాలి. వైశ్యులు "త్ర్యంబకం" అనే మంత్రంతో అలాగే శూద్రులు "నమశ్శివాయ" మంత్రంతో భస్మాన్ని అభిమంత్రించి ధరించాలి. ఇక మిగిలినవారు భర్తృహీనులైన విధవాస్త్రీలు కూడా 'పంచాక్షరి' చెప్పి భస్మాన్ని ధరించాలి. గృహస్థులు 'బ్రహ్మాది అయిదు మంత్రాలతో బ్రహ్మచారి "త్ర్యంబకం" అనేమంత్రంతో, వానప్రస్థులు 'అఘోరేభ్యో' అనే మంత్రంతో, సన్న్యాసులు 'ఓం' కారముతో త్రిపుండ్రాలు ధరించాలని ఋషులు చెప్తారు. సర్వకాల సర్వావస్థలలో 'నేనేశివుడిని' అని భావిస్తూ వర్ణాశ్రమ ధర్మాలకు అతీతుడైన శివయోగి 'ఈశాన' మంత్రంతో విభూతి ధరించాలి. అందరూ మానవులూ ఉత్తమమైన భస్మధారణని మానకుండా వుండాలని

శివుడి ఆజ్ఞ. మానవులు ధరించే భస్మంలో ఎన్ని కణాలువుంటాయో అన్ని శివలింగాలని జీవుడు తన దేహం మీద ధరించిన ఫలితం లభిస్తుంది. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, మిగిలినవర్ణాలవారు స్త్రీలు, కన్యలు, భర్తృహీనులు, పాపాత్ములు, బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, పాపాత్ములు, బ్రహ్మవరులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులు, వ్రతదీక్షలో వున్నవారు ఇలా అందరూ విభూతిని లలాటం మీద ధరిస్తే ముక్తి పొందుతారు అనటంలో ఎలాంటి సందేహం లేదు.

తెలిసి తాకినా తెలియకుండా తాకినా నిప్పు కాల్చకుండా వుండదు. అదేవిధంగా తెలిసిగానీ తెలియకగానీ భస్మాన్ని ధరిస్తే అది పాపాల్ని నిప్పులాగా దహించి వేస్తుంది. భస్మాన్ని రుద్రాక్షలని ధరించకుండా నీళ్ళు త్రాగకూడదు. కొద్దిగా కూడా ఆహారాన్ని భుజించకూడదు. ఎవరైనా అలాచేస్తే వారికి పాపం సంభవిస్తుంది. అలాంటి వారు నరకానికిపోతారు. మరి ఇలాంటి పాపాన్ని తొలగించుకోవాలంటే గాయత్రీ మంత్ర జపాన్ని వారు చేయాలి. సన్న్యాసి అయితే ప్రణవాన్ని (ఓం) జపించాలి.

ధిగ్భస్మరహితం భాలం ధిగ్గ్రామమశివాలయమ్ ।
ధిగనీశార్చనంజన్మ ధిగ్విద్యామ శివాశ్రయామ్ ॥

భస్మం ధరించని లలాటం, శివాలయంలేని గ్రామం, శివుడిని పూజించని జన్మ, శివసంబంధం కాని విద్య నిందనీయాలు. త్రిలోకాలకీ పరమపావనుడైన, పాపహరుడైన, శివుడిని, త్రిపుండ్రాలని ధరించేవాడిని ఎవరు దూషిస్తారో వారు నీచమైన, పంది రాక్షసుడు, గాడిద, కుక్క, నక్క, క్రిమి, కీటకాలు వంటి జన్మలని పొందుతారు. అలాంటి పాపాత్ములు పగలు సూర్యుడిని, రాత్రి చంద్రుడిని చూడలేని గ్రుడ్డివారి వంటివారు. భస్మాన్ని ధరించే వ్యక్తిని నిందించేవారు మూర్ఖులు. తాంత్రికులకు, ఊర్ధ్వపుండ్రాలు ధరించేవారికి, కాల్చిన ఇనుముతో శరీరం మీద చక్రం గుర్తులు వేసుకున్న వారికి శివయజ్ఞం చేయటానికి అధికారం లేదు. శివభక్తులు బృహజ్జాలోపనిషత్తుని గనుక అధ్యయనం చేస్తే భస్మధారణ మీద ఇష్టం కలుగుతుంది.

గంధాన్ని ధరించాలని కోరుకునేవారు దానిలో భస్మాన్ని కలిపి త్రిపుండ్రాలని ధరించాలి. అంతేగానీ విభూతిని ఒకసారి లలాటం మీద ధరించిన తరువాత దానిమీద మరొక పదార్థాన్ని ధరించరాదు. స్త్రీలు ముంగురులు ఉండే ప్రాంతం వరకూ త్రిపుండాన్ని ధరించాలి. ఇదేవిధంగా అందరూ ధరించాలి. భస్మాన్ని ధరించే భక్తుడు స్త్రీ హత్య, గోహత్య, వీర పురుష హత్య, అశ్వహత్య, ఇత్యాది పాతకాలనుంచి విముక్తుడవుతాడు. ఇతరుల ధనాన్ని దొంగతనం చేయుట, ఇతరుడి భార్యనుకామించుట, ఇతరుల్నినిందించటం, పరుల భూమి అపహరించటం, ఇతరుల్ని పీడించుట, ఇళ్ళను తగలబెట్టుట నీచుల నుంచి ఆవు, బంగారం, గేదె, నువ్వులు, కంబళి, అన్నం, వస్త్రం, ధాన్యం స్వీకరించటం, వేశ్యలు, వివాహం కానివారు, నాట్యం చేసేవారు, రజస్వలలు, భర్తృహీనులైన స్త్రీలతో సంభోగం చేయటం, మాంసం, చర్మం, పాదరసం, ఉప్పు వంటి ద్రవ్యాలను విక్రయించుట, అబద్ధాలు, తప్పుడు సాక్ష్యాలు చెప్పటం చెప్పించటంవంటి వివిధ రకాల పాపాలన్నీ త్రిపుండ్ర ధారణతో వెంటనే నశిస్తాయి. శివధనాన్ని అపహరించటం, శివుడిని నిందించటం, శివభక్తుల్ని నిందించటం అనే పాపాలకు మాత్రం ఎలాంటి ప్రాయశ్చిత్తం లేదు.

ఎవరి లలాటం మీద త్రిపుండ్రాలు ఉంటాయో అటువంటి వ్యక్తిని కుల, వర్ణ విచక్షణ లేకుండా అందరూ గౌరవించి పూజించాలి. పంచాక్షరీవంటి ఏడుకోట్ల మహామంత్రాలు, మోక్షాన్ని ప్రసాదించే కోట్లాది ఇతర దేవతల మంత్రాలు, సకల సుఖాల్ని ప్రసాదించే మంత్రాలు ఇవన్నీ త్రిపుండ్రం ధరించే వాడికి వశమవుతాయి. ఇలా త్రిపుండ్రాలని ధరించేవాడు తన వంశంలో వేయితరాలకు పూర్వం, వేయి తరాలు తరువాత వచ్చే జ్ఞాతుల్ని ఉద్ధరిస్తాడు. అంతేకాదు దీర్ఘాయుర్ధాయాన్ని కలిగి వ్యాధులు లేకుండా భోగాలన్నీ అనుభవించి అనాయాస మరణాన్ని పొందుతాడు. ఆ తరువాత మంగళకరమైన దివ్యదేహాన్ని ధరించి దేవతా విమానాన్ని అధిరోహించి, దేవతలందరిచేతా సేవించబడుతూ

ఇంద్రాది దిక్పాలకుల లోకాలలో దివ్యభోగాలు అనుభవించి ప్రజాపతుల లోకానికి చేరతాడు. ఆ తరువాత బ్రహ్మలోకానికి చేరి సుఖభోగాలనుభవించి విష్ణులోకానికి చేరతాడు అక్కడ కూడా వందమంది బ్రహ్మలు గతించేంత కాలం వరకూ భోగాలు పొందుతాడు. ఆ వెంటనే శివలోకం చేరి శివసాయుజ్యాన్ని పొందుతాడు. ఇందులో సందేహమే లేదు. అన్ని ఉపనిషత్తుల్నీ పరిశీలించగా త్రిపుండ్రధారణే సర్వశ్రేయస్సును సమకూర్చే సాధనంగా నిర్ణయించబడినట్లు తెలుస్తుంది. బ్రాహ్మణుడుగానీ, ఇతరులుగానీ భస్మాన్ని నిందిస్తే నరకం పాలవుతారు. శ్రాద్ధము, యజ్ఞము, జపం, హోమం వైశ్వదేవం, దేవపూజలు ఆచరించేటప్పుడు త్రిపుండ్రాలని ధరిస్తే అలా ధరించినవాడు పవిత్రమైన మనస్సుని కలిగి మృత్యువుని కూడా జయించగలడు.

కాలకృత్యాలు తీర్చుకున్న తరువాత నీటితో స్నానం చేసినవాడు శుచిర్భూతుడవుతాడు. అదేవిధంగా భస్మస్నానం అనగా విభూతి ధరించినా పరిశుద్ధుడవుతాడు. మంత్రస్నానం అనగా మంత్రజపం పాపాల్ని పోగొడుతుంది. జ్ఞానస్నానం వల్ల మోక్షం లభిస్తుంది. భస్మస్నానం అన్ని తీర్థాలలో స్నానం చేసినంత పవిత్రమైనది. శివుడు సదా భస్మాన్ని ధరించి వుంటాడు. అందుకే భస్మం మూడులోకాల్నీ పవిత్రం చేస్తుంది. త్రిపుండ్రాలు ధరించకుండా విప్రుడు చేసే తీర్థస్నానం స్నానం కాదు. ధ్యానం ధ్యానం కాదు, దానం దానం కాదు, జపం జపం కాదు. వానప్రస్థులు, కన్యలు, దీక్షలేనివారు మధ్యాహ్నానికి ముందు సమయంలో నీటిని కలిపిన భస్మాన్ని, మధ్యాహ్నం తరువాత పొడి భస్మాన్ని ధరించాలి. ఇలా నియమపూరితంగా త్రిపుండ్రాలని ధరించేవాడే నిజమైన శివభక్తుడు.

## త్రిపుండ్రాలని ధరించే విధానం

పూర్వం మహర్షులచేత నిర్దిష్టంగా చెప్పబడ్డ లలాటం మొదలైన స్థానాలలో మూడు రేఖలు ఉండేలా త్రిపుండ్రాన్ని ధరించాలి. లలాటం మీద కనుబొమల మధ్యనుండి కనుబొమల చివర వరకూ విభూతి ధరించాలి.

మధ్యవేలు, మరియు అనామిక వేలుతో భస్మాన్ని ధరించి ఆరేఖల మధ్యలో విలోమంగా బొటన వేలుతో మరొక రేఖను ధరిస్తే దానిని త్రిపుండ్రము అంటారు. లేదా మూడు వేళ్ళతో భస్మాన్ని గ్రహించి త్రిపుండ్రం ధరించవచ్చు. మానవులు శరీరం మీద ధరించే ఈ మూడు రేఖలలో ప్రతిరేఖకూ తొమ్మిది మంది దేవతలు ఉంటారు.

**మొదటి రేఖలో :-** 1.అకారం 2.గార్హపత్యాగ్ని 3.భూమి 4.ధర్మం 5.రజోగుణం 6.ఋగ్వేదం 7.క్రియాశక్తి 8.పాత్రస్సవనం 9.మహాదేవుడు అనే తొమ్మిదిమంది దేవతలు ఉంటారు.

**రెండవ రేఖలో :-** 1.ఉకారం 2.దక్షిణాగ్ని 3.ఆకాశతత్త్వం 4.యజుర్వేదం 5.మాధ్యందిన సవనం 6.ఇచ్ఛాశక్తి 7.అంతరాత్మ 8.సత్త్వగుణం 9.మహేశ్వరుడు అనే తొమ్మిది మంది దేవతలు ఉంటారు.

**మూడవ రేఖలో :-** 1.మకారం 2.అహవనీయం 3.పరమాత్మ 4.తమోగుణం 5.ద్యులోకం 6.జ్ఞానశక్తి 7.సామవేదం 8.తృతీయసవనం 9.శివుడు అనే దేవతలు ఉంటారు. ఈ విధంగా మూడు పుండ్రాలలో వుండే స్థాన దేవతల్ని నిత్యం భక్తితో నమస్కరించి త్రిపుండ్రాలని ధరించాలి.

శివభక్తుడు తన శరీరం మీద ముప్పై రెండు, పదహారు లేక ఎనిమిది, ఐదు స్థానాలలో భస్మాన్ని ధరించాలి. శిరస్సు, లలాటం, చెవులు, కళ్ళు, ముక్కు, నోరు, కంఠం, రెండు చేతులు, మోచేతులు, మణికట్టు, హృదయస్థానం, రెండు పార్శ్వాలు, నాభిప్రదేశం, గుహ్యాభాగం, రెండు తొడలు, రెండు మోకాళ్ళు, రెండు పిక్కలు, రెండు పాదాలు, మోకాలు కిందభాగాలు వంటి ముప్పైరెండు ఉత్తమమైన శరీర స్థానాలలో భస్మాన్ని భక్తిగా ధరించాలి. అగ్ని, నీరు, భూమి, గాలి, దిక్కులు, దిక్పాలకులు, అష్టవసువులు, వీరి నామాలను స్మరించి త్రిపుండ్రాలని ధరించాలి. ధర, ధృవుడు, సోముడు, జలాధిష్టాన దేవత, అగ్ని, వాయువు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అనేవారు అష్టవసువులు అని పిలువబడతారు. ముప్పై రెండు స్థానాలలో ధరించలేనివారు పదహారు స్థానాలలో

ధరించాలి. అవి తల, లలాటం, కంఠం, రెండు భుజస్కందాలు, రెండు భుజాలు, రెండు మోచేతులు, రెండు మణికట్టులు, హృదయం, నాభి, రెండు పార్శ్వాలు, వీపుభాగం వీటిమీద భస్మాన్ని ధరించాలి. ఆస్థానాలలో అశ్వినీదేవతలు, శివుడు, శక్తిరుద్రుడు, ఈశుడు, నారదుడు, వామా వంటి పదహారు శక్తుల్ని భావనచేసి విభూతి ధరించాలి. నా సత్యుడు, దస్రుడు, అనే ఇద్దరినీ అశ్వినీ దేవతలంటారు. ఈ పదహారు స్థానాలని దానిని అధిష్టించి ఉండే దేవతలని మరొక విధంగాకూడా చెప్పవచ్చు. తల, కేశాలు, రెండు చెవులు, ముఖం, రెండు చేతులు, హృదయం, నాభి, రెండు తొడలు, రెండు మోకాళ్ళు, రెండు పాదాలు, వీపుభాగం అనే పదహారు స్థానాలలో భస్మాన్ని ధరించాలి. ఈ స్థానాలలో వరుసగా శివుడు, చంద్రుడు, రుద్రుడు, బ్రహ్మ, విఘ్నేశ్వరుడు, విష్ణువు, లక్ష్మి, శంభువు, ప్రజాపతి, నాగదేవత, ఇద్దరు నాగకన్యలు ఇద్దరు ఋషికన్యలు, సముద్రం తీర్థాలు ఉంటాయి.

పదహారు స్థానాలలో భస్మాన్ని ధరించలేనివారు శరీరంలోని ఎనిమిది స్థానాలలో భస్మాన్ని ధరించవచ్చు. ఆ స్థానాలు వరుసగా, లలాటం, చెవులు, రెండు భుజాలు, హృదయం, నాభి, గుహ్యం ఈ ఎనిమిది స్థానాలలో భస్మాన్ని భక్తిగా ధరించాలి. బ్రహ్మదేవుడు - సప్తర్షులు ఆ ఎనిమిది స్థానాలకి అధిదేవతలని ఋషులు చెప్తారు. ఇక ఇవికూడా చేయలేకపోతే తల, రెండు బాహువులు, హృదయం నాభి, అనే ఐదుస్థానాలలో కూడా భస్మాన్ని ధరించవచ్చు. దేశ కాలాలని అనుసరించి భక్తుడు యథాసంభవంగా భస్మాన్ని ధరించాలి. ఇలా భస్మంతో అంగాలన్నిటికీ లేపనం చేయలేనివాడు త్రిపుండ్రాలని ధరించాలి.

త్రినేత్రం త్రిగుణాధారం త్రిదేవజనకం శివమ్ ।
స్మరన్నమశ్శివాయేతి లలాటేతు త్రిపుండ్రకమ్ ॥

శరీరం మీద భస్మాన్ని లేపనం చేసుకునే భక్తుడు ముందుగా త్రినేత్రాలు కలిగినవాడు సత్త్వరజస్తమో గుణాలకు ఆధారమైనవాడు, బ్రహ్మ, విష్ణు, రుద్రులనే త్రిదేవులకు తండ్రి అయినవాడు, అయిన సర్వేశ్వరుడిని

'నమశ్శివాయ' అని ఒక్కసారి స్మరించి లలాటం మీద త్రిపుండ్రాలని ధరించాలి. ఆ తరువాత 'ఈశాభ్యాం నమః' అని ఉచ్చరించి రెండు ప్రక్కలా 'బీజాభ్యాం నమః' అని చెప్పి ముంజేతుల మీద, 'పితృభ్యాం నమః' అని శరీరంలోని క్రింది అవయవాల మీద 'ఉమేశాభ్యాం నమః' అని చెప్పి శరీరంలోని పై భాగాల మీద 'భీమాయ నమః' అనే మంత్రంతో తలవెనుక భాగాన భస్మాన్ని భక్తిగా ధరించాలి.

## రుద్రాక్షలు - వాటి మాహాత్మ్యం

రుద్రాక్ష ఎంతో పవిత్రమైనది. శివుడికి ఎంతో ఇష్టమైనది. కనుక రుద్రాక్షను చూసినా, దాన్ని తాకినా, ఆమాలతోజపాన్ని చేసినా పాపాలన్నీ తొలగిపోతాయని ఋషులు చెప్తారు. పూర్వం లోకోపకారం కోసం పరమేశ్వరుడు పార్వతీదేవికి రుద్రాక్షల మహిమను గురించి వివరించి ఇలా చెప్పాడు. "ఓ పార్వతీ! భక్తులందరి మేలుకోరి నేను నీకు రుద్రాక్ష మహిమను గురించి చెబుతాను విను. పూర్వం నేను వేల సంవత్సరాలు దివ్యమైన తపస్సులో మునిగి పోయి వున్నాను. అలా ఉన్న సమయంలో ఒకసారి నా మనస్సు ఎందుకో భయాన్ని పొందింది. పరమేశ్వరుడునై, స్వతంత్రుడనై లోకాలకు ఉపకారం చేసేవాడనైన నేను వెంటనే లీలగా నా కళ్ళు తెరిచి చూసాను. ఆ సమయంలో నాకంటి నుంచి నీటి బిందువులు జారి భూమిమీద పడ్డాయి. అలా జారిన నా కన్నీటి బిందువులే రుద్రాక్ష వృక్షాలుగా జన్మించాయి.

నా కన్నీటి బిందువులు భక్తులకునా అనుగ్రహం కలిగించటం కోసం రుద్రాక్షచెట్లుగా రూపొందాయి. అని చెప్పాడు. అలా రూపొందిన రుద్రాక్షలని శివుడు అన్ని వర్ణాలవారికీ ఇచ్చాడు. శివుడికి అత్యంత ప్రీతికరమైన రుద్రాక్షలు ముందుగా గౌడదేశంలో పుట్టాయి. శివుడు వాటిని మధుర, అయోధ్య, శ్రీలంక, మలయ, సహ్యపర్వతాలు, కాశీక్షేత్రం ఇవిగాక మరో పది క్షేత్రాలలో దొరికేలా చేసాడు. వేదసమ్మతంగా వుండే రుద్రాక్షలు ఎంతో శ్రేష్ఠమైనవి. అవి భయంకరమైన పాపాల్ని సైతం పోగొడతాయి. పవిత్రమైన రుద్రాక్షలు

భూలోకంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు భేదాలతో లభిస్తాయి. వర్ణాలను అనుసరించి రుద్రాక్షలలో తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు అనే నాలుగు రంగులు ఉంటాయి. మానవులు వీటిలో తమకు అనువైన రంగు కలిగిన రుద్రాక్షలని ధరించాలి. భక్తిని, ముక్తిని కోరుకునేవారు శివపార్వతుల అనుగ్రహం కోసం రుద్రాక్షలని ధరించాలి.

ధాత్రీఫలప్రమాణం యచ్ఛ్రేష్ఠమేత దుదాహృతమ్ ।
బదరీఫలమాత్రంతు మధ్యమం సంప్రకీర్తితమ్ ॥
అధమం చణమాత్రం స్యాత్ప్రక్రియైషాపరోచ్యతే ।
శృణుపార్వతి సుప్రీత్యా భక్తానాం హితకామ్యయా ॥ *(శ్లో॥14-15)*

ఓ పార్వతీ భక్తుల హితంకోరి చెబుతున్నా విను పెద్ద ఉసిరికాయంత పరిమాణంలో వున్న రుద్రాక్ష ఉత్తమమైనది. రేగిపండు ప్రమాణంలో ఉండేది మధ్యమమైనది. సెనగ గింజ ప్రమాణంలో ఉండేది అధమమైనదిగా భావించాలి. అయితే మరొక విధంగా కూడా రుద్రాక్ష పరిమాణం గురించి చెప్పవచ్చు. రేగిపండు ప్రమాణంలోని రుద్రాక్ష సుఖ సౌభాగ్యాల్ని ప్రసాదిస్తుంది. ఉసిరికాయ ప్రమాణంలో ఉన్న రుద్రాక్ష భక్తుల కష్టాలనన్నీ తొలగిస్తుంది. అలాగే గురువింద కొలతతో వుండే రుద్రాక్ష అన్ని పనుల్నీ సిద్ధింపచేస్తుంది. రుద్రాక్ష ఎంత చిన్నదిగా వుంటుందో, అంత అధికఫలాన్ని ప్రసాదిస్తుంది. అల్ప ప్రమాణంలో ఉండే రుద్రాక్ష క్రమంగా అధిక ప్రమాణం కలిగిన దానికన్నా పదిరెట్లు ఎక్కువ ఫలితాన్నిస్తుంది. రుద్రాక్ష ధారణ సకల పాపహరణం కాబట్టి అందరూ రుద్రాక్షను ధరించాలి.

ఓ శివానీ! లోకంలో రుద్రాక్షలు ఇచ్చిన శుభఫలితాలని మరే ఇతర మాలలు ఇవ్వలేదు. ఇచ్చినట్టు కలబడటంలేదు. దేవీ! సమానమైన పరిమాణంలో ఉండి, మృదువైనవిగా, గట్టివిగా, పెద్దవిగా, కంటకాలతో కూడుకొని వున్న రుద్రాక్షలు అన్ని రకాల శుభాలనీ కలిగించి భుక్తిని, ముక్తిని ప్రసాదిస్తాయి. పురుగులు పట్టినవి, పగిలినవి, విరిగినవి, కంటకాలులేనివి

వ్రణాలు ఉన్నవి, వృత్తాకారంగా లేనివి అనే ఆరు రకాల రుద్రాక్షలు ధరించటానికి పనికిరావు. సహజంగా రంధ్రం ఉన్న రుద్రాక్షలు ఉత్తమమైనవి. మనుషులు రంధ్రాన్ని చేసినవి మధ్యమమైనవి. రుద్రాక్షలను ధరిస్తే మహాపాపాలన్నీ నశిస్తాయి. పదకొండు వందల (1100) రుద్రాక్షలను ధరించేవాడు సాక్షాత్తు రుద్ర స్వరూపుడవుతాడు. ఇలా పదకొండు వందల రుద్రాక్షలను ధరించటం వల్ల వచ్చే ఫలితాన్ని వర్ణించటానికి వందలాది సంవత్సరాల కాలం కూడా సరిపోదు. ఐదువందల ఏభై (550) రుద్రాక్షలతో కిరీటాన్ని తయారుచేసి దాన్ని శివభక్తుడైనవాడు ధరించాలి. అలాంటి భక్తుడే గొప్పవాడు. అలాగే నిజమైన శివభక్తుడు మూడువందల అరవై(360) రుద్రాక్షలని మూడు పేటలుగా చేసి యజ్ఞోపవీతంగా ధరించాలి.

ఓ పార్వతీ! శిఖలో మూడు రుద్రాక్షలు అలాగే ఒక్కొక్క చెవికి ఆరు రుద్రాక్షలు, కంఠం మీద నూట ఒకటి (101) బాహువులకి, మోచేతులకి, మణి కట్టుకి ఒక్కొక్కదానికి పదకొండు రుద్రాక్షలు, యజ్ఞోపవీతంలో మూడు రుద్రాక్షలు శివభక్తుడైనవాడు తప్పక ధరించాలి. అంతేకాక నడుము దగ్గర సమానమైన పరిమాణం కలిగిన అయిదు రుద్రాక్షలు పెద్దవి ధరించాలి. ఓ దేవీ! ఈవిధంగా నేను చెప్పిన సంఖ్యలో రుద్రాక్షలని శరీరం మీద ధరించినవాడు సాక్షాత్తు నాలాగా అందరిచేతా పూజించబడేవాడవుతాడు. ఈవిధంగా రుద్రాక్షలను ధరించి శివనామాన్ని నిరంతరం జపించే భక్తుడిని చూస్తేనే పాపాలన్నీ నశించిపోతాయి. ఇప్పటిదాకా నీకు పదకొండువందల (1100) రుద్రాక్షలను ధరించే విధానాన్ని గురించి వివరించాను. ఇప్పుడు రుద్రాక్షలు ధరించే మరొక విధానాన్ని గురించి కూడా చెప్తున్నాను. మానవుడు తన శిఖమీద ఒకటి (1) శిరస్సుమీద పన్నెండు(12) భుజస్కందాలు రెండిటి మీద ఐదువందల (500) చొప్పున రుద్రాక్షలని ధరించాలి. అలా ధరించిన భక్తుడిని మానవులే కాదు దేవతలంతా నమస్కరిస్తారు. అలాంటి వాడు సాక్షాత్తు రుద్రుడుగా కీర్తించబడతాడు.

మరొక విధంగా శిఖలో ఒకటి (1) తలమీద నలభై (40) కంఠంమీద ముప్పై రెండు (32) వక్షస్థలం మీద నూటఎనిమిది(108) ఒక్కొక్క చెవికి ఆరు (6) ఒక్కొక్క బాహువుకి పదహారు (16) ఒక్కొక్క చేతికి ఇరవై నాలుగు (24) చొప్పున రుద్రాక్షలని ధరించిన మానవుడు కూడా శ్రేష్ఠమైన శైవుడుగా ప్రసిద్ధి చెందుతాడు. అతన్ని కూడా అందరూ శివుడిగా భావించి నమస్కరించి పూజిస్తారు. శిరస్సుమీద రుద్రాక్షలని ధరించేడప్పుడు ఈశాన మంత్రాన్ని పఠించాలి. అదేవిధంగా చెవులమీద ధరించేడప్పుడు తత్పురుష మంత్రాన్ని, కంఠం మీద ధరించే డప్పుడు అఘోరమంత్రాన్ని, హృదయం మీద ధరించేడప్పుడు కూడా అఘోర మంత్రాన్నే పఠించి రుద్రాక్షలు ధరించాలి. ఇక రెండు చేతుల మీద రుద్రాక్షలని ధరించే సమయంలో కూడా అఘోరమంత్రాన్నే వినియోగించాలి. ఉదరం మీద పదిహేను రుద్రాక్షల మాలను ధరించేడప్పుడు 'వామదేవ' మంత్రాన్ని పఠించాలి. ఆ తరువాత అంగ సహితంగా ఓంకారాన్ని అయిదుసార్లు జపించి, మూడు, అయిదు, లేక ఏడుమాలల్ని ధరించాలి. లేదా పంచాక్షరీ మంత్రం చదువుతూనే రుద్రాక్షలనన్నిటినీ ధరించవచ్చు.

రుద్రాక్షలను ధరించే వ్యక్తి మద్యాన్ని, మాంసాన్ని, వెల్లుల్లిని, నీరుల్లిని, మునగకూరని, విరిగిచెట్టుకూరని, పందిమాంసాన్ని తినకూడదు.

మద్యం మాసంతు లశునం పలాండుం శిగ్రుమేవ చ ।
శ్లేష్మాతకం విడ్వరాహం భక్షణే వర్జయేత్తతః ॥

తెల్లని రుద్రాక్షల్ని బ్రాహ్మణులు మాత్రమే ధరించాలి. ఎర్రని రుద్రాక్షలని క్షత్రియులే ధరించాలి, పచ్చని రుద్రాక్షలని వైశ్యులు నిత్యం ధరించాలి. అలాగే శూద్రులు నల్లని రుద్రాక్షల్ని ధరించాలి. ఓదేవీ! నేను చెప్పిన ఈ విధానం వేద విహితమైనది. అది ధర్మప్రదమైన మార్గం.

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థంలో వున్నవాడు, సన్న్యాస దీక్షలో వున్నవాడు నియమపూర్వకంగా రుద్రాక్షలని ధరించాలి. రుద్రాక్షలు లేకుండా ఎప్పుడూ ఉండకూడదు. ఇలా రుద్రాక్షలని ధరించే భాగ్యం అవకాశం పూర్వజన్మ

పుణ్యం చేతనే లభిస్తుంది. రుద్రాక్షను ధరించని మానవులు సమస్త నరకబాధలు పొందుతారు. ముందుగా ఉసిరికాయ ప్రమాణంలో వుండే రుద్రాక్షని ఆ తరువాత వాటికంటే చిన్నవాటిని ధరించాలి. రోగగ్రస్థమైనవి, పుచ్చిపోయినవి, పురుగులు పట్టినవి సూది గుచ్చటానికి తగినంత రంధ్రంలేనివి అయిన రుద్రాక్షలని శుభాన్ని కోరుకునే భక్తుడు ధరించకూడదు. చిక్కుడు గింజంత ప్రమాణంలో వుండే రుద్రాక్ష ఎంతో ప్రశస్తమైనది.

ఇలా లోకంలో త్రిపుండ్రాలు ధరించేవారు, జటల్ని ధరించేవారు, రుద్రాక్షమాలని ధరించేవారు యమలోకాన్ని చేరరు. ఒక రుద్రాక్షని తలపై ధరించి, లలాటం మీద త్రిపుండ్రాలని ధరించి, పంచాక్షరీ మంత్రాన్ని జపిస్తూ జీవించే మానవులు సాధువులు, సత్పురుషులు, వారిని అందరూ సదా పూజించాలి. పూర్వం యమధర్మరాజు “ఎవరి శరీరం మీద రుద్రాక్షలు లేవో, ఎవరి లలాటం మీద త్రిపుండ్రాలు లేవో, ఎవడు పంచాక్షరీని జపించటంలేదో, అలాంటి వారిని యమపురికి తీసుకురండి, భస్మాన్ని, రుద్రాక్షల్ని ధరించే మానవులు గొప్పవారు, పుణ్యాత్ములు, వారిని ఎప్పుడూ యమనగరానికి తీసుకురాకండి” అని తన కింకరులని ఆదేశించగా వాళ్ళంతా ఎంతో ఆశ్చర్యాన్ని పొందారట. ఓ పార్వతీ! పాపాత్ముడైనప్పటికీ ఎవడు రుద్రాక్ష ధరిస్తాడో వాడు నాకు ప్రీతిపాత్రుడు. చేతులమీద, బాహువులమీద, శిరస్సు మీద రుద్రాక్షలని ధరించే భక్తుడు సర్వప్రాణులకీ ఆరాధ్యుడుగా, రుద్రుడిగా భూలోకంలో సంచరిస్తాడు. అలాంటివాడు దేవతలకు, మానవులకు, రాక్షసులకు సర్వదా నమస్కరించదగినావుడ. పూజించదగినవాడు అటువంటి వాడిని దర్శిస్తే శివుడిని దర్శించిన ఫలితం లభిస్తుంది. ధ్యానం, జ్ఞానం లేని వాడైనప్పటికీ రుద్రాక్షని ధరించే మానవుడు పాపాలన్నిటి నుంచీ విముక్తి పొంది, మోక్షాన్ని పొందుతాడు.

రుద్రాక్షమాలతో జపం చేస్తే ఆ మంత్ర జపం కోటిరెట్లు ఫలితాన్నిస్తుంది. రుద్రాక్షలు ధరించి జపాన్ని చేసే మానవుడు పదికోట్లరెట్లు అధికమైన ఫలితాన్ని పొందుతాడు. ఎవరి శరీరం మీద రుద్రాక్ష వుంటుందో, అది ఉన్నంతకాలం

అతడిని అకాల మృత్యువు కబళించదు. త్రిపుండ్రాలని ధరించి రుద్రాక్షలతో ప్రకాశించే భక్తుడిని చూస్తే శివదర్శన ఫలం లభిస్తుంది. రుద్రాక్షమాలతో మంత్రజపాన్ని చేసే భక్తుడు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశాన, సదాశివులకే కాక అందరు దేవతలకీ ఎంతో ప్రీతి పాత్రుడవుతాడు. విష్ణువు మరిఇతర దేవతల భక్తులు కూడా రుద్రాక్షలని ధరించవచ్చు అనటంలో ఎలాంటి సందేహం లేదు. శివభక్తులు మాత్రం ప్రత్యేక శ్రద్ధతో రుద్రాక్షలని ధరించాలి. ఎంతో పవిత్రమైనవైన రుద్రాక్షలు ఎన్నో రకాలున్నాయి. భక్తిని ముక్తిని ఇచ్చే రుద్రాక్షల గురించి వివరాలని చెప్తున్నాను శ్రద్ధతో విను.

**1.ఏకముఖి రుద్రాక్ష :-** ఇది సాక్షాత్తు శివ స్వరూపమైనది. ఇది భుక్తిని, ముక్తిని, ఇంకా ఎన్నో శుభఫలితాలనిస్తుంది. దాన్ని చూస్తేనే సకల పాపాలూ నశిస్తాయి. బ్రహ్మ హత్యాదోషం కూడా తొలగిపోతుంది. ఈ రుద్రాక్షని పూజించే స్థలంలో సంపదలు విలసిల్లుతాయి. ఉపద్రవాలు కష్టాలు తొలగిపోయి కోరిన కోరికలు తీరుతాయి.

**2.ద్విముఖి రుద్రాక్ష :-** ఇది సర్వశ్రేష్ఠమైనది. అదికూడా అన్ని కోరికల్ని తీరుస్తుంది. గోహత్యాపాపాన్ని కూడా పోగొడుతుంది.

**3.త్రిముఖి రుద్రాక్ష :-** ఇది సాధనాసంపత్తిని భక్తుడికి కలిగిస్తుంది. దాని ప్రభావంతో సాధకునిలో సకల విద్యలూ స్థిరమైపోతాయి.

**4.చతుర్ముఖి రుద్రాక్ష :-** నాలుగు ముఖాలు కలిగిన రుద్రాక్ష బ్రహ్మ స్వరూపమైనది అది నరహత్యా దోషాన్ని కూడా పోగొడుతుంది. ఆ రుద్రాక్షని దర్శించి స్పర్శించటం వల్ల నాలుగు పురుషార్థాలు సిద్ధిస్తాయి

**5.పంచముఖి రుద్రాక్ష :-** ఇది సాక్షాత్తు రుద్రుడి స్వరూపం. సర్వ సమర్థమైన శక్తి కలిగిన ఈ రుద్రాక్షని కాలాగ్ని అంటారు. ఇది ముక్తిని ఇచ్చి అన్ని రకాల కోరికలనీ తీరుస్తుంది. అంతేకాదు అన్ని రకాల పాపాలనీ తొలగిస్తుంది.

**6.షణ్ముఖి రుద్రాక్ష :-** ఆరుముఖాల రుద్రాక్ష సాక్షాత్తు షణ్ముఖుడి స్వరూపం. ఆ రుద్రాక్షని కుడి భుజం మీద ధరించే మానవుడు బ్రహ్మ హత్యాది పాపాల నుంచి విముక్తి పొందుతాడనటంలో సందేహమే లేదు.

**7. సప్తముఖి రుద్రాక్ష :-** దీనికి మన్మథం అనిపేరు. దీన్ని ధరించే వ్యక్తి దరిద్రుడైనా అన్ని పనులూ చేయగల సమర్థుడవుతాడు.

**8. అష్టముఖి రుద్రాక్ష :-** అష్టవసువుల స్వరూపం. దీనికే భైవరం అనికూడా పేరు. అష్టభైరవుల రూపంగా కూడా చెప్పవచ్చు. దానిని ధరించే మానవుడు పూర్ణాయుర్ధాయాన్ని పొంది శరీరం నశించాక శివలోకానికి చేరతాడు.

**9. నవముఖి రుద్రాక్ష :-** ఇదికూడా భైరవరూపమని, కపిల మహర్షి స్వరూపమని చెప్పబడుతోంది. అంతేకాదు నవరూపాలతో విలసిల్లే దుర్గాదేవి ఈ రుద్రాక్షకి అదిష్ఠాన దేవత అలాంటి నవముఖి రుద్రాక్ష ఎడమచేతిమీద ధరించే మానవుడు సర్వ సమర్థుడు. నాతో సమానమైనవాడవుతాడు. ఇందుకు సందేహం లేదు.

**10.దశముఖి రుద్రాక్ష :-** ఇది సాక్షాత్తు విష్ణుమూర్తి స్వరూపం దానిని ధరించే మానవుల కోరికలన్నీ తీరుతాయి.

**11.ఏకాదశ ముఖి రుద్రాక్ష :-** పదకొండు ముఖాల రుద్రాక్ష ఏకాదశ రుద్రుల స్వరూపం. దాన్ని ధరించే వ్యక్తి అన్ని కార్యక్రమాలలో విజయాన్నే పొందుతాడు.

**12.ద్వాదశ ముఖి రుద్రాక్ష :-** ఇది ద్వాదశ ఆదిత్యుల స్వరూపం ఈ రుద్రాక్షని కేశముల మీద ధరించాలి.

**13.త్రయోదశ ముఖి రుద్రాక్ష :-** పదమూడు ముఖాల రుద్రాక్ష విశ్వేదేవతల స్వరూపం దానిని ధరించిన మానవులు కోరికలు తీరి భోగభాగ్యాలు అనుభవిస్తారు.

**14.చతుర్ధశ ముఖి రుద్రాక్ష :-** పద్నాలుగు ముఖాలు కలిగిన రుద్రాక్ష సాక్షాత్తు పరమశివుడి స్వరూపం దానిని భక్తితో శిరస్సుమీద ధరిస్తే పాపాలన్నీ నశిస్తాయి. ఓ పార్వతీ ఇలా నీకు రుద్రాక్షల భేదాల గురించి వివరించాను. ఇప్పుడు నీకు ఈ పద్నాలుగు రుద్రాక్షల మంత్రాలు చెబుతాను విను.

1.ఏకముఖి –ఓం హ్రీం నమః 2.ద్విముఖ – ఓం నమః 3.త్రిముఖి – ఓం క్లీం నమః 4.చతుర్ముఖి – ఓం హ్రీం నమః 5.పంచముఖి – ఓం హ్రీం నమః 6. షణ్ముఖి – ఓం హ్రీం హుం నమః 7. సప్తముఖి – ఓం హుం నమః 8. అష్టముఖి – ఓం హుం నమః 9. నవముఖి– ఓం హ్రీం హుం నమః 10.దశముఖి – ఓం హ్రీం నమః నమః 11. ఏకాదశ ముఖి – ఓం హ్రీం హుం నమః 12. ద్వాదశ ముఖి – ఓం క్రోం క్షీం రం నమః 13. త్రయోదశ ముఖ – ఓం హ్రీం నమః 14. చతుర్దశ ముఖ – ఓం నమః అనేవి పద్నాలుగు రుద్రాక్షల మంత్రాలు.

సాధకుడైన వాడు భక్తి శ్రద్ధలతో జూదం వంటి వ్యసనాల్ని వదిలేసి, సోమరితనాన్ని పోగొట్టుకుని మంత్రపూర్వకంగా రుద్రాక్షల్ని ధరించాలి. మంత్రాలు చదవకుండా రుద్రాక్షలని ధరించే మానవుడు పద్నాలుగు ఇంద్రుల కాలం పాటు నరకంలో పడి వుంటాడు. ఇలా మంత్రపూర్వకంగా రుద్రాక్షల్ని ధరించిన మానవుడిని చూస్తే చాలు భూత, ప్రేత పిశాచాలు శాకినీ, డాకినీలు పారిపోతారు. ఎటువంటి ప్రయోగాలు రుద్రాక్షలను ధరించినవాడి మీద ఫలించవు.

రుద్రాక్షమాలినం దృష్ట్వా శివోవిష్ణుః ప్రసీదతి ।
దేవీ గణపతి స్సూర్య స్సురాశ్చాన్యేఽపి పార్వతీ ॥

ఓ పార్వతీ! ఇలా నియమపూర్వకంగా రుద్రాక్ష ధరించిన భక్తుడు. విష్ణువుకి, నాకు, దేవికి, గణపతికి సూర్యుడికి, ఇతర దేవతలందరికీ ఇష్టుడవుతాడు. ఓదేవీ! ఈవిధంగా రుద్రాక్ష గొప్పతనాన్ని మహిమని తెలుసుకుని, ధర్మాన్ని వృద్ధిచేయటం కోసం మంత్ర పూర్వకంగా రుద్రాక్షల్ని ధరించాలి.

ఈ విధంగా శివుడు పార్వతికి భుక్తిని ముక్తిని ప్రసాదించే భస్మరుద్రాక్షల గురించి వివరించాడు. కనుక అందరూ కూడా భస్మ రుద్రాక్ష ధారణ మహాత్మ్యాన్ని తెలుసుకుని వాటిని ధరించి శివపంచాక్షరిని జపించి శివానుగ్రహాన్ని పొందాలి. ఇలా చేసినవారే నిజమైన శివభక్తులు. శివుడికి అత్యంత ప్రీతి పాత్రులు.

# శ్రీ కుబేరుడి చరిత్ర

## కుబేరుడి పూర్వజన్మ వృత్తాంతం :

పూర్వం కాంపిల్యమనే నగరంలో యజ్ఞదత్తుడనే పండితుండేవాడు. వేదవేదాంగాలను పురాణాలను శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించాడు. ఎన్నో రాజసన్మానాలు పొంది గొప్ప పండితుడుగా పేరు పొందాడు. అలాంటి యజ్ఞదత్తుడికి గుణనిధి అనే పేరున్న కుమారుడున్నాడు. వాడికి శాస్త్రోక్తంగా ఎనిమిదో సంవత్సరంలో ఉపనయనాది సంస్కారాలన్నీ యజ్ఞదత్తుడు చేయించాడు. గుణనిధి కూడా, బాల్యంలో ఎన్నో విద్యల్ని అభ్యసించాడు. అయితే అతడికి యవ్వనం వచ్చింది. దుష్ట సావాసాల కారణంగా జూదరయ్యాడు. తల్లి నుంచి ధనాన్ని తీసుకొచ్చి జూదాలాడేవాడు. క్రమంగా ఆచార వ్యవహారాలన్నీ వదిలేసాడు. చివరికి వేదాలు చదివే సాటి బ్రాహ్మణుల్ని కూడా నిందిస్తూ వారిని కించపరిచేవాడు. ఇలా జూదరిగా వ్యభిచారిగా సంచరిస్తున్నాడు గుణనిధి.

పాపం యజ్ఞదత్తుడికి ఈ విషయాలేవీ తెలియవు. ఆయన "మన కుమారుడు కనపడటం లేదేమిటి" అని భార్యని అడిగితే, ఆ ఇల్లాలు పుత్ర ప్రేమతో కొడుకు అకృత్యాలు తెల్సినప్పటికీ వాటిని దాచిపెట్టి, 'ఇదిగో ఇప్పుడే బైటకి వెళ్ళాడండి, వచ్చేస్తాడని' మభ్యపెట్టేది. గుణనిధికి యుక్తవయసు వచ్చిందని గ్రహించిన యజ్ఞదత్తుడు మంచి కుటుంబంలోని కన్యనిచ్చి వివాహం జరిపించాడు. వివాహం జరిగిన తరువాత ఒక రోజు తల్లి గుణనిధిని కూర్చోబెట్టి "నాయనా ! ఇన్నాళ్ళూ నువ్వు ఎన్ని చెడ్డ పనులు చేసినా వాటినన్నిటినీ సమర్థిస్తూవచ్చాను. ఇప్పుడు నీకు వివాహమైంది. ఇక అన్ని వ్యసనాలనీ కట్టిపెట్టు, నీ తండ్రిగారు కోపిష్ఠి. ఆయనకి నీ విషయం తెలిస్తే నిన్ను నన్ను కూడా దండిస్తారు. జాగ్రత్తగా నడుచుకోమని" పరిపరి విధాలుగా హితబోధ చేసింది.

విధి ప్రారబ్ధం వల్ల గుణనిధి వాటిని ఏమాత్రం తలకెక్కించుకోలేదు. ఇంకా వ్యసనాలు పెరిగిపోయాయి. ఇంట్లోని ధనాన్నంతా జూదాలకి, వేశ్యలకి వెచ్చించటం మొదలుపెట్టాడు. ఒక రోజు తన తండ్రి రత్నాల ఉంగరాన్ని జూదానికి తీసుకెళ్ళి తను ఓడిపోయి, గెలిచిన వాడికి సమర్పించాడు.

అది విధి వశాత్తు తండ్రి యజ్ఞదత్తుడి కళ్ళబడింది. జూదగాడి చేతికున్న తన ఉంగరాన్ని గుర్తించిన ఆయన ఇది నీకెవ్వరిచ్చారని గద్దించాడు. ఆ జూదరి గుణనిధి నిత్య వ్యవహారాలన్ని ఆయనకి వివరిస్తూ, "నీ కుమారుడు లాంటి జూదగాడు ఇంకోడు లేడయ్యా స్వామీ ! అతడే మా అందరికీ నాయకుడు. అతి వినయాన్ని నటించి ఇన్నాళ్ళూ నిన్ను మోసం చేసాడు. ముందు నీ కొడుకుని అదుపులో పెట్టుకో" అని దుర్భాషలాడాడు. ఈ మాటలు విన్న యజ్ఞదత్తుడు అవమానంతో ఇంటికి చేరాడు. మనసులో కోపం మండిపోతోంది. భార్యను పిలిచి, నా ఉంగరం నిన్న స్నానం చేసేడప్పుడు పక్కకు తీసి పెట్టాను కదా, దాన్ని తీసుకురా అనడిగాడు. సోమిదేవమ్మకి భయం వేసింది. ఉంగరాన్ని గుణనిధి దొంగిలించాడని గ్రహించింది. అది కప్పి పుచ్చటానికి ఇప్పుడు నేను వంట చేసే పనిలో ఉన్నాను. ఆ ఉంగరాన్ని ఎక్కడో ఏదో గిన్నెలో పెట్టి మర్చిపోయాను. తర్వాత తెచ్చిస్తానని అబద్ధం చెప్పింది.

ఆ మాట విని సహనం నశించిన యజ్ఞదత్తుడు ఓసీ, దుష్టురాలా ! ఇన్నాళ్ళూ నాకు అబద్ధాలు చెబుతున్నావా ? గుణనిధి ఎక్కడికెళ్ళాడని నేను అడిగినప్పుడల్లా ఏదో ఒక అబద్ధం చెప్పావు. అసలు ఇంట్లో ఎన్నో విలువైన ఆభరణాలు, గిన్నెలు, బంగారు వస్తువులు కనబడటం లేదు. ఛీ... ఛీ... నిన్ను దూషించి ఏం లాభం ? వాడు నా కొడుకని చెప్పుకోవటానికే అవమానంగా ఉంది. వాడు ఇవాళ నుంచి నాకొడుకు కాదు. కులక్షేమం కోసం వాడిని ఒదులు కుంటున్నాను. కులభ్రష్టుడైన కొడుకు ఉంటే ఏమి ? లేకపోతే ఏమి? ఈ రోజు నుంచి నిన్ను కూడా విడిచిపెడుతున్నాను అని భార్యను కూడా వదిలేసి మరో వివాహం చేసుకున్నాడు.

ఈ విషయాలన్నీ తెలుసు కున్న గుణనిధి ఇంటి ముఖం చూడలేకపోయాడు. ఊర్లో అప్పులు పెరిగిపోయాయి. ఏం చేయాలో పాలుపోక ఊరు వదిలి అడవుల వెంటబడి కనిపించిన దిక్కుకి ప్రయాణం చెయ్యసాగాడు. అలుపు వచ్చింది. ఒక చెట్టు క్రింద కూర్చుని తనలో అయ్యో ! ఏమిటి విధి ప్రారబ్దం ? పవిత్రమైన వేదపండితులు కుటుంబంలో పుట్టిన నాకు, ఈ వ్యసనాలు ఎలా అలవాటయ్యాయి? ఆకలేస్తోంది. ఎవరిని అడగాలి? ఎవరూ నాకు పరిచయం లేరే ! ఇంటి దగ్గరున్నప్పుడు అమ్మ చక్కగా ఉదయాన్నే మంచి భోజనం పెట్టేది. ఇప్పుడు నా గతి ఏమిటి ? అని తనలో తాను ఆలోచిస్తున్నాడు. అంతలో సాయంత్రం అయ్యింది. చీకటి పడింది. అదే సమయంలో ఒక శివభక్తుడు వివిధ ఆహార పదార్థాలని బుట్టలలో తీసుకుని పరమేశ్వరుడికి నైవేద్యం పెట్టడం కోసం బంధుమిత్రులతో ఆ దారిలో వెళ్తున్నాడు. ఆ రోజు శివరాత్రి ఉదయం నుంచీ ఉపవాసం ఉండి శివుడిని పూజించటానికి బయలుదేరాడు. గుణదత్తుడు కూర్చున్న స్థలానికి కొద్ది దూరంలో ఒక శివాలయం ఉంది. అందరూ ఆ శివాలయానికి వెళ్ళారు. గుణనిధి కూడా వాళ్ళని అనుసరిస్తూ వెళ్ళాడు.

మనసులో ఈ రోజు నా ఆకలి తీరబోతోంది. ఈ శివభక్తులు దేవుడికి నైవేద్యం పెట్టగానే ఆ పదార్థాల్ని దొంగతనంగానైనా తీసుకొని తినాలని భావించాడు. మధుర పదార్థాలు తెచ్చిన శివభక్తుడు దేవాలయంలో అంగరంగ వైభవంగా శివుడికి పూజలు చేసి నైవేద్యాన్ని సమర్పించాడు. ఇలా శివ భక్తుడు చేసిన దివ్యమైన శివపూజని ఆసాంతం చూసాడు గుణనిధి. పూజానంతరం అందరూ భజన చేసి ఆడి, పాడి అలసిపోయి నిద్రపోయారు.

ఇదే అదనుగా గుణనిధి ఆలయంలోకి ప్రవేశించాడు. చీకటిగా ఉంది. ఆహార పదార్థాలు కనిపించలేదు. వెంటనే తన ఉత్తరీయాన్ని చింపి లోపలున్న దీపం ప్రమిదలో వేసి దీపాన్ని వెలిగించాడు. ఆ వెలుగులో నైవేద్యాలు కనిపించాయి. నెమ్మదిగా వాటిని ఆరగించాడు. తృప్తితీరలేదు. కొన్ని ఆహార

పదార్థాలు మూట కట్టుకుని తరువాత తిందామని గబగబా బైటకు పరుగెత్తాడు. గుణనిధి కాలు తగిలి బైటపడుకున్న భక్తులు లేచారు. ఎవరో దొంగ, దొంగని అరిచారు. వాళ్ళల్లో ఒకడు పెద్ద కర్రని గుణనిధి మీద విసిరాడు. ఆ కర్ర దెబ్బకి గుణనిధి నేలపై పడి వెంటనే మరణించాడు.

శరీరం పతనం చెందిన గుణనిధి సూక్ష్మ శరీరం ఆకాశంలోకి ప్రవేశించింది. వెంటనే యమభటులు అతణ్ణి పట్టుకెళ్ళటానికి వచ్చారు. అదే సమయంలో శివగణాలు కూడా అక్కడికి వచ్చాయి. వచ్చిన శివగణం యమభటుతో, "ఓ యమదూతలారా ! వీడు ధార్మికుడు, పుణ్యాత్ముడు ! వీడిని వదలండి. వీడు శిక్షార్హుడు కాదు. వీడి పాపాలన్నీ ఈ రోజుతో నశించిపోయాయని అన్నారు. ఆ మాటలు విన్న యమభటులకి ఆశ్చర్యం వేసింది. అయ్యా, శివగణాల్లారా ! వీడు దుర్మార్గుడు, జూదరి, వ్యభిచారి, ఆచార భ్రష్టుడు, మీరే చూసారుగా, శివుడికి సమర్పించిన నైవేద్యాన్ని కూడా దొంగతనంగా తిన్నాడు. ఇంతకన్నా పాపం ఉందా" చెప్పండన్నారు.

యమకింకరుల మాటలు విన్నశివగణాలు,ఓ కింకరులారా! శివుడి ధర్మం చాలా విచిత్రమైనది. ఈ గుణనిధి ఇప్పటివరకూ ఎన్నో పాపాలు చేసినప్పటికీ, నిన్న రాత్రి తన వంటి మీదున్న వస్త్రంతో శివుడి సన్నిధిలో ఆరిపోతున్న దీపాన్ని వెలిగించాడు. మహాదేవుడికి జరిగిన పూజని ప్రత్యక్షంగా ఆసాంతం చూసాడు. అప్పటిదాకా ఏమీ తినకుండా ఉపవాసం ఉన్నాడు. ఇవి చాలు, అతడు చేసిన పాపాలన్నీ పోవటానికి. ఇక మీరు వెళ్ళండి. మీ ప్రభువుకి ఈ విషయం చెప్పండని గద్దించి, గుణనిధిని తీసుకుని శివలోకానికి వెళ్ళిపోయారు.

ఇలా శివగణాల చేత పరాభవం పొందిన యమభటులు యమధర్మరాజు దగ్గరకి వెళ్ళి జరిగిందంతా చెప్పారు. అదివిన్న ఆయన భటులతో శివగణాలు చెప్పిన మాట నిజమే. ఇకనుంచీ మీరు భూలోకంలో విభూతి ధరించిన వాళ్ళని, శరీరమంతా భస్మాన్ని పూసుకున్న వాళ్ళని, రుద్రాక్షలు ధరించేవారిని, జటాజూటాలు కలిగిన వాళ్ళని, శివుడి వేషంతో సంచరించే వాళ్ళని ఎప్పుడూ యమలోకానికి తీసుకురాకండని చెప్పాడు.

అక్కడ శివగణాల ద్వారా శివలోకానికి వచ్చిన గుణనిధి సుఖ-భోగాలని అనుభవించాడు. అక్కడున్న పార్వతీ పరమేశ్వరుల్ని భక్తిగా ఆరాధించాడు. కొంతకాలం గడిచాక భూలోకంలో కళింగ రాజైన అరిందమునికి కుమారుడుగా జన్మించెను.

కళింగరాజు తన కుమారుడికి దముడు అని పేరు పెట్టాడు. చిన్నప్పటినుంచీ దముడు శివభక్తి పరాయణుడయ్యాడు. తన ఈడు పిల్లలతో శివుడి పూజలు చేసేవాడు. కొంతకాలానికి దముడు రాజయ్యాడు. తన రాజ్యం అంతా శివాలయాలు నిర్మించి శివపూజలు నిరంతరం జరిగేలా చేసాడు. ఎన్నో శివాలయాలకు నిత్య ధూపదీప నైవేద్యాలకు తగిన సౌకర్యాలు, నిధులు అందించాడు. ఇలా ప్రతి ఊరిలో శివాలయాలు నిర్మించి అందులో నిత్యం దీపారాధన జరిగేలా ఏర్పాట్లు చేసాడు. అతని ఆజ్ఞప్రకారం దముడు జీవించి ఉన్నంత వరకూ అన్ని శివాలయాల్లో దీపాలు వెలుగుతూ ఉన్నాయి. చివరికి కాలం చెల్లి దముడు మరణించాడు. జీవితకాలం అంతా శివాలయాల్లో దీపారాధన నిరాటంకంగా చేయించిన కారణంగా మహాపుణ్యం లభించి మరుజన్మలో దిక్పాలకుడైన కుబేరుడుగా ఉత్తమ జన్మని పొందాడు. శతకోటి దీపకాంతులతో ప్రకాశించే అలకాపురికి ప్రభువయ్యాడు. ఇదంతా శివభక్తి మహిమ. ఇక కుబేరుడు ఎలా జన్మించాడంటే !

**కుబేరుడి జన్మవృత్తాంతం :**

పూర్వం పద్మకల్పంలో బ్రహ్మదేవుడి మానసపుత్రుడైన పులస్త్యుడికి విశ్రవసుడనే కుమారుడు జన్మించాడు. ఆ విశ్రవశుడికి వైశ్రవణుడు అనే పుత్రుడు జన్మించాడు. ఇతడే కుబేరుడు. విశ్రవసుడి కొడుకు కాబట్టి వైశ్రవణుడు అని కూడా ఈయన్ని పిలుస్తారు. ఇతనికి కుబేరుడనే పేరు ఎందుకు వచ్చిందంటే... శివభక్తి వల్ల, శివాలయాలలో అఖండ దీపాలు వెలిగించటం వల్ల తనకు ఉత్తమ జన్మ లభించిందని, ఇదంతా శివుడి మహిమేనని తెలుసుకున్న వైశ్రవణుడు. కాశీ నగరానికి వెళ్ళాడు. అక్కడ విశ్వేశ్వరుణ్ణి దర్శించి

ఆ స్వామి అనుగ్రహం కోసం ఏకాగ్రంగా ధ్యానాన్ని చేయటం మొదలు పెట్టాడు. తన శరీరంలో చర్మం ఎముకలు మాత్రమే మిగిలేలా పదివేల సంవత్సరాలు ఘోరమైన తపస్సు చేసాడు.

భోళా శంకరుడికి కరుణ కలిగింది. వైశ్రవణుడిని అనుగ్రహించాలనుకున్నాడు. వెంటనే సతి పార్వతితో సహా వైశ్రవణుడి ముందు ప్రత్యక్షమయ్యాడు.

వత్సా ! లే ఏం వరం కావాలో కోరుకో ! అనుగ్రహిస్తానని పలికాడు శివుడు. ఆ మాటలు విని ఆనందంతో కళ్ళు తెరిచాడు వైశ్రవణుడు. అంతే ! కోటి సూర్యుల కాంతితో మెరిసిపోతున్న పెద్ద ఆకారం కనిపించింది. వెంటనే కళ్ళు మూసుకుని స్వామీ, నీ దివ్య ప్రకాశాన్ని చూడలేను. కనీసం నీ పాదాలు చూసే భాగ్యాన్ని ప్రసాదించు, నిన్ను చూడటమే నాక్కావలసిన వరం ఇంకేమీ అక్కర్లేదన్నాడు. తథాస్తు అని శివుడు అతడి కళ్ళని చేతుల్తో తాకాడు. వైశ్రవణుడు కళ్ళు తెరిచాడు. ముందుగా అతని కళ్ళకి జగదేక మోహన సౌందర్యంతో ఉన్న పార్వతీదేవి కనిపించింది. వెంటనే మనసులో ఇలా భావించాడు. ఎవరీ సౌందర్యవతి ? ఎంత పుణ్యం చేసి ఉంటుంది. సాక్షాత్తు శివుడి పక్కనే నిలబడి ఉంది. ఎంత అందం ? ఎంత వైభవం. ఎంత అదృష్టం అంటూ పదేపదే పార్వతీ దేవినే చూడసాగాడు. ఇలా క్రూరంగా దేవిని చూడటంతో వైశ్రవణుడి ఎడమ కన్ను ఒక్కసారి పగిలిపోయింది. వికృతంగా శరీరం మారిపోయింది. పార్వతీదేవి శివుడితో నాథా ! ఎవరు వీడు ? ఎందుకు నా వైపు వక్రంగా చూస్తున్నాడు. వీడి బుద్ధి నాకు అర్థం కావటం లేదంది. శివుడు అనునయంగా పార్వతితో సతీ ! వీడు దుష్టుడు కాదు. నీకు కుమారుడవుతాడు. నీ దివ్య తేజస్సు చూసి నీ గొప్పతనాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. నీవు అపార్థం చేసుకోవద్దు. అతన్ని క్షమించు అని చెప్పి... ఓ వైశ్రవణా, నీ ఘోరమైన తపోదీక్షని మెచ్చుకుంటున్నాను. నీవు ఈనాటి నుంచి, నవ నిధులకి నాయకుడివవుతావు. యక్షులకి, గుహ్యకులకి ప్రభువువి అవుతావు. కిన్నరులు,

కింపురుషులు కూడా నిన్ను సేవిస్తారు. లోకంలో అందరికీ నీవే ధనాన్ని ప్రసాదిస్తావు. నువ్వంటే నాకు చాలా ఇష్టం. అందుకే నేటి నుంచి నీతో స్నేహాన్ని చేస్తున్నాను. నీ నివాసమైన అలకాపురి దగ్గర్లో హిమగిరి మీద నివసిస్తాను అని వరమిచ్చాడు. పార్వతీ దేవి కూడా వత్సా ! నీవు నన్ను ఈర్ష్యతో చూసావు. కాబట్టి నేటి నుంచీ కుబేరుడువని లోకంలో ప్రసిద్ధి పొందుతావు. నీకు శివుడి మీద భక్తి చిరకాలం ఇలానే ఉండుగాక ! అని వరమిచ్చింది.

దేవేన దత్తా యే తుభ్యం వరాస్సంతు తథైవ తే ।
కుబేరో భవనామ్నా త్వం మమరూపేర్ష్యయా మతా ॥

*(శివ పురాణం;అధ్యా-19,శ్లో॥31)*

ఈ విధంగా పరమేశ్వరుడు పార్వతీ కుబేరుడికి వరాలిచ్చి తిరిగి వెళ్ళారు. ఆ తరువాత కుబేరుడికిచ్చిన మాట ప్రకారం హిమాలయాల్లో ఉన్న కుబేరుడి రాజధాని అలకాపురికి సమీపంలో కైలాస పర్వతాన్ని శివుడు తన నివాసంగా చేసుకున్నాడు. సకల దేవతా గణాలన్నీ కైలాసానికి వచ్చి శివుణ్ణి సేవించారు. తన కోసం వచ్చిన అందర్నీ ఆదరంగా స్వాగతించి వారందరికీ వరాలిచ్చిడు శివుడు. మిత్రుడికిచ్చిన మాటకోసం తన నివాసాన్ని కైలాస నగరానికి మార్చుకున్న పరమేశ్వరుణ్ణి దర్శించి, ఆనంద భాష్పాలతో అభిషేకించి ఎన్నో విధాలుగా స్తుతించాడు కుబేరుడు. పొంగిపోయిన శివుడు కుబేరుణ్ణి తన ప్రక్కన కూర్చో బెట్టుకుని -

తవ ప్రేమ్ణా వశీభూతో మిత్రతాగమనం సఖే ।
స్వస్థానం గచ్ఛ విభయస్సహాయోఽహం సదానఘ ॥

*(శ్లో॥51,శివపురాణం)*

ఓ స్నేహితుడా! కుబేరా! నీ ప్రేమాభిమానాలకి నేనెంతో సంతోషించాను. నీకిచ్చిన మాటకోసం ఇక్కడకి శాశ్వతంగా వచ్చేసాను. నీకు భయం లేదు. నేనెప్పుడూ నిన్ను రక్షిస్తాను. నీవు నీ అలకాపురికి వెళ్ళి హాయిగా పాలన

సాగించు అని ఆశీర్వదించి పంపాడు. ఈ విధంగా కేవలం భక్తికి వశుడైన శివుడు కుబేరుణ్ణి దివ్యంగా అనుగ్రహించి నవ నిధులకి అధిపతిని చేసాడు.

# శ్రీ కాలభైరవ చరిత్ర

పరమశివుడి కాలభైరవ అవతార గాథ శివపురాణంలో వివరంగా మనకి కనిపిస్తుంది. ఇందులో నందీశ్వరుడు సనత్కుమారుడికి కాలభైరవుడి వృత్తాంతాన్ని వినిపిస్తాడు.

**శ్లో॥ భైరవఃపూర్ణరూపోహి శంకరస్యపరాత్మనః ।**
**మూఢాస్తంవై నజానంతి మోహితాశ్శివమాయయా ॥**

(*శివపురాణం శతరుద్రసంహిత అధ్యా॥8–శ్లో॥2*)

భైరవుడు శంకరుడి పూర్ణావతారం. అయితే శివుడి మాయవల్ల ఎవరూ ఆయన గొప్పతనాన్ని తెలుసుకోలేరు. శివుడు తనమాయను తొలగిస్తే తప్ప ఆయన నిజస్వరూపం పరిపూర్ణతత్త్వం అవగతంకాదు. కాలభైరవుడి ఆవిర్భావానికి సంబంధించిన విశేషాలు శివపురాణంతో పాటు కాశీఖండంలోకూడా చెప్పబడ్డాయి.

## శ్రీ కాలభైరవ వృత్తాంతం

పూర్వం ఒకనాడు దేవతలు ఋషులందరూ కలసి మేరుపర్వతం మీద వున్న బ్రహ్మదేవుడి దగ్గరకి ఈశ్వరతత్త్వం తెలుసుకోవాలనివెళ్ళారు. అందరూ కలిసి ఆయన్ని ప్రార్థించి తాము తెలుసుకోవాలనుకున్న విషయాన్ని గురించి ఆయనకి విన్నవించారు. దేవతలమాటల్ని శ్రద్ధగావిన్నాడు బ్రహ్మదేవుడు. అయితే అప్పటికే పరమేశ్వరుడి మాయ ఆయన్ని ఆవరించేసింది. ఆ మాయాప్రభావంతో ఆయనలోని అహంకారం బైటకి వచ్చింది. దర్పంతో కూడిన స్వరంతో దేవతల్ని చూస్తూ "దేవతలారా! ఋషులారా! మీరంతా పరమతత్త్వం గురించి, పరబ్రహ్మను గురించి అడిగారు. మీరెంత అమాయకులు. ఎదురుగావున్న నేనే పరమతత్త్వాన్ని. స్వయంగా జన్మించినవాణ్ణి విధాతని, ఈ జగత్తునంతా సృష్టించేవాడిని.

ఎలాంటిదోషాలు లేని శుద్ధ పరబ్రహ్మని పరమాత్మని నేనే. అసలు ఈ సృష్టిలో నాకంటే గొప్పవాడింకెవరూ లేరు. కనుక మీరంతా అడిగిన ప్రశ్నకు జవాబు రూపాన్ని నేనే అని తెలుసుకోండి" అంటూ ఇలా బ్రహ్మ గర్వంతో మాట్లాడుతున్న సమయంలో.. ఆమాటలు విని దేవతా సమూహంలో వున్న విష్ణువుకి ఆ మాటలు విని ఎంతో కోపం వచ్చింది. అయితే ఆయన్ని కూడా శివమాయ ఆవరించింది. వెంటనే తాను కూడా దర్పంగా బ్రహ్మతో ఇలా అన్నాడు.

"ఓయి బ్రహ్మదేవా! ఎందుకయ్యా! దర్పాలు పలుకుతావు! నీలాంటివాడు అలాంటిమాటలు అనవచ్చునా! అసలు నీకు పరమతత్త్వం గురించి తెలియక ఇలా మాట్లాడుతున్నావు. ఈ సకల సృష్టిని పోషించి, పాలించే నేనే పరమతత్వాన్ని, పరమాత్మని, పురుషోత్తముణ్ణి, సాక్షాత్తు యజ్ఞస్వరూపాన్ని. ఓ బ్రహ్మా... ఈ సృష్టిని నా ఆజ్ఞతోనే నీవు సృష్టిస్తున్నావు. నన్ను తిరస్కరిస్తే ఈ లోకాలేవీ క్షణకాలం కూడా వుండవు." అని అన్నాడు. ఇలా మాయామోహితులైన బ్రహ్మవిష్ణువులిద్దరూ తాము గొప్పంటే తాము గొప్ప అని కొంతసేపు వాదించుకున్నారు. ఇంతలో వారికో ఆలోచనవచ్చి తామిద్దరిలో ఎవరుగొప్పో తెలియచేయమని వేదాల్ని కోరారు. వెంటనే వారి సంకల్పంతో నాలుగువేదాలూ పురుషరూపాన్ని ధరించాయి. ఆకారాన్ని ధరించిన ఆ నలుగురు వేదపురుషులు పరమేశ్వరుడికి నమస్కరించి బ్రహ్మ విష్ణువు అక్కడున్న అందరు దేవతలతో ఇలా అన్నారు.

**శ్లో॥ యదంతస్థానిభూతాని యత్సర్వం ప్రవర్తరే ।**
**యదాహుః పరమం తత్త్వం స రుద్రస్త్వేక ఏవహి ॥**

ముందుగా "సర్వప్రాణులూ ఎవరిలో లీనమైఉన్నాయో ఎవరినుంచి ఈ జగత్తు ఆవిర్భవిస్తుందో ఆ రుద్రుడే పరమత్త్వం" అని ఋగ్వేదపురుషుడు చెప్పాడు.

వెంటనే "ఏ ఈశ్వరుడు అన్ని యజ్ఞాలచేత, యోగాలచేత ఆరాధించ బడుతున్నాడో ఎవరిదయతో మాకు ప్రామాణ్యం లభిస్తుందో అలాంటి సర్వసాక్షి అద్వైత తత్త్వస్వరూపుడు శివుడే" అని యజుర్వేద పురుషుడు పలికాడు.

అంతలో సామవేదపురుషుడు లేచి "ఎవరిచేత ఈ జగత్తనేచక్రం తిప్పబడుతుందో, ఎవర్ని గురించి యోగులంతా ధ్యానిస్తుంటారో, ఎవరి దివ్యతేజస్సుతో జగత్తంతా ప్రకాశిస్తుందో అటువంటి అద్వైత పరబ్రహ్మ పరమేశ్వరుడే" అని చెప్పగా,

"ఏ దేవదేవుడి దయతో భక్తులందరూ ఆయన్ని దర్శించుకోగలుగుతున్నారో, ఎవరు దుఃఖానికి అతీతుడో, అలాంటి నిర్గుణతత్త్వస్వరూపుడే శంకరుడని" అధర్వ వేదపురుషుడు అన్నాడు.

ఈవిధంగా నాలుగువేదాలూ పరమేశ్వరుడే, నిర్గుణ పరబ్రహ్మ, పరమతత్త్వం అని ముక్తకంఠంతో చెప్పినా మాయామోహితులైన బ్రహ్మవిష్ణువులకి తలకెక్కలేదు. అహంకారంతో వేదాలతో వాదానికి దిగారు. "వేదపురుషులారా! మీరు కూడా ఇంత అవివేకంగా మాట్లాడుతున్నారే. మీ జ్ఞానం అంతాఏమైంది. వికృత వేషంలో వుండేవాడు, జటాధారి,దిగంబరుడు. వృషభవాహనుడు, పాముల్ని ధరించేవాడు అయిన శివుడు పరబ్రహ్మఎలా అవుతాడు? సంగరహితమైన భవబంధరహితమైన పరబ్రహ్మ ఎక్కడ? పరమేశ్వరుడెక్కడ?" అని అన్నారు. ఇంతలో శుద్ధబ్రహ్మ స్వరూపమైన ఓంకారం ఆకారాన్ని ధరించి ఎదురుగా నిల్చి, వారితో "ఓ బ్రహ్మ విష్ణులారా! సకల పాప నాశకుడైన రుద్రుడు సర్వేశ్వరుడు సనాతనుడు, ఆదిమధ్యాంత రహితుడు. ఆయన భవబంధరహితుడు. మీరన్నట్టు ఆయన భార్య పార్వతి వేరుకాదు, ఆమె కూడా ఆయనలోనించే ఆవిర్భవించింది కానీ బైటనించిరాలేదు. కనుక పరమేశ్వరుడే 'నిర్గుణపరబ్రహ్మ' అని విస్పష్టంగా చెప్పింది. అయినా వారిద్దరికీ అజ్ఞానం తొలగలేదు. సరిగ్గా అప్పుడే అద్భుతం జరిగింది.

బ్రహ్మ విష్ణువులమధ్య ఒక దివ్యకాంతిపుంజం ఆవిర్భవించింది. కళ్ళు మిరుమిట్లు గొలిపే ఆ మహాకాంతిలో ఒక దివ్యమంగళాకారుడైన పురుషుణ్ణి వాళ్ళిద్దరూ చూసారు. ఎంతో ఆశ్చర్యపోయారు. అంతలో బ్రహ్మదేవుడి అయిదోతల కోపంగా "అసలు ఈ తేజస్సేమిటి? ఆ కనిపించే పురుషుడెవరు?"

అని ఆలోచిస్తుండగా వారిముందు ముక్కంటి, నీలంరంగు శరీరం కలిగి, త్రిశూలాన్ని, ఢమరుకాన్ని ధరించిన చంద్రశేఖరుడు ప్రత్యక్షమయ్యాడు. ఆయన్ని చూసి బ్రహ్మ అయిదో తలతో ఒక్కసారిగా ఫక్కున నవ్వాడు. "ఓయీ! చంద్రశేఖరా నీవా! నీవు నాకు బాగా తెలుసు, ఏంభయపడకు, పూర్వం నువ్వు నా నుదురు నుంచి జన్మించావు. గుర్తుందా పుట్టగానే బాగా ఏడుస్తుండటంతో నేను నీకు 'రుద్రుడ'ని పేరుపెట్టాను. నీవు నాకు కుమారుడివి కనుక నన్ను శరణువేడుకో రక్షిస్తాను" అని గర్వంగా మాట్లాడాడు.

బ్రహ్మ మాటలువిన్న శివుడికి చాలా కోపం వచ్చింది. ఆగ్రహంతో ఆయన భృకుటి ముడిపడింది. ఆ ముడి నుండి వెంటనే భయంకరమైన ఆకారంతో, దివ్యతేజస్సుతో వెలిగిపోతున్న ఒక కాలపురుషుడు ఆవిర్భవించాడు. ఆ మహాపురుషుడు తన సృష్టికర్త అయిన శంకరుడికి భక్తిగా నమస్కరించగా ఎంతో ప్రేమతో శంకరుడు, ఆ కాలపురుషుణ్ణి చూసి ఆనందించి

శ్లో॥ **కాలవద్రాజసే సాక్షాత్ కాలరాజస్తతో భవాన్ ।**
**ప్రాక్చ పంకజ జన్మాసౌ శాస్యస్తే కాలభైరవ ॥**

శ్లో॥ **విశ్వం భర్తుం సమర్థోఽసి భీషణాద్భైరవస్మృతః ।**
**త్వత్తో భేష్యతి కాలో ఽపి తతస్త్వం కాలభైరవ ॥**

ఓయీ! నీవు సాక్షాత్తు కాలుడిలాగా ప్రకాశిస్తున్నావు. కనుక నిన్ను కాలరాజు అని పిలుస్తాను. 'కాలభైరవా' ముందు నువ్వు ఈ బ్రహ్మని దండించాలి. ఈ జగత్తునంతా భరించటానికి నీవు ఎంతో సమర్థుడివి. నిన్ను చూస్తేనే చాలు లోకాలన్నిటికీ భయం కలగుతుంది. కాబట్టి అందరూ నిన్ను 'భైరవు'డని వ్యవహరిస్తారు. నీకు కోపం వస్తే చాలు దుష్టుల్ని వారి దుష్టబుద్ధుల్ని సంహరిస్తావు. కాబట్టి నీకు లోకంలో 'అమర్ధకుడు' అనే పేరు కూడా వస్తుంది. నీ భక్తుల పాపాల్ని నిన్ను శరణుకోరిన మరుక్షణంలోనే భక్షిస్తావు కాబట్టి నీకు 'పాపభక్షు'డనే ఖ్యాతికూడా కలుగుతుంది. నీవు నా పూర్ణావతార స్వరూపుడవు.

ఓ కాలభైరవా! అన్ని నగరాలకన్నా గొప్పది ముక్తినిచ్చేది కాశీనగరం. ఆ కాశీనగరం మీద నీకు సర్వకాలలలో ఆధిపత్యాన్నిస్తున్నాను. నీవు అక్కడ నివసిస్తూ ఆ నగరాన్ని రక్షిస్తూ, పాపాత్ముల్ని దండిస్తూవుండు. అని వరాన్నిచ్చాడు.

పరమేశ్వరుడి ద్వారా! వరాన్ని పొందిన కాలభైరవుడు వెంటనే ఆయన ఆజ్ఞప్రకారం శివుణ్ణి తూలనాడిన బ్రహ్మ అయిదోతలని తన వేలిగోటితో తుంచేసాడు. అయితే ఆ తల కిందపడకుండా కాలభైరవుడి చేతికంటుకుపోయింది. ఈ దృశ్యాన్ని చూసిన విష్ణువు ఎంతో కంగారుపడ్డాడు. భయంతో తన తప్పును తెలుసుకొని వెంటనే శతరుద్రీయ మంత్రాలతో శంకరుణ్ణి భక్తిగా స్తుతించటంతో శివుడు శాంతించాడు.

ఆవిధంగా కాలభైరవుడి దండనతో గర్వరహితులైన బ్రహ్మ విష్ణువులిద్దరికీ పరమేశ్వరుడు అభయాన్ని ప్రసాదించి తిరిగి కాలభైరవుడితో భైరవా! నీ కోపం చాలించు ఈ బ్రహ్మ విష్ణువులిద్దరూ తమ తప్పు తెలుసుకున్నారు. వీరిని మన్నించు. నీవు తుంచిన బ్రహ్మ కపాలం నిన్నంటే ఉంటుంది. ఎందుకంటే బ్రహ్మ హత్యాదోషం నీకంటుకుంది. ఆ దోషనివారణ కోసం 'కపాలవ్రతాన్ని' ఆచరిస్తూ రోజూ బిక్షాటనచేస్తూ, లోకంలో సంచరించు అని అన్నాడు. ఆ సమయంలో బ్రహ్మహత్య ఒక కన్యగా ఆవిర్భవించగా, "భయంకరాకారం కలిగిన ఆ కన్యతో పరమేశ్వరుడు "ఓ బ్రహ్మహత్యా! మహోగ్రస్వరూపుడైన నా కుమారుడు కాలభైరవుడు దివ్యమైన వారాణసీ (కాశీ) నగరాన్ని చేరేంతవరకూ అతన్ని అనుసరించివెళ్ళు. నీకు వారణాసీ నగరంలో తప్ప అన్నిలోకాల్లో ప్రవేశించగలవు. అని చెప్పి, తిరిగి భైరవుడితో "నీవు వారణాసీ ప్రవేశించగానే నీకు 'బ్రహ్మహత్యా' విముక్తి లభిస్తుంది. అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

ఆనాటి నుంచి కాలభైరవుడు శివుడి ఆజ్ఞప్రకారం కపాలాన్ని ధరించి 'కపాలికా వ్రతాన్ని' ఆచరిస్తూ ముల్లోకాలూ సంచరించసాగాడు. దారుణమైన బ్రహ్మహత్య ఆయన్ని అనుసరిస్తూ వెళుతోంది. అలాతిరుగుతూ భైరవుడు ఒకనాడు వైకుంఠానికి వెళ్ళాడు. మహాదేవుడిపూర్ణాంశతో ఆవిర్భవించిన కాలభైరవుణ్ణి విష్ణువు ఎంతో గొప్పగా ఆదరించి, భక్తితో స్తుతించాడు. విష్ణువుస్తుతికి

సంతోషించిన కాలభైరవుడు ఆయనకి వరాలిచ్చి తిరిగి మరోచోటకి బయల్దేరాడు. అలా తిరుగుతూ తిరుగుతూ చివరికి ముక్తి క్షేత్రమైన కాశీనగరంలోకి ప్రవేశించాడు. ఎప్పుడైతే భైరవుడు వారణాసిలో కాలుపెట్టాడో వెంటనే ఆయన్ని అనుసరించి వస్తున్న బ్రహ్మహత్య పాతాళంలోకి పడిపోయింది. ఆ వెంటనే ఆయన చేతిని అంటుకుని వున్న కపాలం ఊడినేలమీద పడి పోయింది. అలా బ్రహ్మ కపాలం నేలమీద పడిన ప్రదేశం "కపాల మోచన తీర్థం" గా ప్రసిద్ధి చెందింది.

**శ్లో॥ కపాలం బ్రహ్మణస్సద్యో భైరవస్యకరాంబుజాత్ ।**
**పపాత భువి తత్తీర్థమభూత్కాపాలమోచనమ్ ॥** (56)

ఎప్పుడైతే తన చేతినుంచి కపాలం ఊడిపడిపోయిందో, వెంటనే భైరవుడికి ఆనందం కలిగింది. బ్రహ్మహత్యాపాపం నుంచి విముక్తి కలిగిందన్న ఆనందంలో ఆయన ఆనంద తాండవం చేసాడు. ఎన్నో లోకాలు తిరిగినా ఎన్నిక్షేత్రాలు దర్శించినా భైరవుడి చేతినుంచి కపాలంక్రింద పడలేదు. కాశీక్షేత్రంలో ప్రవేశించడంతోనే అది ఊడిపడింది కాబట్టి కాశీక్షేత్రం ఎంతో గొప్పది, బ్రహ్మ హత్యాపాపాన్ని కూడా తొలగించేది అయిన కాశీక్షేత్రాన్ని అందరూ దర్శించాలి.

## కపాల మోచన తీర్థం :

**శ్లో॥ కపాలమోచనం కాశ్యాం యస్స్మరే తీర్థముత్తమమ్ ।**
**ఇహాన్యత్రాపియత్పాపం క్షిప్రంతస్య ప్రణస్యతి ॥**

ఎవరైతే కాశీక్షేత్రంలో 'కపాలమోచనం' అనే దివ్యతీర్థం గురించి స్మరిస్తారో వాడు అన్ని పాపాలనుంచీ విముక్తి పొంది ఇహలోకంలో సుఖాన్ని పొందుతారు. మానవులంతా విధిగా ఈ తీర్థంలో స్నానంచేసి, పితృదేవతలకి తర్పణాలిస్తే సకల పాపాలనుంచి విముక్తులవుతారు. ఈ కపాలమోచన తీర్థానికి ఎదురుగానే కాలభైరవుడు కొలువుదీరి భక్తులపాపాల్ని నశింపచేస్తాడు.

**కాలభైరవప్రశస్తి :**

**శ్లో॥ కృష్ణాష్టమ్యాంతు మార్గస్యమాసస్య పరమేశ్వరః ।**
**ఆవిర్భభూవ సల్లీలో భైరవాత్మాసతాం ప్రియః ॥**

**శ్లో॥ మార్గశిర్షా సితాష్టమ్యాం కాలభైరవసన్నిధౌ ।**
**ఉపోష్య జాగరాం కుర్వన్ మహాపాపైః ప్రముచ్యతే ॥** (63–64)

గొప్పలీలా ప్రదర్శకుడైన పరమేశ్వరుడు మార్గశిరమాసంలో కృష్ణపక్ష అష్టమితిథినాడు భైరవుడిగా ఆవిర్భవించాడు. కాలభైరవాష్టమిగా ప్రసిద్ధిచెందిన ఆ పుణ్యతిథినాడు కాలభైరవుడి సన్నిధిలో ఉపవాసంవుండి జాగరణచేస్తే సకల పాపాలు తొలగిపోతాయి. కాలభైరవుడి భక్తులకి ఎవరైనా కీడు తలపెట్టాలని చూస్తే భైరవుడి ఆగ్రహానికి గురై నరకాన్ని చేరతారు.

**శ్లో॥ విశ్వేశ్వరేఽపి యే భక్తానో భక్తాః కాలభైరవే ।**
**తే లభతే మహాదుఃఖం కాశ్యాంచైవ విశేషతః ॥**

**శ్లో॥ వారణాస్యాముషిత్వా యో భైరవం భజేన్నరః ।**
**తస్యపాపాని వర్ధంతే శుక్లపక్షా యాథశనీ ॥** (68–69)

కాశీవిశ్వేశ్వరుడి మీద భక్తివున్నప్పటికీ కాలభైరవుడి మీద ఎవరికి భక్తి ఉండదో వారికి ఎన్నో కష్టనష్టాలు కలుగుతాయి. వారణాసిలో నివసిస్తూ ఎవరైతే కాల భైరవుణ్ణి సేవించరో వారి పాపాలు శుక్లపక్ష చంద్రుడిలా పెరిగిపోతాయి. ఎవరైతే కాశీక్షేత్రంలో కృష్ణపక్ష అష్టమినాడు (మంగళవారం వచ్చిన రోజు) భైరవుణ్ణి పూజించరో వారి పుణ్యం కృష్ణపక్ష చంద్రుడిలా రోజు రోజూ క్షీణిస్తుంది.

**శ్లో॥ శృత్వాఖ్యానమిదం పుణ్యం బ్రహ్మహత్యాపనోదకమ్ ।**
**భైరవోత్పత్తి సంజ్ఞం చ సర్వపాపైః ప్రముచ్యతే ॥**

**శ్లో॥ బంధనాగార సంస్థోఽపి ప్రాప్తోఽపి విపదం పరాం ।**
**ప్రాదుర్భావం భైరవస్యశృత్వా ముచ్యేత సంకటాత్ ॥** (71–72)

కాలభైరవుడి జన్మవృత్తాంతం ఆయన బ్రహ్మహత్యాపాపం నుంచి విముక్తి పొందిన కథనం విన్నవారి పాపాలన్నీ నశించి పోతాయి. కారాగారంలో బంధించబడ్డవాళ్ళు, జీవితంలో ఆపదలు, కష్టనష్టాలు పొందినవాళ్ళు, ఈ కాలభైరవ ఆవిర్భావ గాధని విన్నా చదివినా తమ కష్టాలు నుంచి విముక్తి పొందుతారు.

ఈ విధంగా కాలభైరవుడి ఆవిర్భావం. ఆయన బ్రహ్మహత్యాపాపం తొలగిన వైనం కాశీలో కపాల మోచనతీర్ధం ఏర్పడటం, శ్రీకాలభైరవుడి పూజ, సాధనవల్ల లభించే ఫలితం గురించి శివపురాణం ఎంతో విశేషంగా చెబుతుంది.

## పరమేశ్వరుడి పంచావతారాలు

లోక కల్యాణం కోసం పరమేశ్వరుడు ఎన్నో అవతారాలు ధరించాడు. వాటిలో ప్రధానమైనవి అయిదు అవతారాలు. 1.సద్యోజాతుడు 2.వామదేవుడు 3.అఘోరుడు 4.తత్పురుషుడు 5.ఈశానుడు అనేవి.

**1.సద్యోజాతవతారం :** కల్పాలలో పంతొమ్మిదో కల్పానికి శ్వేతలోహిత కల్పమని పేరు. ఈ కల్పంలోనే పరమేశ్వరుడి సద్యోజాతావతారం ప్రకటితమైంది. ఈ కల్పంలో ఒకనాడు పరబ్రహ్మని గురించి ధ్యానం చేస్తున్న బ్రహ్మదేవుడి నుంచి, శిఖను ధరించి, తెలుపు, ఎరుపు రంగుతో ప్రకాశించే ఒక కుమారుడు పుట్టాడు. బ్రహ్మదేవుడు ఆ పురుషుణ్ణి చూసి ఆతడే పరబ్రహ్మ అని గుర్తించాడు. జగత్ప్రభువైన ఆసద్యోజాతుడికి నమస్కరించి భక్తిగా స్తుతించటం ప్రారంభించాడు. ఆయనలా ధ్యానిస్తూ ఉండగానే తెల్లటి వర్ణంతో ప్రకాశిస్తూ కీర్తిమంతులు, జ్ఞానులు అయిన పరబ్రహ్మరూపులైన కుమారులు నలుగురు ఆవిర్భవించారు. వారి 1.సనందుడు 2.నందనుడు 3.విశ్వనందుడు 4.ఉపనందుడు అనేవాళ్ళు. వీరు నలుగురూ బ్రహ్మదేవుడికి శిష్యులుగా మారిపోయారు.

**2.వామదేవావతారం :** ఇరవయ్యో కల్పాన్ని రక్తకల్పం అంటారు. ఈ కల్పంలో బ్రహ్మదేవుడు ఎరుపు రంగుతో ప్రకాశిస్తూ ఉంటాడు. ఒకనాడు

బ్రహ్మదేవుడు పుత్రుడి కోసం ధ్యానం చేస్తుండగా, ఎర్రటిమాలని, ఎర్రటి వస్త్రాలని, ఎర్రటి ఆభరణాలని ధరించి, ఎర్రటి కళ్ళతో వెలుగొందుతున్న ఒక పుత్రుడు జన్మించాడు. బ్రహ్మదేవుడు ఆ రక్తవర్ణ పురుషుణ్ణి చూసి, ఆయనే వామదేవమూర్తి అని గ్రహించి, భక్తిగా నమస్కరించాడు. తరువాత ఆ వామదేవుడికి 1.విరజసుడుడు 2.వివాహుడు 3.విశోకుడు 4.విశ్వభావనుడు అనే పుత్రులు ఉదయించారు. వీరంతా ఎర్రటి వస్త్రాలు ధరించారు. వామదేవుడినించి వచ్చిన ఆ నలుగురూ బ్రహ్మకు శిష్యులు కాగా, వామదేవుడు బ్రహ్మని అనుగ్రహించి, దివ్యజ్ఞానాన్ని సృష్టిచేసే సామర్థ్యాన్ని ప్రసాదించాడు.

**3.తత్పురుషావతారం :** ఇరవైఒకటో కల్పాన్ని 'పీతవాస' కల్పం అంటారు. ఈ కల్పంలో బ్రహ్మదేవుడు పచ్చని వస్త్రాలు ధరించి పుత్రుడు కోసం తపస్సు చేయటం ప్రారంభించాడు. అప్పుడాయనకి, గంభీరంగా, గొప్ప తేజస్సుతో నిండిన కుమారుడుద్భవించాడు. అతడు కూడా పచ్చటి వస్త్రాల్నే ధరించాడు. ధ్యానం నుంచి మేలుకున్న బ్రహ్మ ఆ పురుషుణ్ణి చూసి అతన్ని తత్పురుషుడుగా గుర్తించాడు. వెంటనే భక్తితో ఆ మహాపురుషుడికి నమస్కరించి శంకర గాయత్రీ మంత్రాన్ని జపించటం ప్రారంభించాడు.ఆవిధంగా మంత్రజపం చేస్తున్న బ్రహ్మని చూసి తత్పురుషుడు ప్రసన్నమయ్యాడు. కొద్దిసేపటికి తత్పురుషుడి శరీరం నుంచి పచ్చటివస్త్రాలు ధరించి ఇద్దరు పుత్రులు ఆవిర్భవించారు. వారిద్దరూ యోగమార్గాన్ని అనుసరించారు.

**4.అఘోరావతారం :** ఇరవైరెండో కల్పానికి 'శివం' అనిపేరు. ఈ కల్పంలో బ్రహ్మదేవుడు ప్రజాసృష్టిచేయాలని సంకల్పించాడు. అయితే ఎలా చేయాలో తెలియక దుఃఖిస్తూ ఉంటే అదే సమయంలో నల్లటి రంగుతో నల్లటి వస్త్రాన్ని, ఆభరణాల్ని, యజ్ఞోపవీతాన్ని దండాన్ని ధరించి కిరీటంతో ప్రకాశించే ఒక మహాపురుషుడు ఆవిర్భవించాడు. ధ్యాననిమగ్నుడైన బ్రహ్మ ఆ మహాపురుషుణ్ణి పరమేశ్వరుడి అఘోరావతారంగా గుర్తించాడు. వెంటనే రెండు చేతులూ ఎత్తి ఆయనకి నమస్కరించగా, అఘోరుడి శరీరం నుంచి నల్లటి వర్ణంతో ప్రకాశించే నలుగురు పుత్రులు ఉద్భవించారు. వారే 1.కృష్ణుడు 2.కృష్ణశిఖుడు 3.కృష్ణాస్యుడు

4.కృష్ణకంఠుడనేవారు. ఈ నలుగురూ బ్రహ్మకి శిష్యులై అనంతర కాలంలో అద్భుతమైన అఘోర యోగాన్ని లోకంలో ప్రవర్తింపచేసారు.

**5.ఈశానావతారం :** ఇరవైమూడో కల్పాన్ని విశ్వరూపకల్పం అంటారు. ఈ కల్పంలో పుత్రుడి కోసం బ్రహ్మదేవుడు తపస్సు చేస్తుండగా, ఒకనాడు విశ్వనాదంతో కూడిన సరస్వతీ దేవి ఆవిర్భవించింది. కొద్ది సేపటికి స్వచ్ఛమైన స్ఫటికంలా ప్రకాశిస్తూ ఈశానుడు ఆవిర్భవించాడు. తెల్లటి కాంతితో వెలిగిపోతున్న ఈశానమూర్తికి బ్రహ్మ భక్తితో నమస్కరించి దివ్యంగా స్తుతించటం ప్రారంభించాడు. అంతలో ఆ మూర్తి నుంచి మంగళ స్వరూపులైన 1.జటి 2.ముండి 3.శిఖండి 4.అర్ధముండి అనే నలుగురు పుత్రులుదయించారు. ఆ నలుగురూ యోగమార్గాన్ని అనుసరించి సద్గతుల్ని పొందారు.

## పరమేశ్వరుడి అష్టమూర్తులు

అన్నిలోకాలకీ మేలు చేసేలా పరమేశ్వరుడు ఎనిమిది రూపాల్ని ధరించాడు. వీటినే అష్టమూర్తులంటారు. దారంలో మణుల్లాగా ఈ ప్రపంచమంతా అష్టమూర్తి రూపుడైన పరమేశ్వరుడిలో ప్రతిష్ఠితమై ఉంది.

తస్యశంభోః పరేశస్య మూర్త్యష్టక మయంజగత్ ।
తస్మిన్ వ్యాప్య స్థితం విశ్వం సూత్రేమణి గణాఇవ ॥
శర్వో భవ స్తథా రుద్ర ఉగ్రో భీమః పశోః పతిః ।
ఈశానాశ్చ మహాదేవో మూర్తయశ్చాష్ట విశ్రుతాః ॥

*(శతరుద్ర సంహిత శ్లో॥2-3,అధ్యా-2)*

1.శర్వుడు 2.భవుడు 3.రుద్రుడు 4.ఉగ్రుడు 5.భీముడు 6.పశుపతి 7.ఈశానుడు 8.మహాదేవుడు అనేవారు అష్టమూర్తులు

**1.శర్వుడు :** ఈ మూర్తిచేత క్రమంగా భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అనే పంచభూతాలు, క్షేత్రజ్ఞుడు(జీవుడు)సూర్య, చంద్రులు అధిష్టించబడి ఉన్నారు.

**2.భవుడు :** ఈ మూర్తి జలరూపంలో సకల ప్రాణుల్నీ నిలబెడుతుంటాడని మహర్షులు చెబుతారు.

**3.రుద్రుడు :** మంగళకరమైన ఈ రుద్రుడి చేత స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచమంతా నిలిచి వుంది. తనలో ఉన్నలోకాల్ని, తానే లయం చేస్తాడు.

**4.ఉగ్రుడు :** పాపులకి భయంకరుడు, పుణ్యాత్ములకి శరణం ప్రసాదించేవాడు అంతటా నిండి క్రియా రూపంలో ఈ విశ్వాన్నంతా భరిస్తున్నవాడు.

**5.భీముడు :** సర్వత్రా వ్యాపించినవాడు, ఆకాశ రూపంలో భయంకరమైన ఆకారం కలిగినవాడు ఈ భీమమూర్తి.

**6.పశుపతి :** ఆత్మకి అధిష్ఠాన క్షేత్రంగా ఉండేది, అందరి దేహాల్లో నివసించేది, జీవుల సంసారబంధాల్ని నశింపచేసేది అయిన దివ్యస్వరూపమే పశుపతి మూర్తి.

**7.ఈశానుడు :** సూర్యుడి రూపంలో ఈ ప్రపంచాన్నంతా ప్రకాశింపచేస్తూ 'ద్యు' లోకంలో ఉండేమూర్తి ఈశానమూర్తి.

**8.మహాదేవుడు :** చంద్రుడి రూపంలో అమృత కిరణాల్ని భూమిమీదకి వెదజల్లి, జీవులందరికీ, తుష్టిని, పుష్టిని, కలిగిస్తాడు ఈ మహాదేవుడి మూర్తి.

చెట్ల మొదట్లో నీళ్ళు పోస్తే ఎలా కొమ్మలకి పుష్టి కలుగుతుందో అలాగే పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తే ఆయన శరీరం అయిన ఈ ప్రపంచానికి పుష్టి లభిస్తుంది. ఈ జగత్తుమొత్తం ఆనందిస్తే శివుడు కూడా ఎంతో సంతోషిస్తాడు. లోకంలో ఏ ప్రాణికైనా అపకారం చేస్తే అది శివద్రోహం చేసినట్టే అవుతుంది. ఎందుకంటే సకల ప్రాణుల్లో ఉన్నది ఆయనే కదా!

ఈవిధంగా అష్టమూర్తులతో ఈ ప్రపంచాన్నంతా అధిష్ఠించి ఉన్నవాడుగా, మంగళ స్వరూపుడుగా, సర్వకారణ కారణుడుగా వున్నవాడు ఆరుద్రుడే అని గ్రహించి, అదేభావంతో శివుణ్ణి ధ్యానించాలి.

## అర్ధనారీశ్వర రూపం

పూర్వం పరమేశ్వరానుగ్రహంతో బ్రహ్మ సృష్టి చేయటం ఆరంభించాడు. అలా చాలాకాలం సృష్టి కొనసాగించాడు. అయితే ఎంత కాలం గడిచినా ఆయన అనుకున్నంతగా సృష్టి వృద్ధి చెందటం లేదు. ఆకారణంగా ఆయనకెంతో

దుఃఖం కలిగింది. ఎం చేయాలా అని ఆలోచిస్తున్నంతలో ఆకాశవాణి ఇలా పలికింది. "బ్రహ్మదేవా! స్త్రీ పురుష సమాగమం ద్వారా పుట్టే సృష్టిని చేయి" అన్నది. ఆమాటవిని బ్రహ్మ మిథున సృష్టిచేయాలని సంకల్పించాడు. అయితే శంభుడి అనుగ్రహం లేకుండా ఈ సృష్టి చేయటం అసంభవం అని గ్రహించి బ్రహ్మ ఆయన కోసం తపస్సు చేయటం ప్రారంభించాడు. ఆయన చేసిన కఠోరమైన తపస్సుకి ప్రసన్నమైన శివుడు ఒక శుభ ముహూర్తంలో

తతః పూర్ణచిదీశస్య మూర్తి మావిశ్య కామదామ్ ।
అర్ధనారీనరో భూత్వాతతో బ్రహ్మాంతికం హరః ॥ *(శ్లో॥8,అధ్యా-3)*

పరిపూర్ణ చిత్స్వరూపుడైన ఈశ్వరుడు సకల కోరికల్నీ తీర్చే రూపంలో ప్రవేశించి సగం పురుషుడు, సగం స్త్రీతో ఉన్న అవతారాన్ని ధరించి బ్రహ్మ ముందు ప్రత్యక్షమయ్యాడు. ఆవిధంగా శక్తితో కూడిన శంకరుణ్ణి చూసి బ్రహ్మ సాష్టాంగ నమస్కారం చేసి దివ్యంగా స్తుతించాడు. సర్వేశ్వరుడైన ఆ అర్ధనారీశ్వరుడు బ్రహ్మ భక్తికి సంతోషించి గంభీరస్వరంతో ఇలా అన్నాడు.

"వత్సా! విధాతా! నీవు నా కుమారుడివి. నీమనసులో ఉన్న కోరిక ఏదో నాకు తెలుసు. ప్రజాసృష్టి మరింత వృద్ధి చెందాలనే ఆకాంక్షతోనే ఈ తపస్సుచేశావు. నీకోరిక తప్పకుండా నెరవేరుతుంది" అని పలికి వెంటనే తన శరీరం సగభాగంలో ఉన్న పార్వతీదేవిని వేరుచేసాడు. అలా పరమేశ్వరుడి నుంచి వేరు చేయబడ్డ పార్వతీదేవిని చూసి బ్రహ్మఎంతో ఆశ్చర్యపోయి ఆమెనిలా స్తుతించాడు.

"అమ్మా! భవానీ! ఈ సృష్టి మొదట్లో నీ భర్త పరమేశ్వరుడు నన్ను సృష్టించాడు. దేవదేవుడైన ఆ పరమాత్మే ఈ ప్రజలందర్నీ శాసిస్తున్నాడు. అమ్మా! పార్వతీ! నేను సకల దేవతల్నీ నా మనో సంకల్పంతోనే సృష్టించాను. నేను ఎంతచేసినా సృష్టి వృద్ధిచెందటంలేదు. ఇకమీద స్త్రీ పురుష సంయోగాత్మకమైన సృష్టిని కొనసాగించి ప్రజల్ని వృద్ధి చేయాలని కోరుకుంటున్నాను. పూర్వం నీ

నుంచి నాశనం లేని స్త్రీ సమూహం ఆవిర్భవించలేదు. నాకలాంటి స్త్రీ సమూహాల్ని సృష్టించే శక్తి లేదు. సకల శక్తులూ నీనుంచే ఉద్భవిస్తాయికద తల్లీ! సర్వానికీ ఈశ్వరివైన నిన్ను ప్రార్థిస్తున్నాను.

ఓ దేవీ! శివప్రియే! నాకు స్త్రీ సమూహాల్ని సృష్టించే శక్తిని ప్రసాదించు. నీకు నమస్కారం. అమ్మా! నాకు మరోవరాన్ని కూడా అనుగ్రహించు. స్థావరజంగమాత్మకమైన ఈ సృష్టి వృద్ధి చెందటానికి నీవొక సర్వసమర్థమైన రూపాన్ని ధరించు. అందుకోసం నా పుత్రుడైన దక్షప్రజాపతికి కుమార్తెగా జన్మించు. తల్లీ నీ పాదాలకి నమస్కారం" అని వేడుకున్నాడు.

బ్రహ్మచేసిన ప్రార్థనవిన్న పరాశక్తి పార్వతి "అలాగే నీ కోరిక నెరవేరుతుందిలే!" అని బ్రహ్మని అనుగ్రహించింది. బ్రహ్మకిచ్చిన మాట ప్రకారం వెంటనే తనకనుబొమల మధ్యనుంచి తనతో సమానమైన శక్తికలిగిన ఒక దివ్య స్వరూపిణిని సృష్టించింది. దేవశ్రేష్ఠుడైన శివుడు ఆ శక్తిని చూసి "దేవీ! బ్రహ్మదేవుడు గొప్ప తపస్సుచేసి నన్ను ఆరాధించాడు. నీవతన్ని అనుగ్రహించి ఆయన కోరిన కోరికలన్నీ నెరవేర్చు" అన్నాడు. దివ్య శక్తిని సృష్టించిన జగన్మాత కూడా అదేమాటని నూతన శక్తితో చెప్పి, వెంటనే పరమేశ్వరుడి శరీరంలోకి ప్రవేశించింది. దేవి నుంచి ఆవిర్భవించిన దివ్య శక్తి స్వరూపిణి బ్రహ్మ కోరిక ప్రకారం దక్షుడి కుమార్తె సతీదేవిగా జన్మించింది. ఇక ఆనాటి నుంచీ లోకంలో స్త్రీ విభాగం కల్పించబడింది. ఆనాటి నుంచే స్త్రీ పురుష సమాగమ రూపమైన సృష్టి ప్రారంభమయ్యింది. ఆ విధంగాపరమేశ్వరుడి అర్ధనారీశ్వరావతారం మొదటి సారిగా బ్రహ్మ దేవుడి వల్ల ప్రకటితమయ్యింది.

## పరమేశ్వరుడి దశావతారాలు

**1.మహాకాలావతారం :** సత్పురుషులందరికీ భుక్తిని ముక్తినిఇచ్చే మహాకాళుడి అవతారం దశావతారాల్లో మొదటిది. ఈ అవతారంలో మహాకాళుడికి పత్నిగా 'మహాకాళీదేవి' వుంటుంది.

**2. తారేశ్వరావతారం :** పరమేశ్వరుడి రెండో అవతారం తారేశ్వరుడు. ఈ అవతారంలో 'తారాదేవి' స్వామికి ప్రియపత్నిగా ఉంటుంది. వీరిద్దరూ తమ భక్తుల్ని అనుక్షణం కాపాడుతూ ఉంటారు.

**3. బాలభువనేశుడు :** పరమేశ్వరుడు ధరించిన అవతారాల్లో మూడోది బాలభువనేశ్వరావతారం. ఈ అవతారంలో స్వామికి 'బాలభువనేశ్వరీదేవి' భార్యగా ఉంటుంది

**4. షోడశివిద్యేశ్వరుడు:** పరమేశ్వరుడు నాలుగో అవతారం షోడశీవిద్యేశ్వరుడు. ఈ అవతారంలో స్వామికి 'శిషోడశి విద్యేశ్వరీదేవి' భార్యగా ఉంటుంది.

**5. భైరవావతారం :** పరమేశ్వరుడి దశావతారాల్లో భైరవావతారం అయిదవది. ఈ అవతారంలో స్వామికి భార్యగా 'శ్రీభైరవీదేవి' వుంటుంది. ఈమె ఉపాసకుల కోరికల్ని తీరుస్తుంది.

**6. చిన్నమస్తకావతారం :** శివుడి దశావతారాల్లో ఆరో అవతారం ఛిన్న మస్తకేశ్వరుడు. ఈ అవతారంలో స్వామికి "శ్రీఛిన్నమస్తాదేవి" భార్యగా వుండి భక్తుల అభీష్టాల్ని నెరవేరుస్తుంది.

**7. ధూమవంతుడు :** పరమేశ్వరుడు ధరించిన అవతారాల్లో ఏడో అవతారం 'ధూమవంతుడు' ఈ అవతారంలో స్వామికి భార్యగా 'ధూమావతీదేవి' ఉంటుంది. వీరిద్దరూ తమని ఉపాసించే సాధకుల మనోరథాలని నెరవేరుస్తుంటారు.

**8. బగళాముఖుడు :** పరమేశ్వరుడు ధరించిన అవతారాల్లో ఎనిమిదో అవతారం బగళాముఖుడు. ఈ అవతారంలో స్వామికి భార్యగా 'బగళాముఖీదేవి' ఉంటుంది. ఈమే మహానందాదేవిగా కూడా విఖ్యాతి పొందింది.

**9. మాతంగుడు :** పరమేశ్వరుడి దశావతారాల్లో తొమ్మిదోఅవతారం మాతంగేశ్వరుడు. ఈ అవతారంలో స్వామికి భార్యగా 'మాతంగీదేవి' ఉంటుంది. వీరిద్దరూ తమ భక్తుల అభీష్టాల్ని నెరవేరుస్తుంటారు.

**10. కమలుడు :** శివుడి అవతారాల్లో పదో అవతారం శ్రీ కమలేశ్వరుడు. ఈ అవతారంలో శ్రీకమలాత్మికాదేవి స్వామికి భార్యగా ఉంటుంది.

ఈ పదిరకాల శివావతారాలు భక్తులకి సుఖాన్ని భుక్తిని, ముక్తిని ఇస్తాయి. పరమేశ్వరుడి ఈ పది అవతారాల్నీ నిత్యం భక్తి శ్రద్ధలతో సేవించిన వారికి ఎన్నో సుఖాలు కలుగుతాయి. ఈ పది అవతారాలు తంత్ర శాస్త్రానికి సంబంధించినవి. ఈ పది అవతారాల్లో పరమేశ్వరుడికి భార్యలుగా ఉన్న పదిమంది శక్తి స్వరూపిణులు 'దశమహావిద్యలుగా లోకంలో ప్రసిద్ధి చెందారు.

## ఏకాదశ రుద్రుల అవతారాలు

పూర్వం రాక్షసుల దాడికి గురైన దేవతలు వారిని ఎదిరించలేక స్వర్గాన్ని వదిలిపారిపోయారు. ఏంచేయాలో దిక్కుతోచక అందరూ వెళ్ళి కశ్యపప్రజాపతిని ప్రార్థించారు. "అయ్యా! మేమంతా రాక్షసుల దాడిని తట్టుకోలేకపోతున్నాం. మమ్మల్ని మీరే రక్షించాలి" అని వేడుకున్నారు. కశ్యపుడు దేవతల మాటలు విని ఏమాత్రం ఆందోళన పడకుండా వారిని ఓదార్చి, దేవతల్ని కాపాడాలనే సంకల్పంతో కాశీనగరానికి వెళ్ళాడు. అక్కడ గంగలో స్నానం చేసి విశ్వేశ్వరుణ్ణి విశాలాక్షిని భక్తిగా అర్చించాడు.

ఒక శివలింగాన్ని గంగాతీరంలో స్థాపించి, పరమేశ్వరుడి గురించి కఠోరమైన తపస్సు చేసాడు. అలా చాలాకాలం గడిచిపోయింది. ఒక శుభ ముహూర్తంలో భక్తజన వత్సలుడైన శంకరుడు కశ్యపుణ్ణి అనుగ్రహించి ప్రత్యక్షమయ్యాడు. దివ్యమంగళాకారుడైన పరమేశ్వరుణ్ణి చూసి పులకించిపోయిన కశ్యపుడు ఎంతో దివ్యంగా ఆయన్నిలా కీర్తించాడు.

దేవదేవ మహేశాన శరణాగతవత్సల ।
సర్వేశ్వరః పరాత్మాత్వం ధానగమ్యోఽ ద్వయోఽ వ్యయః॥

*(శ్లో॥13,అధ్యా-18)*

దేవదేవా! మహాదేవా! శరణాగతవత్సలా! నీవు సర్వేశ్వరుడివి, పరమాత్మవి, ధ్యానంద్వారా పొందతగిన వాడివి, అద్వితీయుడివి, నాశనం లేనివాడివి. సత్పురుషులకి శరణ్యుడవైన నీవు రాక్షసుల బలాన్ని తగ్గించాలి. ఓదీన బంధూ! దయా సముద్రా! భక్తుల్ని రక్షించటంలో నీవే సర్వ సమర్థుడివి.

దేవతలందరూ నీ భక్తులు. నిన్నే నమ్మినవారు నేడు రాక్షసుల చేతిలో పరాభవం పొంది ఎంతో విలపిస్తున్నారు. ప్రభూ! వారంతా కాపాడమని నన్ను శరణువేడుకున్నారు. పరమేశ్వరా! దేవతల దుఃఖాన్ని తొలగించగలిగిన సమర్థుడివి నీవే. అందుకే నీకోసం కఠోరమైన తపస్సుచేసాను. దేవతలందరూ నా పుత్రులు. వారికి నీవు సాయం చేయి వారికష్టాల్ని పోగొట్టు. అందుకోసం సాక్షాత్తు పరమేశ్వరుడివైన నీవు నాకు పుత్రుడిగా జన్మించు" అని ప్రార్థించాడు.

కశ్యపుడి ప్రార్థనవిన్న శంకరుడు 'తథాస్తు' అని పలికి కశ్యపుణ్ణి ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు. కశ్యపుడు తన కోరిక నెరవేరినందుకు ఎంతో ఆనందించి వెంటనే తన స్థానానికి వచ్చి సంతోషకరమైన ఆవార్తని దేవతలకి చెప్పాడు.

ఒక శుభముహూర్తంలో శంకరుడు కశ్యపుడికిచ్చిన మాట ప్రకారం కశ్యపుడివల్ల సురభిద్వారా పదకొండు రూపాలతో అవతరించాడు. ఆ సమయంలో గొప్ప ఉత్సవం జరిగింది. దేవతలంతా ఆనందంతో సంబరాలు చేసుకున్నారు.

కపాలీ పింగళో భీమో విరూపాక్షో విలోహితః ।
శాస్తాౖజపా దహిర్భుధ్న్య శ్శంభుశ్చండో భవ స్తథా ॥

*(శ్లో॥26,అధ్యా-18)*

సురభిద్వారా పరమేశ్వరుడు ధరించిన పదకొండు మందీ 1.కాపాల 2.పింగళుడు 3.భీముడు 4.విరూపాక్షుడు 5.విలోహితుడు 6.శాస్త 7.అజపాత్ 8.అహిర్బుధ్న్యుడు 9.శంభుడు 10.చండుడు 11.భవుడు అనేవారు. శివ స్వరూపులైన ఈ పదకొండుమందినే ఏకాదశ రుద్రులంటారు. వీరంతా దేవతల్ని రక్షించటం కోసం ఆవిర్భవించి, వారి సుఖానికి కారకులుగా ఉన్నారు.

కశ్యపుత్రులైన ఈ ఏకాదశ రుద్రులు మహావీరులు. వీరంతా యుద్ధంలో దేవతలకి సహాయంగా నిలిచి రాక్షసులందర్నీ సంహరించారు. అలా ఇంద్రాది దేవతలు తిరిగి తమ తమలోకాల్ని రుద్రుల సాయంతో చేరుకున్నారు. ఇప్పటికీ శివావతారులైన రుద్రులు స్వర్గంలోనే నివసిస్తూ దేవతలకి రక్షకులుగా ఉన్నారు.

# ద్వాదశ జ్యోతిర్లింగాలు

పరమేశ్వరుడు మానవుల్ని తరింపచేయటానికి భూలోకంలో ఎన్నో క్షేత్రాల్లో ఎన్నో రూపాలతో వెలిసాడు. ఆయన అవతరించిన అన్ని లింగాల కన్నా ఎంతో విశిష్ఠమైనవి ద్వాదశ జ్యోతిర్లింగాలు. స్మరిస్తేనే సకల పాపాల్నీ హరింపచేసే ఈ పన్నెండు జ్యోతిర్లింగాలు నాటినుంచీ నేటి వరకూ భక్తుల మనోభీష్ఠాల్ని నెరవేరుస్తూనే ఉన్నాయి.

సౌరాష్ట్రే సోమనాథశ్చ శ్రీశైలే మల్లికార్జునః ।
ఉజ్జయిన్యాం మహాకాల ఓంకారే చామరేశ్వరః ॥ 1
కేదారో హిమవత్పృష్ఠే డాకిన్యాం భీమశంకరః ।
నారాయణస్యాం చ విశ్వేశస్త్ర్యంబకో గౌతమీ తటే ॥ 2
వైద్యనాథశ్చితా భూమౌ నాగేశో దారుకావనే ।
సేతుబంధే చ రామేశో ఘుశ్మేశశ్చ శివాలయే ॥ 3
అవతార ద్వాదశకమేతచ్ఛంభోః పరాత్మనః ।
సర్వానందకరం పుంసాం దర్శనస్పర్శనాన్మునే ॥ 4

శ్లో॥ 1-4 (అధ్యా 42) (శతరుద్రసంహిత)

1.సౌరాష్ట్రదేశంలో - సోమనాథుడు 2.శ్రీశైల క్షేత్రంలో - మల్లికార్జునుడు 3.ఉజ్జయినిలో - మహాకాళుడు 4.ఓంకార క్షేత్రంలో - అమరేశ్వరుడు 5.హివచ్ఛిఖరం మీద - కేదారేశ్వరుడు 6.ఢాకినీ క్షేత్రంలో - భీమశంకరుడు 7.వారణాసిలో - విశ్వేశ్వరుడు 8.గౌతమీ (గోదావరీ) తీరంలో - త్ర్యంబకుడు, 9.చితాభూమి(పర్లి)లో వైద్యనాథుడు 10.దారుకావనంలో - నాగేశ్వరుడు 11.సేతుబంధంలో - రామేశ్వరుడు 12.శివాలయ క్షేత్రంలో - ఘుశ్మేశుడు ఈ పన్నెండు జ్యోతిర్లింగాలు పరమేశ్వరుడి పన్నెండు అవతారాలు. ఈ లింగాలు అన్నీ స్పృశించటం (తాకటం) స్మరించటం ద్వారా మానవులకి ముక్తినిస్తాయి.

**1.సోమనాథజ్యోతిర్లింగం :** చంద్రుడి దుఃఖాన్ని పోగొట్టిన వాడు సోమనాథుడు. ఈ శివలింగాన్ని పూజిస్తే క్షయ, కుష్ఠులాంటి భయంకరమైన వ్యాధులు తొలగిపోతాయి. పూర్వం సౌరాష్ట్ర దేశంలో పరమేశ్వరుడు లింగరూపంలో ఆవిర్భవించగా చంద్రుడు ఆయన్ని సేవించాడు. అందుకే ఆ జ్యోతిర్లింగానికి సోమేశ్వర జ్యోతిర్లింగమనే పేరు వచ్చింది. సోమనాథ క్షేత్రంలో చంద్రకుండం వుంది. సకల పాపహరమైన ఆ కుండంలో స్నానం చేసినవారికి సకల రోగాలూ నశిస్తాయి. పరమాత్మ స్వరూపమైన సోమనాథజ్యోతిర్లింగాన్ని దర్శించినవాడికి భుక్తి ముక్తి లభిస్తాయి.

**2.మల్లికార్జున జ్యోతిర్లింగం :** దక్షిణ దేశంలో శ్రీగిరి పర్వతం మీద పరమేశ్వరుడు 'మల్లికార్జునుడు' అనేపేరుతో జ్యోతిర్లింగ స్వరూపుడుగా వెలసాడు. పుత్రసంతానం కావాలని కోరుకునేవాళ్ళు మల్లికార్జున జ్యోతిర్లింగాన్ని సేవించాలి. పరమేశ్వరుడు ఎంతో ఆనందంగా ఈ శ్రీగిరి మీదకివచ్చి మల్లికార్జునుడిగా నిలిచాడు. పరమపవిత్రమైన ఈ జ్యోతిర్లింగాన్ని దర్శించి, పూజించినవాళ్ళకి సకల సౌఖ్యాలూ లభిస్తాయి. మరణానంతరం ముక్తి పొందుతారు.

**3.మహాకాళేశ్వర జ్యోతిర్లింగం :** ఉజ్జయినీ మహానగరంలో పరమేశ్వరుడు మహాకాళేశ్వరుడుగా ఆవిర్భవించాడు. పూర్వం 'దూషణుడు' అనే అసురుడు వేదధర్మాన్ని నశింపచేయాలని భావించి అక్కడున్న వేద పండితుల్ని నాశనం చేయటం ప్రారంభించాడు. ఆ సమయంలో తండ్రుల్ని కోల్పోయిన వేదపండితుల పుత్రులు రక్షించమని పరమేశ్వరుణ్ణి ప్రార్థించగా స్వామి మహాకాళుడిగా అవతరించి కేవలం తన హూంకారంతో దూషణుణ్ణి భస్మంచేసేసాడు. ఇక ఆనాటి నుంచి అక్కడి భక్తుల కోరికననుసరించి మహాకాళజ్యోతిర్లింగ రూపంతో స్థిరంగా నిలిచాడు. ఈ మహాకాళేశ్వరుణ్ణి దర్శించి పూజించినవారికి సకలాభీష్టాలూ నెరవేరతాయి. మరణానంతరం ముక్తి లభిస్తుంది.

**4.ఓంకారేశ్వర జ్యోతిర్లింగం :** పరమేశ్వరుడు ఓంకారేశ్వర జ్యోతిర్లింగంగా భూలోకంలో అమరేశ్వర క్షేత్రంలో ఆవిర్భవించాడు. పూర్వం వింధ్యుడు ఈ

శివలింగాన్ని ఎంతో భక్తి శ్రద్ధలతో పూజించాడు. అయితే ముందుగా ఆయన పూజించింది ఒక పార్థివ లింగాన్ని తరువాత ఆ పార్థివ లింగం నుంచి దేవతలందరి కోరిక మేరకు భక్తులకి భుక్తి ముక్తుల్ని ప్రసాదించే ఓంకారేశ్వరుడు ఆవిర్భవించాడు. ఈ ఓంకారేశ్వరుణ్ణి అర్చించిన వారికి భోగమోక్షాలు రెండూ లభిస్తాయి.

**5.కేదారేశ్వర జ్యోతిర్లింగం :** పవిత్రమైన హిమాలయ పర్వతం మీద నరనారాయణులు ఎంతో కాలం నుంచీ తపస్సుచేసుకుంటున్నారు. వారితోపాటు మరెందరో మహర్షులు కూడా అక్కడే యోగసాధన చేసుకుంటున్నారు. వారందరి ప్రార్థన విని పరమేశ్వరుడు కేదారేశ్వరుడిగా హిమాలయాల్లో ఆవిర్భవించాడు. ప్రతిరోజూ హిమాలయంలో ఉండే సాధువులు, సత్పురుషులు స్వామిని దర్శించి పూజిస్తుంటారు. కేదారేశ్వరజ్యోతిర్లింగాన్ని దర్శించిన వారికి పునర్జన్మ ఉండదు.

**6.భీమేశ్వర జ్యోతిర్లింగం :** పూర్వం శంకరుడు భీమేశ్వరుడుగా అవతరించి భీమాసురడనే అసురుణ్ణి సంహరించాడు. కామరూపదేశాన్ని పాలించే సుదక్షిణుడనే భక్తుణ్ణి భీమాసురుడనేవాడు బాధిస్తుండగా స్వామి అవతరించి అసురుణ్ణి చంపి రాజుని రక్షించాడు. సుదక్షిణుడు పాలించే నగరం డాకినీపురం. సుదక్షిణుడు ప్రార్థన మన్నించి పరమేశ్వరుడు భీమశంకరుడనే పేరుతో ఆ క్షేత్రంలో జ్యోతిర్లింగంగా వెలిసాడు. భక్త సులభుడైన భీమశంకరుణ్ణి దర్శిస్తే సకల శుభాలూ కలుగుతాయి.

**7.విశ్వేశ్వర జ్యోతిర్లింగం :** కరుణారస మూర్తి అయిన పరమేశ్వరుడు మోక్షపురి కాశీక్షేత్రంలో విశ్వేశ్వరుడిగా అవతరించాడు. కాశీక్షేత్రంలో కొలువైన స్వామిని సకల దేవతలు, ఋషులు, మునులు, నిత్యం పూజిస్తారు. క్షేత్ర పాలకుడైన కాలభైరవుడు కూడా స్వామిని నిరంతరం సేవిస్తూనే ఉంటాడు. కాశీ విశ్వేశ్వర జ్యోతిర్లింగాన్ని దర్శించి స్పర్శించిన వారికి కైవల్యం ప్రాప్తిస్తుంది.

**8.త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగం :** పరమేశ్వరుడు పరమపవిత్రమైన గౌతమీతీరంలో త్ర్యంబకేశ్వరుడిగా అవతరించాడు. గౌతమ మహాముని కోరిక ననుసరించి స్వామి అక్కడ జ్యోతిర్లింగ రూపంలో స్థిరంగా నిలిచి భక్తజనుల పూజలు అందుకుంటున్నాడు. పరమేశ్వరుడు ప్రియురాలైన గంగాదేవి శివుడి అనుగ్రహంతో గౌతమమహర్షికి ఆనందం కలిగించటం కోసం ఆ ప్రాంతంలో గౌతమీ (గోదావరి) నదిగా ప్రవహిస్తోంది.

**9.వైద్యనాథ జ్యోతిర్లింగం :** పూర్వం రావణాసురుడి కారణంగా పరమేశ్వరుడు చితాభూమి క్షేత్రంలో వైద్యనాథుడిగా ఆవిర్భవించాడు. పర్లిక్షేత్రంలో వెలసిన వైద్యనాథజ్యోతిర్లింగాన్ని దర్శించిన వారికి సకల బాధలు తొలగిపోతాయి. ఆయురారోగ్య ఐశ్వర్యాలు లభిస్తాయి. దీర్ఘకాలిక వ్యాధులున్నవారు స్వామిని దర్శిస్తే సంపూర్ణ ఆరోగ్యం లభిస్తుంది.

**10.నాగేశ్వర జ్యోతిర్లింగం :** దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయటంకోసం పరమేశ్వరుడు నాగేశ్వరజ్యోతిర్లింగంగా వెలసాడు. పూర్వం దారుకావన ప్రాంతాన్ని పాలించే తనభక్తుడైన సుప్రియుణ్ణి, దారుకుడనే అసురుడు ఎన్నో బాధలకి గురిచేయటంతో, శివుడు అవతరించి ఆ దారుకుణ్ణి సంహరించాడు. తరువాత సుప్రియుడి కోరిక ప్రకారం పార్వతీదేవితో కలిసి ఆ దారుకా వనంలోనే నాగేశ్వర జ్యోతిర్లింగంగా నిలిచి భక్తుల పూజలందుకుంటున్నాడు. ఈ జ్యోతిర్లింగాన్ని దర్శించిన వారికి కష్టాలన్నీ తీరిపోతాయి. సకల పాపాలూ నశిస్తాయి.

**11.రామేశ్వర జ్యోతిర్లింగం :** పూర్వం శ్రీరామచంద్రుడి చేత సేతుబంధ క్షేత్రంలో రామేశ్వరుడు సేవించబడ్డాడు. భక్తవత్సలుడైన శంకరుడు సాగర తీరంలో రామేశ్వర జ్యోతిర్లింగంగా కొలువైఉండగా, లంకారాజ్యంపై దండెత్తటానికి వచ్చిన రాముడు స్వయంగా ఆయన్ని పూజించాడు. రామచంద్రుడి కోరిక మేరకే స్వామి అక్కడ లింగరూపంలో వెలసాడు. భూలోకంలో రామేశ్వరం లాంటి దివ్య క్షేత్రం మరొకటి లేదు. రామేశ్వరుణ్ణి దర్శించిన వారికి భక్తి

ముక్తి రెండూ లభిస్తాయి. కాశీక్షేత్రం నుంచి గంగా జలాన్ని తెచ్చి స్వామిని అభిషేకిస్తే అనంతమైన పుణ్యం లభిస్తుంది.

**12.ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగం :** పరమేశ్వరుడు ధరించిన అవతారాల్లో పన్నెండో అవతారం ఘుశ్మేశ్వరుడు. పూర్వం దక్షిణదిశలో దేవశైలం అనే ప్రాంతంలో, ఒక దివ్యమైన సరస్సులో ఘుశ్మేశ్వరుడు ఆవిర్భవించాడు. "సుదేహ" అనే స్త్రీ ఘుశ్మ అనే తన భక్తురాలి పుత్రుణ్ణి సంహరించగా, భక్తురాలి ప్రార్ధన విని పరమేశ్వరుడు చనిపోయిన ఆమె పుత్రుణ్ణి బ్రతికించాడు. తరువాత ఆమె కోరిక ప్రకారం ఆమె పేరుతోనే ఘుశ్మేశ్వరుడిగా వెలిసి భక్తజనుల పూజలందుకుంటున్నాడు. పాపనాశనాన్ని కలిగించే ఘుశ్మేశ్వర లింగాన్ని దర్శించిన వారికి భోగమోక్షాలు రెండూ లభిస్తాయి.

ఈ పన్నెండు జ్యోతిర్లింగాల వృత్తాంతాన్నిగానీ, జ్యోతిర్లింగాల పేర్లని గానీ నిత్యం స్మరిస్తే చాలు మానవుల కోరికలన్నీ తీరతాయి. అందరికీ శివానుగ్రహం శివలోక ప్రాప్తి కలుగుతుంది.

## ఉప జ్యోతిర్లింగాలు

పరమేశ్వరుడు స్వయంభువుగా వెలిసిన పన్నెండు జ్యోతిర్లింగాలతోపాటు 9 ఉపజ్యోతిర్లింగాలు కూడా ఉన్నాయి.

1)సోమేశ్వరుడి ఉపలింగం-అంతకేశ్వరుడు. ఇది మహానది సముద్రంలో కలిసేచోట ఉన్నది. 2)మల్లికార్జునుడి ఉపలింగం-రుద్రేశ్వరుడు. ఇది భృగుకక్షం అనే ప్రాంతంలో ఉన్నది. 3)మహాకాళేశ్వరుడి ఉపలింగం - దుగ్ధేశ్వరుడు. ఈ లింగం నర్మదానదీ తీరంలో ఉన్నది. 4)ఓంకారేశ్వరుడి ఉపలింగం - కర్దమేశ్వరుడు. ఈ లింగం బిందుసరోవరం అనే ప్రాంతంలో ఉన్నది. 5)కేదారేశ్వరుడి ఉపలింగం - భూతేశ్వరుడు. ఈ శివలింగం యమునాతీరంలో ఆవిర్భవించింది. 6.భీమశంకరుడి ఉపలింగం - భీమేశ్వరుడు. ఈ శివలింగం సహ్యాపర్వతం మీద నెలకొంది. 7)నాగేశ్వరుడి ఉపలింగం - భూతేశ్వరుడు. ఈ శివలింగం మల్లికా సరస్వతీ తీరంలో ఉన్నది

8)రామేశ్వరుడి ఉపలింగం – గుప్తేశ్వరుడు. 9) ఘుశ్మేశ్వరుడి ఉపలింగం – వ్యాఘ్రేశ్వరుడు.

ఈ విధంగా పన్నెండు జ్యోతిర్లింగాలతో తొమ్మిది జ్యోతిర్లింగాలకి ఉపలింగాలు ఏర్పడ్డాయి. ఈ ఉపలింగాలు కూడా జ్యోతిర్లింగాల నుంచే ఆవిర్భవించబడ్డాయి. కాబట్టి ప్రధానజ్యోతిర్లింగాలు ఇచ్చే శుభఫలితాల్నే ఇవికూడా మానవులకి ప్రసాదిస్తాయి.

## శివపురాణం – ఫలశ్రుతి

పరమపవిత్రమైన శివపురాణాన్ని ప్రయత్నపూర్వకంగా ఎంతో భక్తితో పఠించాలి. లేదా వినాలి. ఈదివ్య పురాణాన్ని

ఏతచ్ఛ్రుత్వా హ్యేకవారం భవేత్పాపం హి భస్మసాత్ ।
అభక్తో భక్తిమాప్నోతి భక్తో భక్తి సమృద్ధిభాన్ ॥ *(శ్లో॥45–అధ్యా 41)*

ఒక్కసారి వింటే చాలు పాపాలన్నీ భస్మమైపోతాయి. శివభక్తి లేని వాడికి భక్తి కలుగుతుంది. భక్తి ఉన్నవాడికి ఇంకా భక్తి పెంపొందుతుంది. మోక్షం కావాలని కోరుకునేవాడు ఈ దివ్యపురాణాన్ని అయిదుసార్లు చదవాలి. ఎవరైతే ఈ శివపురాణాన్ని భక్తితో పారాయణ చేస్తాడో లేక వింటాడో అతడు సకల పాపాలనుంచీవిముక్తుడై శివసాయుజ్యాన్ని పొందుతాడు. భుక్తిని ముక్తిని ప్రసాదించే ఈ శివపురాణం పరమేశ్వరుడికి అత్యంత ప్రీతి పాత్రమైనది.

ఓం నమఃశివాయ

స్వస్తి

సర్వేజనాః సుఖినోభవంతు



